ఎప్పుడు? నిర్దయ గుడిసెలో అశాంతి కప్పు క్రింద ఎంత కాలం మనుగడను సాగిస్తావు? రా! ఇలారా! ఆ మాయాజాలం నుండి బయటపడు!

వచ్చావా! వచ్చేశావా! ఇక పోదాం పద. వెను దిరిగి చూడకు. శాంతి సదనం ముందుంది. నవ కొరకు నిరీక్షిస్తూ ఉంది. భారాలు లేని, బాధలు తెలియని, భయాలు అర్థం గాని అభయ సదన మది. శాంతి నిలయ మది. ముకుందుని మందిర మది. అదిగో . . . పో. . . పో . . . అలాగే ముందుకు పో!

*ఏష్యామి బుద్ధే భవతీతి శాన్త్యై*
*గచ్ఛాశు గోవింద పదార విన్దమ్ ।*
*యద్యన్తరా త్వాం విషయా నిపాత్య*
*క్రోశస్వ మంభోరుహ లోచనేతి ॥*

మనసా! వెళ్ళు. . . వెళ్ళు . . ! బాధల నుండి బయటపడి శాంతిని పొందాలని ఉందా? అయితే, వెళ్ళు! గోవిందుని చరణార విందాలను పట్టుకో! మార్గమధ్యంలో విషయాలు అడ్డు తగిలి అవరోధాలను సృష్టిస్తాయేమో నని భయపడకు! అదే జరిగితే, కమలలోచనా! కృష్ణా! అని బిగ్గరగా అరిచేయ్ *(ఆక్రోశ)!*

ఆర్తుల బాధలను చూచి ఆదుకొనేందుకే అచ్యుతునికి అంభోరుహ లోచనా లున్నాయి. కనిపెట్టుకొని కాపాడేందుకే కన్నయ్యకు కమల నయనా లున్నాయి. ఆలోచించకు! ఆనందాన్ని దూరం చేసుకోకు! నీకు అంతా శుభమే జరుగుతుంది! తప్పక కైవల్యం ప్రాప్తిస్తుంది! అస్తు.

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే ఆత్మసంయమ యోగో నామ షష్ఠోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు ఆత్మసంయమ యోగ మనే ఆరవ అధ్యాయము.**





# చైతన్య భగవద్గీత

## అథ సప్తమోఽధ్యాయః - ఏడవ అధ్యాయము

## విజ్ఞాన యోగః - విజ్ఞాన యోగము

### త్వం పదార్థ శోధనము

ఇది ఏడవ అధ్యాయము. సంఖ్యాపరంగా లెక్కించే టప్పుడు ఏడు అనే అంకె వద్ద మనిషి సంశయిస్తాడు. ఏడు అన కుండా ఆరు న్నొకటి అంటాడు. ఏడు అంటే ఏడుపే మిగులు తుందేమో, దుఃఖం ప్రాప్తిస్తుందేమో అని సందేహిస్తాడు.

అలాగని అంకెల ఆగడాలకు జడిసి, జాతకాల జగడాలకు బెదిరి, వచ్చే దుఃఖం పారి పోతుందా? పెద్ది శాపాలకు ప్రారబ్ధం మారి పోతుందా? దుఃఖాన్ని ఎవ్వరూ ఆహ్వానించరు. **మా కశ్చిత్ దుఃఖభాగ్ భవేత్** - ఎవ్వరికీ దుఃఖం కలుగకుండు గాక! అనే బుధజను లందరూ భావిస్తారు. ప్రార్థిస్తారు. చీకటిని పొమ్మంటే పోతుందా? వెలుగు వస్తే చీకటి పోతుంది. దూరం కమ్మంటే దుఃఖం దూర మవుతుందా? పరమేశ్వరుడు హృదయంలో ప్రవేశిస్తేనే శోకం అంతరిస్తుంది.

పరమేశ్వరుడు హృదయంలో ప్రవేశించడానికి ఆయన హృదయంలో లేకపోతే కదా! ఆయన మన హృదయంలో ఉన్నాడు అనే సత్యాన్ని గ్రహించడమే, తెలుసుకోవడమే ఇక్కడ ప్రవేశ మంటే. దేవుడు ఎక్కడో మబ్బుల్లో దాగి ఉన్నాడని తలలు పైకెత్తి మతాలు ప్రార్థిస్తే, హృదయం లోనే ఉన్నాడని గ్రహించి, తలలు దించి, అంతర్ముఖులై ఋషులు ధ్యానమగ్ను లయ్యారు. **వేదాహ మేతం పురుషం మహాన్తం** - మహానుభావు డైన ఈ పురుషోత్తముని నేను తెలుసుకున్నాను అని పలికారు. నేను తెలుసుకున్నాను అంటే, ఆ మహాపురుషుడే నేను అని తెలుసుకున్నాను అని అర్థం. **అహం బ్రహ్మైవ** - నేను బ్రహ్మమునే అని తెలుసుకున్నాను అని బ్రహ్మాత్మజ్ఞానంతో దివ్యంగా పలికారు. నా విషయంలో 'నేను' అని చెప్ప బడేదే నీ విషయానికి వచ్చే సరికి 'నీవు' అని పలకడం జరుగుతూ ఉంది **(త్వం)**. నీవు అని ఏదైతే చెప్ప బడిందో అదే 'తాను' **(తత్)**. ఇలా నీవుగా, తానుగా వ్యవహరింప బడుతున్న ఇద్దరూ ఒక్కరే అయి ఉన్నారు. అదే **అసి** అనే క్రియాపదము. సమన్వయార్థక క్రియాపదము **(అసి)**. **తత్ - త్వమ్ - అసి** - ఈ మూడు పదములను పరిశోధించి వాటి స్వరూపాన్ని సంపూర్ణముగా గ్రహించడమే మోక్షము.

**త్వం** పదార్థ శోధనను మొదటి ఆరు అధ్యాయాలలో చెప్పుకొని కర్మసన్న్యాస రూపమై, సాధన ప్రధాన మైన ప్రథమ అధ్యాయ షట్కమును ముగించుకున్నాం. ఆత్మ స్వరూపాన్ని అవగతం చేసుకున్నాం. అదే సాంఖ్యం. రెండవ అధ్యాయం. శుద్ధ ఆత్మతత్త్వ విజ్ఞానం. జ్ఞాన ప్రాప్తికి, ఆత్మజ్ఞాన ప్రాప్తికి అవసర మయ్యే చిత్తశుద్ధికి ఉపాయ మైన కర్మయోగము అనే బహిరంగ సాధనను మూడు, నాలుగు, ఐదు అధ్యాయాలలో వీక్షించాము. అందులోనే, అంతరంగ సాధన మైన ధ్యానమును ఆరవ అధ్యాయంలో దర్శించాం. అంతటితో **త్వం** పదార్థ శోధన ముగిసింది. ప్రథమాధ్యాయ షట్కం ఇంతటితో సమాప్త మైంది.

### తత్ పదార్థ శోధనము

ఏడవ అధ్యాయంతో **తత్** పదార్థ శోధన ప్రారంభమై పన్నెండవ అధ్యాయమైన భక్తియోగం వద్ద సమాప్త మవుతుంది. ఈ ద్వితీయాధ్యాయ షట్కము **తత్** పద నిర్దేశము. పరమేశ్వరుని స్వరూపాన్ని గూర్చి చర్చిస్తుంది.

అరవ అధ్యాయంలో ప్రధానంగా మనోనిగ్రహము, సాధకుని జీవనసరళి, ధ్యానాభ్యాసము, యోగారూఢుని సమదర్శన భావము - ఇవన్నీ చర్చించడము జరిగింది. ***తస్మా ద్యోగీ భవార్జున!*** అంటూ అరవ అధ్యాయం నలభై అరవ శ్లోకంలో అరవ అధ్యాయంతో పాటు ప్రథమాధ్యాయ షట్కమును కూడా సంపూర్తి చేశాడు భగవంతుడు. ఆ తరువాత ఒక్క శ్లోకాన్ని జోడించడం జరిగింది. ఆ శ్లోకం లేకుండా అరవ అధ్యాయాన్ని నలభై అరవ శ్లోకం వద్దే ముగించి ఉంటే, ప్రశ్నబీజాన్ని ఊహించి ఏడవ అధ్యాయాన్ని ప్రవచించే అవకాశం లేకుండా పోయేది.

అర్జునా! నా యందే మనస్సు నుంచి, శ్రద్ధావంతుడై, నన్నే సేవించు వాడు యోగు లందరిలో శ్రేష్ఠు డని చివరగా జోడించిన శ్లోకాన్ని జొడించి రెండవ ఆరు అధ్యాయాలలో, ద్వితీయ అధ్యాయ షట్కంలో ఆరబోయాలని అచ్యుతుడు అభిప్రాయ పడ్డాడు.

నా యందు మనస్సును ఉంచి అనగానే, పరమేశ్వరుడు ప్రవేశించినట్లే అయింది. తత్పదము ఆవిష్కరింప బడింది. మధ్యమ షట్కము తత్పదార్థ వ్యాఖ్యానమే. ఈశ్వర స్వరూప వైభవ వివరణమే. పరమేశ్వరుని యందు (నా యందు) మనస్సు నుంచి అనగానే, అలా మనస్సును ఉంచడానికి పరమేశ్వరుని స్వరూప మేమిటో తెలియాలి కదా! ఆ ధ్యేయ బ్రహ్మ ఎవరు? ఆయన స్వరూప మేమిటి? ఆయన యందు మనస్సును నిలపడం ఎలా? ఈ ప్రశ్న లన్నీ అర్జునుడు అడగడానికి ఆ శ్లోకంలో బీజం వేశాడు. దీనినే శాస్త్ర పరిభాషలో ప్రశ్న బీజం అంటారు. ఎలాగూ ప్రశ్న బీజం పడింది కనుక, 'నా స్వరూపం ఇలాంటిది - ఈ విధంగా మనస్సును నా యందు ఉంచాలి' అని తానే స్వయంగా బోధించడానికి సప్తమాధ్యాయాన్ని ప్రారంభించాడు *(యోగినామపి . . . యుక్త తమోమతః (6 -47)* ***ఇతి ప్రశ్న బీజమ్ ఉపన్యస్య స్వయ మేవ 'ఈదృశం మదీయం తత్త్వం, ఏవం మద్గతాంత రాత్మా స్యాత్' ఇతి ఏతత్ వివక్షుః).***

తత్పదార్థ శోధనము మరియు ఉపాస్య ప్రధానము అయిన ఈ ఏడవ అధ్యాయము సిద్ధాంతపరంగా జ్ఞేయ బ్రహ్మను, సాధన పరంగా ధ్యేయబ్రహ్మను గూర్చి అసమానంగా ప్రవచిస్తుంది. మొదటి ఆరు అధ్యాయాలలో స్పృశించని ఆశ్చర్యకర మైన విషయాన్ని గీతాచార్యుడు అమోఘంగా ప్రవేశ పెడతాడు. ఇంతవరకు వ్యక్తిని కేంద్రంగా చేసికొని సాగిన ప్రవచనము ఇక్కడ నుండి సమిష్టి లోకి ఒక్కసారి లంఘించి ***వాసుదేవస్సర్వమితి***అని ఐశ్వర్య స్వరూపాన్ని కీర్తిస్తూ ***మత్తః పరతరం నాస్తి***అని సమస్తాన్ని తన కౌగిలిలో బంధిస్తుంది.

పరమేశ్వరునిపై ఆసక్తితో ***(మయ్యాసక్త మనాః)*** భక్తి ప్రాధాన్యంగా ప్రారంభ మయ్యే ఈ మధ్యమ షట్కము భగవత్స్వరూప మైన భక్తియోగంతో సమాప్త మవుతుంది ***(ధర్మ్యామృతం).***

భగవంతుడు అంటే అందరికీ ప్రియమే. ప్రియమైన భగవంతుని స్వరూపాన్ని సహేతుకంగా, సాంప్రదాయకంగా అర్థం చేసుకు న్నప్పుడే పూర్ణఫలం అందుతుంది. అలాగే అందరి హృదయాలలో ప్రేమ స్వరూప మైన భక్తి ఉంటుంది. భక్తి అనేది తాత్కాలిక ఆవేశం కాకూడదు. భావోద్రేకంగా మారకూడదు. భక్తి పేరుతో మనలో చెలరేగే ఆవేశాలను, భావాతిశయాలను, ఉద్రేకాలను భగవంతుడు బోధించే జ్ఞానం ద్వారా అదుపు చేసుకోవాలి. కుదుపు లేకుండా వాటిని సక్రమమైన మార్గం లోకి తెచ్చుకోవాలి. దారిలో పెట్టుకోవాలి. ఇవన్నీ మనకు మధ్యమ షట్కంలో అందుతాయి. సప్తమాధ్యాయం సమీపించింది. సావధానులై చదవండి.

**శ్రీ భగవానువాచ :**

మ య్యాసక్త మనాః పార్థ యోగం యుఞ్జ న్మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥ 1





**మయి-ఆసక్తమనాః-పార్థ-యోగం-యుంజన్-మదాశ్రయః**
**అసంశయం-సమగ్రం-మాం-యథా-జ్ఞాస్యసి-తత్-శృణు**

| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా! | | |
| మయి | = నా యందు | సమగ్రం | = పూర్తిగా |
| ఆసక్తమనాః | = ఆసక్తి గల మనస్సు కల వాడవై | మాం | = నన్ను |
| యోగం | = యోగమును | యథా | = ఎలా |
| యుంజన్ | = ఆచరించుచున్న వాడవై | జ్ఞాస్యసి | = తెలుసుకో గలవో |
| మదాశ్రయః | = నన్ను ఆశ్రయించిన వాడవై | తత్ | = దానిని |
| అసంశయం | = సందేహము లేకుండా | శృణు | = విను |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**పార్థా! నా యందే ఆసక్తి కలిగి ఉండు. నన్నే ఆశ్రయించుకో! యోగాన్ని అభ్యసిస్తూ ఉండు! నన్ను సంపూర్ణంగా, సందేహం లేకుండా తెలుసుకుంటావు. అదెలాగో చెబుతాను. శ్రద్ధగా విను!**

**వ్యాఖ్య**

**సందర్భ వైభవము**

భగవద్గీత పద్దెనిమిది అధ్యాయాలుగా మనకు కనిపిస్తున్నా, పద్దెనిమిది విషయాలుగా విభజింపబడి లేదు. విషయ మంతా ఒక్కటే. గీతాజ్ఞానం. విషయ ప్రాధాన్యాన్ని దృష్టిలో ఉంచుకొని పద్దెనిమిది అధ్యాయాలుగా విభజింప బడిన భగవద్గీతలో, కొన్ని అధ్యాయాలు ప్రస్తావించ బడిన విషయంతో సమాప్త మౌతాయి. కొన్ని అధ్యాయాలు విభజింప బడినట్లే ఉన్నా, అవి అవిభాజ్యంగా శోభిస్తూ ఉంటాయి. పూర్వోత్తరాధ్యాయాలు అంతర్యారంభాలలో సమన్వయంతో సమ్మిళితమై ఉంటాయి.

ఐదవ అధ్యాయం ఇరవై ఆరవ శ్లోకం లోనే కర్మసన్యాస యోగము సమాప్త మైంది. తరువాత మూడు శ్లోకాలు ధ్యాన విషయాన్ని ప్రస్తావిస్తూ సాగాయి. అంటే, తరువాత ఆరంభం కాబోయే ఆరవ అధ్యాయం ధ్యానయోగం కావడం చేత, ఐదవ అధ్యాయాంత మందే పునాది నిర్మించబడి, ఐదు ఆరు అధ్యాయాలను అనుసంధానం చేయడం జరిగింది.

అలాగే ఆరవ అధ్యాయం నలభై ఆరవ శ్లోకం లోనే సమాప్త మైనా, నలభై ఏడవ శ్లోకంలో భక్తి విషయాన్ని ***(తత్పదం)*** ప్రవేశపెట్టి, ఏడవ అధ్యాయంతో అనుసంధానం చేయడం జరిగింది. మధ్యమ షట్కము పరమేశ్వరునికి సంబంధించిన తత్పద శోధన అయినందున, ***మాం భజతే***- నన్ను భజించు వాడు అంటూ ఆరవ అధ్యాయాన్ని ముగించి, ***మయి ఆసక్తమనాః*** - నా యందు, అనగా పరమేశ్వరుని యందు లగ్నం చేయబడిన మనస్సు అంటూ భక్తి వైశిష్ట్యాన్ని ఆవిష్కరిస్తూ ఏడవ అధ్యాయాన్ని ప్రారంభిస్తున్నాడు.

పార్థా! నా యందే మనస్సును లగ్నం చేసి ***(మయి పరమేశ్వరే ఆసక్తం మనః యస్య సః),*** నేనే ఆశ్రయ మని భావించి ***(అహ మేవ పరమేశ్వరః ఆశ్రయః యస్య సః మదాశ్రయః),*** యోగమును అభ్యసిస్తూ ***(యోగం యుంజన్, మనః సమాధానం కుర్వన్),*** నన్ను నిస్సంశయంగా ***(అసంశయం),*** సంపూర్ణంగా ***(సమగ్రం)*** ఎలా తెలుసుకుంటావో ***(యథా జ్ఞాస్యసి)*** దానిని ఆలకించు ***(తత్ శృణు)*** అంటూ నిర్హేతుక కృపా విశేషం చేత అర్జుని ప్రశ్న కొరకు నిరీక్షించకుండానే, తాను వేసిన ప్రశ్నబీజాన్ని అంది పుచ్చుకొని ప్రవచించడం ప్రారంభించాడు పరమేశ్వరుడు.

**భగవదాసక్తి - భగవదాశ్రయం**

భగవంతుని యందు మనస్సు ఆసక్తిని కలిగి ఉండటమే భగవదాసక్తి. మహిమ యందు ఆసక్తి కలిగిన మనస్సు మాయల్లో, మాయా ప్రపంచంలో ఆసక్తి లేకుండా ఉంటుంది. మనస్సు దేనిని అభిలషిస్తుందో, దాని యందే ఆసక్తిని కలిగి ఉంటుంది. అర్థకామాలకు సంబంధించిన ప్రయోజనాన్ని ఆశించే వాడు అగ్నిహోత్ర, తప: దానాదులలో ఏదో ఒక దానిని ఆశ్రయించి ఉంటాడు.

అర్థకామాలపై ఆసక్తి ఉండేవాడు అగ్నిహోత్రాది కర్మలను ఆశ్రయిస్తాడు. యుద్ధరంగమున విజయంపై ఆసక్తి ఉండేవాడు అస్త్రశస్త్రాలను ఆశ్రయిస్తాడు. ఆరోగ్యంపై ఆసక్తి ఉండేవాడు వ్యాయామాన్ని ఆశ్రయిస్తాడు. సిరిసంపదలు, కీర్తిప్రతిష్ఠలపై ఆసక్తి ఉండేవాడు రాజకీయాన్ని ఆశ్రయిస్తాడు. భగవంతుని యందు ఆసక్తి కలవాడు భగవంతుణ్ణే ఆశ్రయిస్తాడు ***(మయ్యేవ ఆసక్త మనాః భవతి, మామేవ ఆశ్రయం ప్రతిపద్యతే).*** ఆశ్రయ స్థానము, ఆసక్తి స్థానము రెండూ భగవంతుడే అయి నపుడు మనస్సు భగవంతుని యందే ఉంటుంది గాని అన్య సాధ్య సాధనాల వైపు మరలదు.

భగవంతుని యందు ***(మయి పరమేశ్వరే)*** మనస్సుకు ఆసక్తి అంటే, జగత్కారణ మైన పరమేశ్వరుని తత్త్వమును తెలిసికొనుట యందు, నానా విధాలైన విభూతులతో జగద్రూపములో శోభిస్తున్న పరమేశ్వరుని వైభవమును దర్శించుట యందు ఆసక్తి కలిగి ఉండటము అని అర్థము. భగవంతుని కన్నా అన్యమైన విషయాలు ఎంత గొప్పవి అయినా, వాటి యందు ఆసక్తి లేకుండా ఉండటము అని అర్థము. ఈ విషయం అర్జునునికి బోధిస్తూ ఉన్నట్లు అనిపించినా, ముందే మనం అర్థం చేసుకున్నట్లు, గీతాసందేశము సర్వ మానవాళిని ఉద్దేశించి ప్రసంగించింది కనుక, అది అందరికీ సంబంధించింది.

ద్వారకలో దుర్యోధనార్జునులు కృష్ణుని ఆశ్రయించి, కురుక్షేత్ర యుద్ధంలో సహాయం అందించ మని ప్రార్థించి నపుడు, ముందు వచ్చిన దుర్యోధనునికి, ముందుగా చూచిన అర్జునునికి ఇరువురికీ సహాయం చేస్తానని వాగ్దానం చేసిన వాసుదేవుడు, సమరవీరులు, అసమాన యోధులు పది లక్షల మందితో అలరారే తన సైన్యము ఒక వైపు, ఆయుధాలు ధరించని, యుద్ధంలో పోరాడని తాను ఒక వైపు అని ప్రకటించి నపుడు, శ్రీకృష్ణుని పొంది అర్జునుడు సంతృప్తి చెందితే, పది లక్షల సైన్యాన్ని పొంది దుర్యోధనుడు పొంగి పోయాడు. అర్జునునికి దేని యందు ఆసక్తి ఉందో, దీనిని బట్టి అర్థ మవుతూ ఉంది. అర్జునుని ఆసక్తి అచ్యుతుని మీదనే ఉంది కనుక, సర్వమును త్యజించి వాసుదేవుణ్ణే వరించి ఆశ్రయించాడు.

**సాధన - సాధ్యము**

దేనిని పొందాలని అభిలషిస్తామో, దాని యందే మనకు ఆసక్తి ఉంటుంది. ఆసక్తి దేని మీద ఉంటుందో, దానికి సాధన మైన దానినే ఆశ్రయించుకోవడం జరుగుతుంది. భక్తునికి, లేదా ముముక్షువునకు మోక్షరూపు డైన ముకుందుని యందే కదా ఆసక్తి! ఆసక్తి భగవంతుని మీద ఉండే టప్పుడు ఆశ్రయము ఏదై ఉండాలి?

భగవంతుడు అనంతుడు. అనంతుడైన వానిని పొందటానికి అంతం కలిగిన వానిని ఆశ్రయిస్తే ఎలా? అనంతుని పొందాలి అంటే దానికి సాధనము అనంతమే అయి ఉండాలి. కర్మ ఏదైనా ఆరంభ నాశాలు కలదే కనుక అనంతం కాదు, కాలేదు. మరొక అనంతంతో పొందుదా మనుకుంటే, అనంతము అనేది అద్వయము, అఖండమే కాని, రెండు అనంతాలు ఉండలేవు. కనుక, అనంతుడైన భగవంతుని పొందాలని ఆశించే సాధకుడు, భగవంతుని యందే ఆసక్తిని కలిగి ఉంటాడు ***(మయ్యాసక్తమనాః).*** మరొక దానిని ఆశ్రయించుకొనే అవకాశం





లేనందున భగవంతుణ్ణే ఆశ్రయించుకుంటాడు ***(మదాశ్రయః).*** పొందవలసిన గమ్యమూ తానే. పొందుటకు ఉపకరించే మార్గమూ తానే.

భగవంతుడు, భగవంతుని జ్ఞానము రెండు కాదని ఇప్పటికే గ్రహించాము. భగవంతుని మీద ఆసక్తి ఉన్నందున ఈశ్వరుడే గమ్యము. ఈశ్వర జ్ఞానం వల్లనే ఈశ్వరుని పొందాలి కనుక, ఈశ్వర జ్ఞానమే మార్గము. ఈశ్వరుడు, ఈశ్వర జ్ఞానం రెండు కానందున, యోగికి గమ్యము, మార్గము రెండూ ఈశ్వరుడే. ఆసక్తి అచ్యుతుడే. ఆశ్రయం కూడా అచ్యుతుడే. చ్యుతం లేనివాడు అచ్యుతుడు. అంతం లేని వాడు అనంతుడు. తరగని అనంత వైభవానికి తరిగి పోయే మనస్సు అర్పిస్తున్న నీరాజనమే యోగం. ఇదే జ్ఞానయోగం. భక్తిని, ధ్యానాన్ని సహాయ భూతాలుగా గ్రహించి ప్రజ్వలిస్తున్న జ్ఞానయోగ ప్రదీపము.

ఈ విధంగా పరమేశ్వరునిపై ఆసక్తిని ఉంచి, పరమేశ్వరుణ్ణే ఆశ్రయించుకొని, దుఃఖ సంయోగ వియోగ మనే పేరు గల యోగమును *(6 - 23)* అభ్యసిస్తూ ***(యోగం యుంజన్),*** బ్రహ్మ సంస్పర్శ మైన అక్షయ సుఖాన్ని పొందడం జరుగుతుంది *(6 - 28).*

అది జ్ఞానము చేతనే ప్రాప్తిస్తూ ఉన్నందున, అట్టి జ్ఞానమును సంపూర్ణంగా ***(సమగ్రం),*** సందేహం లేకుండా ***(అసంశయం)*** గ్రహించ డానికి తన బోధను ఆలకించ మంటున్నాడు. అంటే, జ్ఞానము మార్గ మైనందున శ్రవణమే సాధనము అంటున్నాడు.

*తాను బోధించబోయే జ్ఞానము ఎలాంటిదో, అది ఎలా అసమాన వైభవముతో ఉందో వివరిస్తున్నాడు.*

**జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః ।**
**యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే ॥** 2

***జ్ఞానం-తే-అహం-సవిజ్ఞానం-ఇదం-వక్ష్యామి-అశేషతః***
***యత్-జ్ఞాత్వా-న-ఇహ-భూయః-అన్యత్-జ్ఞాతవ్యం-అవశిష్యతే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| యత్ | = | దేనిని | సవిజ్ఞానం | = | విజ్ఞాన సహితముతో కూడిన |
| జ్ఞాత్వా | = | తెలిసికొనిన తరువాత | ఇదం | = | ఈ |
| ఇహ | = | ఈ విషయంలో | జ్ఞానం | = | జ్ఞానమును |
| జ్ఞాతవ్యం | = | తెలియ దగింది | అశేషతః | = | నిశ్శేషముగా |
| భూయః | = | తిరిగి | అహం | = | నేను |
| అన్యత్ | = | వేరొకటి | తే | = | నీ కొరకు |
| న అవశిష్యతే | = | మిగలదో | వక్ష్యామి | = | చెబుతున్నాను |

**అర్జునా! విజ్ఞానముతో కూడిన ఈ జ్ఞానాన్ని సంపూర్ణంగా నీకు బోధిస్తాను. దానిని గ్రహించావా, ఆ తరువాత గ్రహించ వలసింది మరొకటి ఉండదు.**

**వ్యాఖ్య**

**అద్వయ స్వరూపము**

వివిధ ప్రత్యయ గమ్యమైన ఈ విశ్వంలో ఒక వైపు అద్భుత నిర్ణయశక్తిగా ఉంటూ, మరో వైపు అసమానంగా విశ్వాన్ని అధిగమించి అఖండ చైతన్యంగా భాసిస్తూ విరాజిల్లే అద్వితీయ స్వరూపశక్తి ఒకటి ఉంది. అదే పరమేశ్వర స్వరూపము. జగత్తుకు కారణ మైంది అదే. జగత్తుకు విలక్షణంగా శోభించేది కూడా అదే. ప్రతి వస్తువులో అదే అర్థం కాకుండా ఒదిగి ఉంది. ప్రతి వ్యక్తిలో అదే అనిర్వచనీయంగా వెలుగుతూ ఉంది. దాని ఆజ్ఞలకు లోబడే

ఈ జగత్తు ప్రవర్తిస్తూ ఉంది. ఈశ్వర స్వరూపము ఎలా ఉందో, ఈశ్వర స్వరూపమైన జ్ఞానం కూడా అలాగే ఉంది. స్వరూపము అఖండము కనుక జ్ఞానము కూడా అద్వయమే. అద్వితీయమే. అద్వైతమే.

అద్వయ స్వరూపము అనంతము కనుక జ్ఞానము కూడా అనంతమే. స్వరూపము అక్కడ - జ్ఞానము ఇక్కడ ఉండే అవకాశ ముందా? వస్తువు అఖండ మైనపుడు జ్ఞానము కూడా అఖండమే. అనంతమైన ఈశ్వర స్వరూపము అంతటా ఉంది. కనుక ఇక్కడ కూడా ఉంది. స్వరూపము జ్ఞాన రూపం కనుక, జ్ఞానం కూడా ఇక్కడే ఉంది. దానినే 'ఈ జ్ఞానము' అంటున్నాడు భగవానుడు *(ఇదం జ్ఞానం).* ఈ జ్ఞానమును విజ్ఞాన సహితంగా, సంపూర్ణంగా భగవంతుడు బోధిస్తున్నాడు *(ఇదం సవిజ్ఞానం జ్ఞానం అశేషతః వక్ష్యామి).* ఇదే పూర్ణ జ్ఞానము. పరిపూర్ణ జ్ఞానము. అద్వైత జ్ఞానము. ఈ జ్ఞానమును పొందిన తరువాత తెలియ దగింది వేరొకటి మిగలదు *(యద్ జ్ఞాత్వా పునః జ్ఞాతవ్యం న అవశిష్యతే).*

**జ్ఞానము - విజ్ఞానము**

ఆరవ అధ్యాయం - ఎనిమిదవ శ్లోకంలో యోగారూఢుని రూపంలో ఒక మహిమాన్విత శక్తి, పరమ పవిత్రమూర్తి మనకు దర్శన మిస్తాడు. అతడే జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముడు. అంటే శాస్త్ర పరిజ్ఞానం సంపూర్ణంగా కలిగిన వాడు. శాస్త్రం నుండి గ్రహించిన విషయాన్ని అదే విధంగా అనుభవం లోనికి తెచ్చుకున్న వాడు జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముడు. ఆ జ్ఞాన విజ్ఞానాలే ఇక్కడ విస్పష్టం చేయబడు తున్నాయి. ఇక్కడ విజ్ఞాన సహితం అని దేనిని గూర్చి చెబుతున్నాడో అదే స్వానుభవంతో కూడిన జ్ఞానము *(స్వానుభవ సంయుక్తమ్).*

శాస్త్ర జనితమైన దానిని జ్ఞానం అని, అనుభవ జన్యమైన దానిని విజ్ఞాన మని చెబుతున్నాడు. అంటే ఇవి రెండు కాదు. ఏ శాస్త్ర జ్ఞానము తెలిసినా పరోక్షంగా ఉందో, అదే అపరోక్షంగా అనుభవానికి అందుతూ ఉంది. పరోక్షం అపరోక్షం కావడమే పరిపూర్ణం. అపరోక్షం లోనే అజ్ఞాన ముడి విడి పోతుంది. సర్వ సంశయాలు విచ్ఛిన్న మౌతాయి.

గురుముఖతః విజ్ఞాన సహిత మైన జ్ఞానము అందగానే, అప్పుడే, అక్కడే *(ప్రబోధ సమయే)* వస్తు దర్శన మవుతుంది. అదే అపరోక్షము. అంతేగాని, జ్ఞానమును పొందిన తరువాత, మరొక సాధనాపేక్ష తొంగి చూస్తే అది పరోక్షమే గాని అపరోక్షం కాదు.

అపరోక్ష జ్ఞానము మనకు లేనంత మాత్రాన వస్తువు పరోక్షం కాదు. ఎక్కడో ఉంటే, పరోక్ష మౌతుంది. అది ఎక్కడో ఉన్నది కాదు. ఇక్కడే ఉంది. ప్రత్యక్షం గానే ఉంది. దానికి సంబంధించిన విజ్ఞాన సహిత జ్ఞానం లేకపోవడం చేత, అది పరోక్ష మనిపిస్తోంది.

కళ్ళజోడు తగిలించుకొని, కళ్ళజోడు ఎక్కడో పెట్టేశా నని వెతికే వాళ్ళను ఎందరినో చూస్తూ ఉంటాం. మన అనుభవంలో కూడా ఉండే ఉంటుంది. కళ్ళజోడు మన వద్దే ఉంది. మనకు పరోక్షంగా లేదు. కాని, ఉన్నది అనే జ్ఞానం లేకపోవడం చేత, పరోక్ష మైంది. ఇక్కడ వాస్తవంగా వస్తువు దూరం కాలేదు. అపరోక్షంగా ఉన్న దానిని పరోక్షం చేసింది అజ్ఞానమే. అజ్ఞానం తొలగితే పరోక్షం అపరోక్షం అవుతుంది. అంతే. అదే విజ్ఞాన సహిత జ్ఞానము. అనుభవమునకు అందిన శాస్త్రజ్ఞానము.

పరమేశ్వరుడే జగత్కారణ మైన వాడు. జగత్తు లోని సర్వవ్యాపక చైతన్యం తానే. ఆ చైతన్యమే వ్యక్తిలో జీవ చైతన్యంగా తెలుస్తూ ఉంది. అదే ఆత్మ. ఆత్మ చైతన్యమే బ్రహ్మ చైతన్యము. ఆత్మయే బ్రహ్మము. ఇదే విజ్ఞాన సహిత జ్ఞానం. అపరోక్ష జ్ఞానము. దీనినే ఏడవ అధ్యాయ మంతా విస్తరింప చేసి భగవానుడు బోధిస్తాడు. ఈ జ్ఞానమును తెలుసుకున్న తరువాత *(యద్ జ్ఞానం జ్ఞాత్వా)* తెలియదగింది *(జ్ఞాతవ్యం)* మరొకటి ఉండదు.





**సర్వ జ్ఞానము - సారభూతము**

మనం ప్రపంచములో జ్ఞానాన్ని, అంటే వస్తు రూప జ్ఞానాన్ని సముపార్జించు కొంటున్నాము. ఏ వస్తువును తెలుసుకుంటే, ఆ వస్తువుకు సంబంధించిన జ్ఞానమే కలుగుతుంది. ఇది పువ్వు అన్నప్పుడు మన బుద్ధిలో పువ్వుకు సంబంధించిన జ్ఞానం ఉంది. ఇది పుస్తకము అనగానే పుస్తకానికి సంబంధించిన జ్ఞానమే ఉంటుంది. దేనికి అదే. ఒకటి మరొక దాని నుండి వేరు పడి ఉన్నందున, ఒక దానికి సంబంధించిన జ్ఞానము మరొక దానికి సంబంధించిన జ్ఞానము నుండి వేరుపడి ఉంటుంది. ఈ విధంగా జ్ఞానములు అనేకంగా ఉంటాయి కనుకనే, సంగీతము నేర్చుకుంటే సంగీతం వస్తుందే గాని నాట్యకళ రాదు. ఒకవేళ రావాలి అంటే, నాట్య శాస్త్రాన్ని ప్రత్యేకంగా అభ్యసించ వలసి వస్తుంది. ప్రాపంచిక వ్యవహారంలో మన జ్ఞాన సముపార్జనము ఇలాగే ఉంది. కాని, దానికి భిన్నంగా, విస్మయాన్ని కలిగిస్తూ భగవంతుడు ఇక్కడ జ్ఞానబోధ చేస్తున్నాడు.

*యస్మిన్ విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి -* దేనిని తెలుసుకుంటే సర్వమును తెలుసుకోవడం జరుగుతూ ఉందో, అట్టి ఉపనిష చ్ఛ్రుతిపాదిత మైన సర్వరూప జ్ఞానాన్ని, సారభూత జ్ఞానాన్ని వివరిస్తున్నాడు. పైగా, అది తెలిసిన తరువాత తెలియ దగింది మరొకటి ఉండదు అంటున్నాడు.

ఒకటి తెలిస్తే, అన్నీ తెలియబడు తున్నాయి అంటే, అన్నీ ఆ ఒక్కదాని రూపాలే అని అర్థమౌతూ ఉంది. మట్టిపాత్రలు అనేక రూపాలతో, అనేక నామాలతో కనిపిస్తూ ఉండినా, మట్టికి సంబంధించిన జ్ఞానము కలిగితే, అవన్నీ మట్టే నని తెలుస్తుంది. మట్టిని తెలుసుకున్న తరువాత, ఒక్కొక్క మట్టి పాత్రను పట్టి పట్టి చూడ వలసిన అవసరం ఉందా? తెలియక ముందు ఉంటుందేమో గాని తెలిసిన తరువాత ఉండదు కదా!

ఉన్నదంతా వాసుదేవుడే. అంతా పరమేశ్వర చైతన్యమే వ్యాపకమై ఉంది. మట్టిపాత్రలు మట్టి కన్నా వేరుగా లేనట్లు, జగత్తు యావత్తూ పరమేశ్వరుని కన్నా వేరుగా లేదు. కనుక, సర్వేశ్వర జ్ఞానం కలిగితే సర్వమూ సర్వేశ్వరమయంగా తెలిసి పోతుంది. ఇదే ఉపనిషత్తు ప్రబోధించిన ఆత్మజ్ఞాన ఫలం.

*యేన అశ్రుతం శ్రుతం భవతి అమతం మతం అవిజ్ఞాతం విజ్ఞాతం -* ఏ విజ్ఞాన సహిత మైన జ్ఞానం కలిగితే విననిది విన్నట్లు అవుతుందో, భావంలో లేనిది ఉన్నట్లే అవుతుందో, తెలియనిది తెలిసినట్లే అవుతుందో, అదే ఇక్కడ పరమేశ్వరుడు బోధిస్తున్న జ్ఞానము. అందుచేత, సర్వ జ్ఞానము కరతలామలక మైనపుడు, తెలియ దగింది మరొకటి ఉండదు అంటున్నాడు. అది తెలిస్తే అన్నీ తెలిసినట్లే. దానిని పొందితే సమస్తమును పొందినట్లే. సుఖావబోధార్థం సాంప్రదాయకులు దీనికి ఒక ఆఖ్యాయికను ఉదహరిస్తారు.

**ఆఖ్యాయిక**

శివపార్వతులకు గణేశ కార్తికేయులు ఇరువురు కుమారులు అని మనకు తెలుసు. పరమశివునికి కార్తికేయుని కంటే గణేశుని యందే ప్రేమ అధికము అని కార్తికేయుడు భావించే వాడు. వీరిరువురిలో ఎవరు గొప్ప అనే వరకు వెళ్ళింది కథ.

పరమేశ్వరుడు ఆలోచించాడు. కుమారు లిరువురిని పిలిచాడు. మీరు ఉభయులు ఒకేసారి బయలుదేరి భూమండలాన్ని చుట్టి రావాలి. మీలో ఎవరు ముందుగా పని పూర్తి చేసుకొని కైలాసం తిరిగి వస్తే వారే గొప్ప అంటాడు.

పుత్రు లుభయులూ అంగీకరించారు. సుబ్రహ్మణ్య స్వామి లోలోన ఎంత గానో పొంగి పోతున్నాడు. అన్నగారి స్థూలకాయం తమ్మునికి తెలియనిది కాదు. పైగా వాహన మేమో మూషికము. అది కదిలే దెప్పుడు, అన్నగారు అవనిని చుట్టి వచ్చే దెప్పుడు? అనుకుంటూ, విజయం తనదే నని సంబరపడి పోయాడు.

ఇరువురూ బయలు దేరారు. మూషికాన్ని మాతంగ వదనుడు, మయూరాన్ని షణ్ముఖుడు అధిరోహించారు. నెమలి క్షణాల్లో రివ్వున ఎగిరి, తిరిగి చూచే లోపల కనుమరు గైంది. పెద్దయ్య మూషికము మెల్లగా చలిస్తూ అక్కడే ఉంది.

మెల్లమెల్లగా కదుల్తూ, యజమానిని ఎక్కించుకొని శివపార్వతుల చుట్టూ మూషికము ప్రదక్షిణము చేస్తూ ఉంది. దాని పైన ఆసీను డైన గజాననుడు నమస్కరిస్తూ ఉన్నాడు. అలా మూడు సార్లు ప్రదక్షిణం చేసి, అప్పటికే అలసి పోయిన వాహనమూర్తికి విశ్రాంతి నిచ్చి, తల్లిదండ్రుల ప్రక్కన చేతులు కట్టుకొని నిలబడ్డాడు గణేశుడు.

ఈ లోగా, వాయు వేగంతో బయలుదేరిన చిన్నయ్య, మనో వేగంతో తిరిగి వచ్చాడు. అన్న గారిని తల్లిదండ్రుల ప్రక్కన చూచి నిర్ఘాంత పోయాడు. వెంటనే తేరుకొని, అన్నగారు బహుశ పోటీ నుండి విరమించుకొని ఉంటారు అని అభిప్రాయ పడ్డాడు.

విజయం వినాయకుడిదే నని తల్లిదండ్రులు ప్రకటించారు. సుబ్రహ్మణ్య స్వామి కోపోద్రిక్తు డయ్యాడు. ఇది అసంభవం, మోసం! అంటూ కేకలు వేశాడు. నాయనా, వినాయకా! నువ్వు విజయాన్ని ఎలా సాధించావో చెప్పు అన్నాడు పరమశివుడు.

తండ్రీ! సర్వం ఈశ్వరమయం. పరమేశ్వరుడ వైన నీ కన్నా అన్య మైనది ఏదీ లేదు. సృష్టికి అభిన్న నిమిత్త ఉపాదాన కారణం నీవే. నిమిత్తకారణ మైన భగవంతుడుగా నీవు, ఉపాదాన కారణమైన భగవతిగా మా తల్లి, ఇద్దరూ ఇక్కడే ఉన్నారు. అంతా మీ లోనే ఉంది. మిమ్మల్ని తెలుసుకుంటే సమస్తాన్ని తెలుసుకొన్నట్లే. మిమ్మల్ని తెలుసుకున్న తరువాత తెలుసుకో వలసింది మరొకటి ఉండదు. మీ చుట్టూ ప్రదక్షిణం చేస్తే సమస్తాన్ని చుట్టి వచ్చినట్లే. తమ్ముడు ఒక్కసారి ప్రదక్షిణం చేసి వచ్చాడు. నేను, నా వాహనము మూడుసార్లు ప్రదక్షిణం చేశాము. ఇదే మా విజయ రహస్యం అన్నాడు వినాయకుడు. అన్నగారి జ్ఞానానికి తమ్ముడు శాంతించడమే గాక పరవశించి పోయాడట. ఇది కథ. కథను కథగా గ్రహించడమే కదా కమామీషు.

*విజ్ఞాన సహితమైన ఈ జ్ఞానం విశిష్ట మైన ఫలం కలది కనుక ఇది చాలా దుర్లభ మైనది అంటున్నాడు.*

**మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే ।** 3
**యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః ॥**

***మనుష్యాణాం-సహస్రేషు-కశ్చిత్-యతతి-సిద్ధయే***
***యతతాం-అపి-సిద్ధానాం-కశ్చిత్-మాం-వేత్తి-తత్త్వతః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| మనుష్యాణాం | = | మనుష్యులలో | సిద్ధానాం అపి | = | సిద్ధులలో కూడ |
| సహస్రేషు | = | వేయి మందిలో | కశ్చిత్ | = | ఒకానొకడు |
| కశ్చిత్ | = | ఒకానొకడు | మాం | = | నన్ను |
| సిద్ధయే | = | సిద్ధి కొరకు | తత్త్వతః | = | యథార్థముగ |
| యతతి | = | యత్నిస్తున్నాడు | వేత్తి | = | తెలుసుకుంటున్నాడు |
| యతతాం | = | యత్నించే | | | |

**పార్థా! వేలాది మంది మనుష్యులలో మోక్ష సిద్ధికి ప్రయత్నించే వాడు ఎక్కడో అరుదుగా ఉంటాడు. ప్రయత్నం చేసే సిద్ధులలో కూడా నన్ను యథార్థంగా తెలుసుకొనే వాడు ఎక్కడో ఒక్కడు ఉంటాడు.**





**వ్యాఖ్య**

భగవద్భావన సామాన్యమైన విషయం కాదు. అందుచేత, సాధారణమైన వ్యక్తులలో అది కనిపించదు. కారణాంతరాల వల్ల, లేదా పరిస్థితుల ప్రభావం వల్ల కొందరిలో ఒక కాలంలో కనిపించినా మరొక కాలంలో కనుమరు గవుతుంది.

మాయా ప్రపంచం ప్రదర్శించే అవిద్యా జనిత మనోహర దృశ్యాలను విస్మరించి శ్రేయోమార్గంలో ఎందరు పయనించ గలరు? పిచ్చెక్కించే రంగుల ప్రపంచ వ్యామోహము నుండి విడివడి ఎందరు వాసుదేవుని వరించగలరు? వరించిన వారిలో ఎందరు ఆ మార్గంలో చరించ గలరు? చరించిన వారిలో ఎందరు తరించ గలరు?

అర్జునా! వేల మంది మనుష్యులలో ***(మనుష్యాణాం సహస్రేషు)*** ఏ ఒక్కడో సిద్ధి కొరకు యత్నిస్తాడు ***(కశ్చిత్ యతతి సిద్ధయే).***

**యత్నించే వారెవరు?**

ప్రతి ప్రాణికి మోక్షం కావాలి. కాని, మోక్షాన్ని పొందే అర్హత మానవు డొక్కడికే ఉంది. మోక్షానికి మానవ జన్మ అనేది సామాన్యార్హత. కర్మస్వేచ్ఛ ప్రధానంగా మానవులకే ఉంది కనుక మానవ జన్మకే మోక్షార్హత ఉంది.

ప్రతి మానవుడికి మోక్షార్హత ఉంది. అలాగని మానవు లందరూ మోక్షాన్ని అభిలషించరు. ముముక్షువులు కాలేరు. అర్థకామాలు ఎలా అనిత్యాలో అర్థమైన వారే మోక్షకాము లవుతారు. అలాంటి వారు చాలా అరుదుగా ఉంటారు. అందుచేతనే భగవంతుడు వేలాది మందిలో మోక్షసిద్ధికి ప్రయత్నించే వాడు ఎక్కడో ఒక్కడు ***(కశ్చిత్)*** ఉంటాడు అంటున్నాడు.

ఇలా చెప్పడంలో విలువైన మోక్షము సులువైనది కాదు అని నిరసింప చేస్తున్నా డని భావించ కూడదు. అంత విలువైనది, మహోన్నత మైనది కాబట్టే అందరూ ప్రయత్నించ లేరు అంటే, శ్రేయస్సును ప్రసాదించ మని ప్రార్థించిన పార్థుడు విశిష్ట మైన వాడుగా గుర్తింప బడ్డాడు. గడచిన శ్లోకంలో జ్ఞానాన్ని స్తుతించడంలో గాని, ప్రస్తుత శ్లోకంలో వేలాది మందిలో ఏ ఒక్కడో మోక్షసిద్ధికి ప్రయత్నిస్తాడు అని చెప్పడంలో గాని, శ్రోతను అభిముఖుణ్ణి చేసుకోవడమే ***(అభిముఖీ కరణాయ)*** గీతాచార్యుని అభిమతము.

ఇక్కడ వేలాది మంది అనడంలో వేల మందిలో తప్పక సిద్ధికి యత్నించే వాడు ఉంటాడనే నియమం ఏమీ లేదు. లక్షలు, కోట్లు అనే సంఖ్యలకు వేలు అనేది కేవలం ఉపలక్షణమే అనేది మరచి పోకూడదు.

సాగర తీరంలో లక్షలాది మంది వానర భల్లూక వీరులు గుమిగూడారు. వారిలో కొందరు విఫల యత్నం చేశారు. కాని, ఒకే ఒక్కడు సముద్రాన్ని లంఘించాడు. అతడే ఆంజనేయస్వామి.

**సాధించే వారెవరు?**

పరమేశ్వరుని కొరకు ప్రయత్నించే సిద్ధులలో ***(యతతా మపి సిద్ధానాం)*** ఏ ఒక్కడో ***(కశ్చిత్)*** నన్ను యథార్థంగా తెలుసుకుంటాడు ***(మాం వేత్తి తత్త్వతః)*** అంటున్నాడు.

సాధారణంగా మోక్షమును సిద్ధింప చేసుకున్న వారిని సిద్ధులు అంటారు. కాని, ఇక్కడ సిద్ధులు అంటే మోక్షసిద్ధి కొరకు ప్రయత్నించే వారు అని అర్థము. అందుచేతనే ***యతతా మపి సిద్ధానాం*** - ప్రయత్నిస్తున్న సిద్ధులలో ఏ ఒక్కడో తనను యథార్థంగా తెలుసుకుంటాడు అంటున్నాడు. ప్రయత్నిస్తున్న వారు అంటే సాధకులు. వారినే సిద్ధులు అనడం జరిగింది.

ఈ శ్లోకంలో (1) యోగసిద్ధికి యత్నించే వాడు నూటికో కోటికో ఒక్కడు. (2) అలా ప్రయత్నించే సాధకులలో ఏ ఒక్కడో నన్ను యథార్థంగా తెలుసు కుంటాడు అనేవి రెండే విషయాలు. మొదటిది, పురుషార్థ నిశ్చయం లేకపోవడము, అర్థకామాల యందు ఆసక్తి నశించక పోవడం చేత మానవ జన్మ నెత్తినా, మనిషి మోక్ష సిద్ధికి యత్నించడం లేదు.

ఇక రెండవ విషయం, ప్రయత్నించే వారిలో ఏ ఒక్కడో తనను యథార్థంగా తెలుసుకుంటాడు అనేది. భగవంతుని కొరకు ఎవ్వరైతే ప్రయత్నిస్తున్నారో, వారికి భగవంతుడు తెలుసు. కాని, ఆయన యథార్థ స్వరూపము తెలియదు. భగవంతుడు ఉన్నాడు. ఆయన నన్ను రక్షిస్తాడు అనే వాడికి కూడా భగవంతుడు తెలుసు. కాని, యథార్థంగా భగవంతు డేమిటో తెలియదు.

పరమేశ్వరుడు జగత్కారణ మని, ఈ విశ్వానికి ఆయనే సర్వకారణ మని, విశ్వాని కన్నా విలక్షణంగా ఆయన స్వరూపము శోభిస్తూ ఉందని, ఆత్మ బ్రహ్మమే నని తెలిసిన వాడు భగవంతుని యథార్థంగా గ్రహించిన వాడు. అట్టివాడు అమృతత్వాన్నే వాంఛిస్తాడు. పరమేశ్వరుని తన స్వరూపం గానే *(తత్త్వతః)* తెలుసుకుంటాడు. అతడే ధీరుడు. గీతాచార్యుడు 'ఒక్కడు' అంటూ ప్రశంసించిన ***కశ్చిత్*** పురుషుడు.

**కశ్చిత్ ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్ ఆవృత్త చక్షుః అమృతత్వ మిచ్ఛన్**

కేవలం అమృతత్వమునే, అంటే మోక్షమునే వాంఛించు ఒకానొక ధీమంతుడు ***(కశ్చిత్ ధీరః)*** ఇంద్రియాలను అంతర్ముఖం చేసి అంతరాత్మ స్వరూపమును పరమేశ్వర స్వరూపంగా దర్శిస్తాడు అని కఠోపనిషత్తు.

ఈ మాత్రం ఉపోద్ఘాతంతో గీతాచార్యుడు మనల్ని విశ్వాంతరాళము లోకి తీసుకొని పోతున్నాడు. విజ్ఞానయోగ వైభవమును విస్తరించి చెప్పబోతున్నాడు.

*ఇక భగవానుడు తన పరాపర ప్రకృతులను తెలియ చేసేందుకు ఉపక్రమిస్తూ, ముందుగా అపరా ప్రకృతిని గూర్చి చెబుతున్నాడు.*

భూమి రాపో౽నలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥ 4

***భూమిః-ఆపః-అనలః-వాయుః-ఖం-మనః-బుద్ధిః-ఏవ-చ***
***అహంకారః-ఇతి-ఇయం-మే-భిన్నా-ప్రకృతిః-అష్టధా***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భూమిః | = | భూమి | అహంకారః | = | అహంకారము |
| ఆపః | = | జలము | ఇతి | = | అని |
| అనలః | = | అగ్ని | మే | = | నా యొక్క |
| వాయుః | = | గాలి | ఇయం | = | ఈ |
| ఖం | = | ఆకాశము | ప్రకృతిః | = | ప్రకృతి |
| మనః | = | మనస్సు | అష్టధా | = | ఎనిమిది విధాలుగా |
| బుద్ధిః ఏవ చ | = | బుద్ధియును | భిన్నా | = | భేదమును కలిగి ఉంది |

**అర్జునా! భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము - ఇదే నా ప్రకృతి. ఎనిమిది విధాలుగా విభజింపబడి ఉంది.**





**వ్యాఖ్య**

సర్వేశ్వరునికి సంబంధించిన జ్ఞానము కలిగితే, సమస్తము తెలిసి పోతుంది. తెలియ దగింది అంటూ మరొకటి ఉండదు అనే ప్రతిజ్ఞ సత్యం అని నిర్ధారణ చేయడము అంటే, సర్వేశ్వరునికి అన్యంగా, భిన్నంగా, బాహ్యంలో మరొకటి ఉండేందుకు అవకాశమే లేదు అని తెలుసుకోవడం. ఈ జ్ఞానమునే విజ్ఞాన సహిత మైన జ్ఞానము అని అర్థం చేసుకున్నాం. అదే అపరోక్ష జ్ఞానం అని కూడా తెలుసుకున్నాం.

అనంతమైన ఈ జ్ఞానం అఖండము. పరమేశ్వరుని జ్ఞానం కన్నా మరొకటి అన్యంగా ఉండేందుకు అవకాశం లేనపుడు, ప్రపంచం లోని ప్రతి వస్తువు, ప్రతి అణువు పరమేశ్వర స్వరూపమే అని గ్రహించి నపుడే జ్ఞానం అఖండ మని అర్థ మవుతుంది.

ఇంతకీ ఈ ప్రపంచం ఏమిటి? ప్రపంచానికి, పరమేశ్వరునికి గల సంబంధం ఎలాంటిది? ప్రపంచము పరమేశ్వరుని కన్నా వేరుగా ఉందా? ఉంటే అఖండ జ్ఞానం ఎలా సిద్ధిస్తుంది? ఒకవేళ పరమేశ్వరుని కన్నా వేరుగా లేకపోతే, ప్రపంచం - పరమాత్మ అని రెండుగా తెలుస్తున్నాయి ఎందుకని?

విశ్వమంతా కారణ కార్యాల తోనే నడుస్తూ ఉన్నట్లు మన అనుభవానికి అందుతూ ఉంది. మరి, ఈ సృష్టికి కారణ మేమిటి? బ్రహ్మము కారణము, సృష్టి కార్యమా? అయితే, ***కారణ గుణా హి కార్యగుణా నారభన్తే*** - కార్యము లోని గుణాలకు కారణము లోని గుణాలే కదా హేతువులు? ఇది వాస్తవమా? ఇలా ప్రశ్నల పరంపర సాగుతూనే ఉంటుంది. వీటన్నిటికీ తెర పడాలి అంటే, ముందుగా కార్యరూప మైన ఈ ప్రపంచ మేమిటో తెలిస్తే, ఆ తరువాత ఇదంతా ఎలా బ్రహ్మమో అర్థ మవుతుంది. అంతా బ్రహ్మమే అని అర్థమైన తరువాత బ్రహ్మకు సంబంధించిన జ్ఞానము కలిగితే, సర్వజ్ఞానము కలగటంతో పాటు బ్రహ్మ కన్నా అన్యంగా తెలియ దగింది ***(జ్ఞాతవ్యం)*** మరొకటి లేదు అనేది కూడా అర్థ మవుతుంది.

**మాయా శక్తి**

సృష్టి అనేది కార్యము. ఇది సృష్టి కార్యము. గొప్పదైన ఈ సృష్టికార్యాన్ని చేయాలి అంటే అలా చేసే ఒకానొక అద్భుత శక్తి ఉండాలి. దానినే 'ప్రకృతి' అంటారు. ***ప్రకృతి = ప్రారంభః క్రియతే అనయేతి ప్రకృతిః*** - దీని చేత జగత్ప్రారంభము చేయబడుతూ ఉంది కనుక ప్రకృతి అని చెప్ప బడింది.

***ప్రకరోతి పురుష ఉపభోగార్థం శబ్దాది భోగ్యాని ఇతి వా ప్రకృతిః*** పురుషులు భోగించుట కొరకు శబ్ద స్పర్శాది భోగ్య వస్తువులను సృష్టించునది ప్రకృతి. ఇది సామాన్య మైన కార్యము కాదు. ఎవరికీ సాధ్యము కాని కార్యము. చాలా గొప్ప కార్యము. అందుచేత కూడా సృష్టి కార్యానికి కారణ మైన మహాశక్తిని ప్రకృతి అన్నారు ***(ప్రకృష్టా కృతిః కార్యం యస్యాః)***. ఈ మహాశక్తికే మాయ అని కూడా పేరు. కనుక ప్రకృతి అన్నా మాయ అన్నా ఒక్కటే. ఈ ప్రపంచము మాయాకార్యము. మాయామయము. మాయకు ప్రత్యేక మైన మనుగడ లేదు. మాయ బ్రహ్మమును ఆశ్రయించుకొని మనుగడను సాగిస్తుంది ***(బ్రహ్మాశ్రయా మాయా అస్తి)***. కనుక మాయా శక్తి మరో విధంగా చెప్పాలంటే భగవంతుని శక్తియే. అదే ప్రకృతి. అంటే, పరమాత్మ శక్తి. పరమాత్మ శక్తిగా తెలుస్తున్న ఈ ప్రకృతి రెండు విధాలు. ఒకటి స్వరూప ప్రకృతి. రెండవది స్వభావ ప్రకృతి. స్వరూప ప్రకృతిని పరా ప్రకృతి అంటారు. స్వభావ ప్రకృతిని అపరా ప్రకృతి అని పిలుస్తారు.

**పరా ప్రకృతి**

ఏది ఉన్నా సృష్టింప బడిందే ఉంది. సృష్టింప బడనిది ఏదైనా ఉంటే, అది ఆత్మ ఒక్కటే. ఆత్మ చైతన్య

స్వరూపము. సృష్టి కార్యానికి ముందు చైతన్యమే ఉంది. అదే సత్. అది ఏకము. అద్వితీయము. బ్రహ్మ స్వరూపము.
ఇదే స్వరూప వైభవము. సర్వస్యకారణం. సర్వకారణము.

**సద్బ్రహ్మ కార్యం సకలం సదైవ** - బ్రహ్మమును కారణంగా కలిగిన కార్యము ఏదైనా, అది బ్రహ్మము కన్నా
అన్యంగా ఉండలేదు. కనుక బ్రహ్మకార్య మైన ఈ జగత్తు బ్రహ్మమే గాని, బ్రహ్మము కన్నా అన్యం కాదు.

సృష్టికి ముందు అద్వితీయంగా ఉన్న సదాత్మ నిర్వికారం కనుక, సృష్టి జరిగినా, సదాత్మ ఏ వికారం
లేకుండా, సృష్టి లోని వికారాలకు విలక్షణంగా నిర్వికారంగా భాసిల్లుతూ ఉంది. ఇదే బ్రహ్మము యొక్క
స్వరూప ప్రకృతి లేదా పరాప్రకృతి. సత్యజ్ఞానానంద స్వరూపమైన చిద్రూపస్థితి.

**అపరా ప్రకృతి**

బ్రహ్మము యొక్క రెండవ ప్రకృతిని స్వభావ ప్రకృతి అంటారు. ఇదే అపరా ప్రకృతి. దీనిని అవ్యక్త
మని, మూల ప్రకృతి అని, మాయ అని కూడా పిలుస్తారు. దీని నుండే ప్రపంచం ఆవిర్భవించింది. కనుక
ప్రపంచము మాయా కార్యము.

**మాయాఖ్యా పరమేశ్వరీ శక్తిః అనిర్వచనీయ స్వభావా త్రిగుణాత్మికా** - త్రిగుణ మిళితమై, ఇలా అలా అని
నిర్వచించడానికి సాధ్యపడని స్వభావం కలదై, పరమేశ్వరుని శక్తిగా ఏది ఉందో అది మాయ అనే పేరుతో
వ్యవహరిస్తోంది అన్నారు తన గూఢార్థ దీపిక వ్యాఖ్యానంలో శ్రీ మధుసూదన సరస్వతీ స్వాముల వారు. ఈ
జడరూప ప్రపంచానికి ఉపాదాన కారణము మాయే అని శ్రీ నీలకంఠ భాష్యము ***(జడ ప్రపంచ ఉపాదాన
భూతం).***

బ్రహ్మము యొక్క పరాపర ప్రకృతులను సంపూర్ణంగా గ్రహిస్తే గాని బ్రహ్మ మేమిటో తెలియదు.
బ్రహ్మము తెలిస్తే గాని, బ్రహ్మాత్మజ్ఞానము, సర్వజ్ఞానము, అనుభవ సహిత జ్ఞానము కలగదు. బ్రహ్మము
వస్తుతః సత్యజ్ఞానానంద స్వరూపమే అయినా, మాయా ప్రభావంచే ఏర్పడిన జగత్కారణత్వము సిద్ధించ
డానికి ముందు బ్రహ్మము యొక్క అపరాప్రకృతిని లేదా స్వభావ ప్రకృతిని ప్రస్తుత శ్లోకంలో స్పష్టం చేస్తున్నాడు.

అర్జునా! నా ప్రకృతి ఎనిమిది విధాలుగా ***(అష్టధా)*** విభాజిత మైంది. భూమి, జలము, అగ్ని, వాయువు,
ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని నా అపరా ప్రకృతి ఎనిమిది విధాలుగా విభజింప బడింది.

ఈ విధమైన అపరా ప్రకృతికి ఆధార మైన జీవుని చైతన్యమే పరాప్రకృతి. జీవ, జడ రూప భేదంతో
గోచరిస్తున్న ఈ పరాపర ప్రకృతులు చైతన్యము కన్నా భిన్నమైనవి కావు.

అపరా ప్రకృతి అని ఎనిమిది విధాలుగా ఏదైతే తెలుస్తూ ఉందో దానిని అర్థం చేసుకుంటే అది
చైతన్యం కన్నా వేరు కాదని అర్థ మవుతుంది. అన్నిటిలో అంతట అంతర్యామిగా శోభించేది స్వరూప చైతన్యమే.

**అష్టవిధ ఈశ్వర మాయ**

పంచభూతాలు, మనస్సు, బుద్ధి, అహంకారము - ఇలా ఎనిమిది విధాలుగా తెలుస్తున్న అపరా ప్రకృతియే,
ఈశ్వర మాయ ***(మే మమ, ఐశ్వరీ మాయా శక్తిః అష్టధా భిన్నా భేదం అగతా).***

ఇక్కడ చెప్పబడిన పంచభూతాలు మనకు కనిపిస్తున్న స్థూల పంచభూతాలు కావు. పంచీకరణం
చెంది స్థూల భూతాలుగా మారక ముందు సూక్ష్మ భూతాలుగా ఉన్న వాటినే ఇక్కడ ప్రస్తావించడం జరిగింది.
ఈ సూక్ష్మ భూతాలనే తన్మాత్రలు అంటారు. ఈ ఐదు తన్మాత్రల నుండి స్థూల పంచభూతాలు



ఆవిర్భవించాయి. అందుచేత తన్మాత్రలను సూక్ష్మభూతాలు అన్నారు. వాటి నుండి స్థూలభూతాలు పుట్టాయి.

స్థూల భూతాలు కార్యాలు కనుక సూక్ష్మ భూతాలు కారణాలు. కారణాలను ప్రకృతి అంటారని ముందే
తెలుసుకున్నాం కనుక, సూక్ష్మభూతా లైన తన్మాత్రలు కారణాలు, అంటే ప్రకృతులు. స్థూల భూతాలైన
పంచభూతాలు కార్యాలు, అంటే వికృతులు.

భూమి మొదలైన ఎనిమిది నా ప్రకృతులు అని పరమేశ్వరుడు చెప్పడం చేత, అవి కారణా లైన
తన్మాత్రలే గాని, కార్యాలైన స్థూలభూతాలు కావని స్పష్టంగా తెలుస్తూ ఉంది. అష్టవిధ ప్రకృతులలో మిగిలిన
మనోబుద్ధ్యహంకారాలను కూడా ఇలాగే అర్థం చేసుకోవాలి.

మనస్సు వికృతియే గాని ప్రకృతి కాదు. మనస్సుకు కారణ మైన అహంకారమును మనస్సు అని
చెప్పడం జరిగింది. కనుక, ఇక్కడ మనస్సు అంటే అహంకారము అని అర్థము ***(మనసః కారణమ్ అహంకారః
గృహ్యతే).***

బుద్ధి కూడా వికృతియే గాని ప్రకృతి కాదు. అహంకారానికి కారణ మైన మహత్తత్వం బుద్ధి అని
చెప్పబడింది ***(బుద్ధిః ఇతి అహంకార కారణం మహత్తత్వమ్)***. అలాగే, అహంకార వాసనా యుతమై, అజ్ఞాన
రూపమైన అవ్యక్తమే అహంకారం అని చెప్పబడింది ***(అహంకార వాసనాత్ అవ్యక్తం మూల కారణమ్ అహంకారః
ఇతి ఉచ్యతే).*** మరి, ఇలా స్పష్టంగా వికృతుల రూపంలో కార్యాలుగా తెలుస్తున్న వాటిని ప్రకృతుల రూపంలో
కారణాలుగా ఉన్న వాటి పేర్లతో ఉదహరించడ మెందుకు? అనే సంశయం రావచ్చు. తెలిసిన దాని ద్వారానే
తెలియని దానిని గ్రహించాలి అనేది ఒకటైతే, విషం కలిసిన ఆహారాన్ని విషం అని పిలుస్తున్నామా లేదా?
అలాగే కారణాలే కార్యాలకు హేతువు లైనందున అలా ఉదహరించడం జరిగింది అనే భావన మరొకటి
***(యథా విష సంయుక్త మన్నం విషమ్ ఉచ్యతే ఏవమ్ అహంకార వాసనాత్ ... ఇతి ఉచ్యతే).***

*అపరా ప్రకృతి లేదా స్వభావ ప్రకృతి అంటే ఏమిటో తెలుసుకున్నాం. ఇప్పుడు పరాప్రకృతిని లేదా
స్వరూప ప్రకృతిని గూర్చి బోధిస్తున్నాడు.*

**అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।** 5
**జీవభూతాం మహాబాహో య యేదం ధార్యతే జగత్ ॥**

***అపరా-ఇయం-ఇతః-తు-అన్యాం-ప్రకృతిం-విద్ధి-మే-పరాం***
***జీవభూతాం-మహాబాహో-యయా-ఇదం-ధార్యతే-జగత్***

| | | | | | |
|---|---|---|---|---|---|
| మహాబాహో | = | అర్జునా! | యయా | = | దేని చేత |
| ఇయం | = | ఈ ప్రకృతి | ఇదం | = | ఈ |
| అపరా | = | అపరా ప్రకృతి | జగత్ | = | జగత్తు |
| ఇతః తు | = | దీని కంటెను | ధార్యతే | = | ధరింప బడుతూ ఉందో |
| అన్యాం | = | వేరైనది | మే | = | నా యొక్క |
| జీవభూతాం | = | ప్రాణాధార మైనది | ప్రకృతిం | = | ప్రకృతిని |
| పరాం | = | ఉత్కృష్ట మైనది | విద్ధి | = | తెలుసుకో |

**హే మహాబాహో! అర్జునా! ఇది అపరా ప్రకృతి. దీని కంటే వేరైన నా ప్రకృతి మరొకటి ఉంది. దానినే పరా ప్రకృతి
అంటారు. అది జీవ రూపంగా ఉంటుంది. దాని చేతనే ఈ జగత్తు ధరింప బడుతూ ఉంది.**

### వ్యాఖ్య

ఎనిమిది వేరు వేరు రూపాలతో కనిపించే అపరా ప్రకృతి పేరు లోనే పరం కాదని తెలుస్తూ ఉంది ***(అపరా, న పరా నికృష్టా).*** పరం అంటే ఉత్కృష్ట మైంది. అపరా అంటే నికృష్ట మైంది.

నికృష్ట మైన అపరా ప్రకృతి అశుద్ధ మైనది ***(అశుద్ధా).*** అవిద్యతో కూడి ఉంది కనుక అశుద్ధము. అంతేకాదు, అనర్థమును కలిగించేది ***(అనర్థకరీ),*** ప్రేయస్సు వైపునకు ప్రేరేపించి శ్రేయస్సునకు దూరం చేసేది కనుక అనర్థమును కలిగిస్తుంది. అపరా ప్రకృతి కారణం గానే సంసార బంధము ఏర్పడుతుంది ***(సంసార బంధనాత్మికా).*** జనన మరణ చక్రంలో పడేసి నిర్విరామంగా త్రిప్పేది ఈ అపరా ప్రకృతియే.

దృశ్య రూపమై ఎనిమిది విధాలుగా గోచరించే ఈ భిన్న రూపమైన అపరా ప్రకృతి, లేదా స్వభావ ప్రకృతి సంసార బంధాన్ని కలిగిస్తూ ఉన్నందున దుఃఖ రూపము. జడ ప్రాయము. మిథ్యా రూపము. మాయ ఉపాదానం కావడం చేత మిథ్యా రూపమైన అపరా ప్రకృతి స్వతంత్ర మైనది కాదు. పరతంత్ర మైనది. దీనికి భిన్నంగా విలక్షణంగా భాసించేది పరా ప్రకృతి, లేదా స్వరూప ప్రకృతి. ప్రస్తుత శ్లోక ప్రసంగ విషయము.

**పరా ప్రకృతి**

అపరా ప్రకృతికి అన్య మైనది పరా ప్రకృతి లేదా స్వరూప ప్రకృతి. ఈ పరా ప్రకృతి ఉత్కృష్ట మైనది ***(పరాం ప్రకృష్టాం).*** పరమేశ్వరుని యొక్క స్వరూప లక్షణము చేత సంపన్న మైంది కనుక పరా ప్రకృతి విశుద్ధ మైంది ***(విశుద్ధాం ప్రకృతిం).***

విశుద్ధ మైన స్వరూప ప్రకృతి జీవరూప మైంది ***(జీవభూతాం).*** ఆత్మరూప మైంది అని అర్థము. ***జీవయతి చేతయతి దేహం ఇతి జీవః*** జడమైన దేహేంద్రియాదులు చలించ డానికి కారణమైన వాడు జీవుడు. - దేహమునకు చేతనత్వమును కల్పించే వాడు జీవుడు. అతడే పదమూడవ అధ్యాయంలో క్షేత్రజ్ఞుడుగా తెలుస్తాడు ***(క్షేత్రజ్ఞ లక్షణాం).***

దేహేంద్రియాదులు జడము కనుక అవి అనిత్యాలు. అనాత్మ సంబంధ మైనవి. ఈ దేహేంద్రియాది అనాత్మ సంఘాతమే క్షేత్రము. అట్టి క్షేత్రమును తెలుసుకొనే వాడు, చైతన్యవంతం చేసే వాడు, సాక్షిమాత్రుడై దేహ మనుగడకు ఆధార మైన జీవుడే క్షేత్రజ్ఞుడు ***(క్షేత్రం జానాతీతి క్షేత్రజ్ఞః).***

జడము అంటే చలనము లేనిది. స్వప్రకాశం కానిది. అలాంటిది చలించడం జరిగింది అంటే, అది చైతన్యము యొక్క అధీనంలో ఉంది అని అర్థం. స్వరూపము స్వతంత్రంగా ఉండగా, స్వరూపంపై ఆధారపడి చలిస్తున్న స్వభావము పరతంత్రంగా ఉంది. స్వతంత్రమై, స్వప్రకాశమై, జీవరూప మైన పరా ప్రకృతిని తెలుసుకో మని భగవంతుడు చెబుతున్నాడు ***(మే పరాం ప్రకృతిం విద్ధి).***

ఏమని తెలుసుకోవాలి? పరా ప్రకృతి ఆత్మభూతమై, జీవరూపంగా ఉంది అని తెలుసుకోవాలి. జీవ రూపంగా ఉన్నవాడు, దేహాన్ని ఉపాధిగా కలిగి యున్నాడు అని అర్థం. ఉపాధి ఉంది అంటే, ఆ దేహోపాధి యొక్క మనుగడకు ప్రాణ చలనము ప్రధానం కనుక దేహం ప్రాణమును ధరించడానికి కూడా నిమిత్తమైన వాడు జీవుడే అని అర్థం.

***జీవ ప్రాణ ధారణే*** అనే ధాతువు నుండి పరిశీలించి చూచి నపుడు దేహం ప్రాణాన్ని కలిగి ఉండటానికి జీవుడే కారణ మని మనం ఇప్పుడే చెప్పుకున్న విషయం నిర్ధారింప బడుతూ ఉంది. ఎవరి వల్ల దేహము ప్రాణాలను ధరించి జీవిస్తూ ఉందో, అతడే జీవుడు ***(జీవతి, ప్రాణాన్ ధారయతి, అస్మాత్ దేహః ఇతి జీవః).*** అంటే



ప్రాణ ధారణ గావించే వాడు. దేహం నుండి బాహ్యానికి వెళ్ళిన వాయువును తిరిగి దేహం లోనికి ఆకర్షించే వాడు. అలా ఆకర్షించడం చేతనే దేహం చరిస్తూ ఉంది. ఇదే ప్రాణధారణము. దేహం నుండి జీవుడు విడిపడ గానే, ప్రాణధారణం గావించే వాడు లేనందున దేహము ప్రాణాలను విడిచేస్తుంది.

దేహంలో ఉండి ప్రాణ ధారణం చేస్తూ, దేహాన్ని నిలిపిన ఈ స్వరూప ప్రకృతియే, అటు విశ్వంలో కూడా ప్రవేశించి జగత్తు నిలవడానికి కారణ మవుతూ ఉంది. జడరూప జగత్తునకు చేతనత్వం కల్పించేది కూడా ఈ పరా ప్రకృతియే. ఇటు వ్యష్టిగా క్షేత్ర మైన దేహం లోను, అటు సమిష్టిగా క్షేత్ర మైన జగత్తు లోను అంతర్యామి స్వరూపంగా ఉన్నది భగవంతుని స్వరూప మైన ఈ పరా ప్రకృతియే.

జీవ రూపంలో ఉన్న స్వరూప ప్రకృతి దేహంలో అంతర్యామిగా ఉంది. బుద్ధికి చేతనత్వాన్ని కల్పించి, నేను - నాది ***(అహం - మమ)*** అనే అభిమానానికి నిమిత్తమై, తోషణ పోషణ రక్షణాదులను పొందుటకు ఆధారంగా ఉంది. అంటే సంతోషాన్ని కలిగించడము, పోషించడము, రక్షించడము అనేవి ఉపాధి స్థాయిలో జరగడానికి నిమిత్తమై ఉంది.

ఈ విధంగా జీవ నామంతో దేహంలో అంతర్యామిగా ఉంటూ దేహ ధారణకు ఆధార మైన స్వరూప ప్రకృతియే జగత్తులో కూడా అంతర్భూతంగా ఉంటూ జగత్తు నిలవడానికి కారణ మవుతూ ఉంది ***(యయా ఇదం జగత్ ధార్యతే).*** జగత్తు జగత్తుగా నిలవడానికి కారణ మవుతూ ఉంది ***(జగతః స్థితి కారణమ్).*** జగత్తుకు సత్తాస్ఫూర్తులను తానే ప్రదానం చేస్తూ ఉంది.

దేహంలో అంతర్యామిగా ఉన్న పరా ప్రకృతి జీవుడు. విశ్వంలో అంతర్యామిగా ఉన్న పరా ప్రకృతి ఈశ్వరుడు. పరా ప్రకృతి, అపరా ప్రకృతి రెండూ పరమాత్మ ప్రకృతులే కనుక క్షేత్రక్షేత్రజ్ఞులూ తానే. విశ్వ విశ్వాత్మలు కూడా తానే. బాహ్యంలో ఉన్నది తానే. అంతర్యంలో ఉన్నది తానే. అంతా పరమేశ్వరుడే. నారాయణ మూర్తియే. సచ్చిదానంద పరబ్రహ్మమే. ***అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః*** - లోపల, బయట అంతటా నారాయణుడే అని శ్రుతి ప్రతిపాదించిన ప్రమాణ వాక్యము ఈ విధంగా ఫలితాన్ని అందిస్తూ సుస్పష్ట మవుతూ ఉంది. జడ చైతన్య రూపాలలో, పరాపర ప్రకృతులలో తానే అఖండంగా శోభిస్తున్నట్లు అర్థ మవుతూ ఉంది. పరాపర ప్రకృతుల రూపం గాను, వాటికి విలక్షణం గాను శోభిస్తున్న సర్వ కారణమైన సచ్చిదానంద పరబ్రహ్మమునకు ఒకేసారి నమస్కరించడం ఎలాగో భాగవతం చేసి మరీ చూపింది.

***క్షేత్రజ్ఞాయ నమస్తుభ్యం సర్వాధ్యక్షాయ సాక్షిణే***
***పురుషాయ ఆత్మమూలాయ మూల ప్రకృతయే నమః ॥***

క్షేత్రజ్ఞ స్వరూపునకు, సర్వాధ్యక్షు డైన సాక్షీ స్వరూపునికి, పురుషునికి, సర్వాత్మ రూపుడైన పరమేశ్వరునకు, అలాగే సర్వమును సృజించే మూల ప్రకృతికి నమస్కారము.

*పరాపర ప్రకృతులలో ఉన్నది తానే కనుక, తన కన్నా అన్య మైనది ఏదీ లేదని నిరూపిస్తున్నాడు.*

**ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ ।** 6
**అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా ॥**

***ఏతద్యోనీని-భూతాని-సర్వాణి-ఇతి-ఉపధారయ***
***అహం-కృత్స్నస్య-జగతః-ప్రభవః-ప్రలయః-తథా***

సర్వాణి = సమస్తములైన
భూతాని = ప్రాణులును
ఏతద్యోనీని ఇతి = ఈ అపరా, పరా ప్రకృతుల వలన బుట్టినవిగా
ఉపధారయ = గ్రహించు
తథా = అట్లే

కృత్స్నస్య = సమస్తమైన
జగతః = జగత్తు యొక్క
ప్రభవః = ఉత్పత్తి కారకుణ్ణి
ప్రలయః = లయ కారకుణ్ణి
అహం = నేనే

**అర్జునా! నా ప్రకృతు లైన పరాపరాలే సమస్త చరాచర భూత ప్రపంచానికి కారణాలు అని తెలుసుకో! అందుచేత, ఈ ప్రపంచము యొక్క సృష్టి లయాలకు నేనే కారణము.**

**వ్యాఖ్య**

విజ్ఞాన సహిత మైన జ్ఞానమును తెలుసుకొనిన తరువాత తెలియ దగింది మరొకటి ఉండదు అని రెండవ శ్లోకములో చేసిన ప్రతిజ్ఞ ప్రకారము, పరమాత్మ జ్ఞానం కలిగితే ప్రపంచానికి సంబంధించిన సర్వజ్ఞానము సిద్ధించినట్లే అవుతుంది. ఈ విధమైన అఖండ జ్ఞానము ప్రాప్తించాలంటే, ప్రపంచము ఏమిటో కూడా తెలియాలి. దానిని తెలుసుకొనే ప్రయత్నంలో పరమాత్మ యొక్క స్వరూప ప్రకృతిని, స్వభావ ప్రకృతిని కూడా తెలుసుకున్నాం. పరాపర ప్రకృతులలో వ్యాప్తమై ఉన్నది పరమాత్మ చైతన్యమే అనేది కూడా అర్థమైంది. ఏ ప్రపంచం అయితే సృష్టింప బడింది అని మనం చెబుతున్నామో, ఆ సృష్టి పరమాత్మ కన్నా వేరుగా లేదు. వాస్తవం చెప్పాలంటే ఆ సృష్టి రూపంలో ఉన్నది పరమాత్మే. సృష్టికి కారణము పరాపర ప్రకృతులే. అవి పరమాత్మ ప్రకృతులే కనుక సృష్టిలయాలకు పరమాత్మే కారణము అని చెప్పుకుంటున్నాం ***(అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయః తథా).*** అంటే తనవే అయిన రెండు ప్రకృతుల ద్వారా సర్వజ్ఞుడైన పరమేశ్వరుడే సృష్టి లయాలకు కారణంగా తెలుస్తున్నాడు. సృష్టిలయాలు అన్నప్పుడు మధ్యలో స్థితి ఉన్నట్లే.

**జగత్కారణం బ్రహ్మ**

సమస్త మైన భూతములు పరాపర ప్రకృతుల కారణంగా కలిగాయి అన్నప్పుడు, పరమేశ్వరుడు జగత్కారణం ఎలా అవుతాడు? అనేది శంక.

సమస్త భూతాలు అంటే చేతనా చేతనములు అని అర్థం. బ్రహ్మాది స్తంబ పర్యంతము ఉన్న స్థావర జంగమములు, ప్రస్తుతము ఉన్నవే గాక, గతంలో ఉన్నవి, భవిష్యత్తులో ఉండబోయేవి, సమస్తము పుట్టినవే. అందుచేతనే అవి భూతములు. **భవన్తి** - అంటే భవన ధర్మము గలవి. అందుచేత భూతము లయ్యాయి. జన్మవంతము లయ్యాయి. ఈ విధంగా పుట్టిన సమస్త భూతములకు తన ప్రకృతి ద్వయమే కారణం అని చెప్పి నపుడు, జగత్కారణత్వం ఈశ్వరునికి ఎక్కడుంది?

ప్రకృతి ద్వయ కారణంగా ఉత్పత్తి జరిగినా, ప్రకృతి యందలి ఏ శక్తి జగదుత్పత్తికి కారణ మైందో, ఆ శక్తి పరమాత్మ శక్తే కనుక, జగత్కారణత్వం అనేది సర్వజ్ఞ డైన ఈశ్వరునికే సంబంధించి ఉంది. అవబోధార్థం ఒక దృష్టాంతం చెప్పుకుందాం.

దేహం అనేక కార్యాలు చేస్తూ ఉంది కదా! ఆ శక్తి దేహాని దేనా? క్షేత్రమే శక్తివంతమై చేస్తూ ఉందా? క్షేత్రానికే ఆ శక్తి ఉంటే మృత కళేబరం కూడా కార్యాలను నిర్వహించ వచ్చు కదా! క్షేత్రము కార్య రంగంలో కదులుతూ ఉంది అంటే అది క్షేత్రమునకు చేతనం కలిగించే క్షేత్రజ్ఞుని శక్తే గాని క్షేత్రము శక్తి కాదు కదా! అలాగే ప్రకృతి ద్వయాన్ని శక్తివంతము చేసేది ఈశ్వరుడే కనుక, సృష్టి పరాపర ప్రకృతుల కార్యమే అయినా,



సృష్టి కారణత్వం పరమేశ్వరునిదే అని తెలుస్తూ ఉంది. ఉత్పత్తి కారణం పరమేశ్వరు డైనపుడు, లయ కారణం కూడా ఈశ్వరుడే ***(అహం సమస్తస్య జగతః ఉత్పత్తిః వినాశః).***

**ఉపాదాన కారణం**

జగదుత్పత్తికి పరమేశ్వరుడే కారణ మైతే, ఏ ఉపాదానం చేత సృష్టిని ఉత్పన్నం చేశాడు? అంతేకాదు, జగత్తును సృష్టించే టప్పుడు పరమేశ్వరుడు ఎక్కడ ఉండి సృష్టించాడు? సృష్టి లోనే ఉండి సృష్టించాడా? లేక సృష్టికి వెలుపల ఉండి సృష్టించాడా? అనేది సూటి ప్రశ్న.

సృష్టిలో ఉండి సృష్టించాడు అంటే, తాను సృష్టి లోనే ఉండే టప్పుడు మళ్ళీ సృష్టించడ మేమిటి? అనే ప్రశ్న పుడుతుంది. ఈశ్వరుడు సృష్టి లోనే ఉన్నందున, సృష్టిని ఉత్పత్తి చేసే అవకాశమే లేదు కాబట్టి, మరొక రెవరో ఈ సృష్టిని చేసి ఉండాలి. ఇది అనవస్థా దోషానికి మార్గ మవుతుంది.

పోనీ, సృష్టికి వెలుపల ఉండి సృష్టించాడు అనుకుందా మంటే, బాహ్యాభ్యంతరా లనేవి సృష్టి జరిగాక ఉంటాయే గాని సృష్టి జరగక ముందు ఉండ లేవు. సృష్టి విషయం దేవు డెరుగు. సృష్టించిన దేవు డెక్కడున్నాడు? ఎక్కడా ఉండ లేదు కనుక, సృష్టియే భగవంతుడు. భగవంతుడే సృష్టి. సృష్టించిన వాడూ తావే. సృష్టిగా ఉన్నది కూడా తావే. జగత్కారణత్వం తైత్తిరీయంలో ఇలా ఉంది.

***యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి,***
***యత్ప్రయం త్యభి సంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి,***

ఎవరి వలన ***(యతః, యస్మాత్)*** ఈ సమస్త భూతాలు ***(ఇమాని భూతాని, బ్రహ్మాదీని స్తంబ పర్యన్తాని)*** పుడుతున్నాయో ***(జాయన్తే),*** అలా పుట్టిన భూతాలు ఎవని చేత జీవిస్తున్నాయో ***(యేన జాతాని జీవన్తి, ప్రాణాన్ ధారయన్తి వర్ధన్తే),*** ప్రళయ కాలము నందు దేనిని పొందుతున్నాయో ***(యత్ ప్రయన్తి)*** అదియే బ్రహ్మము ***(తత్ బ్రహ్మ ఇతి)*** అని కుమారుడు, శిష్యుడు అయిన భృగువుకు, తండ్రి, ఆచార్యుడు అయిన వరుణుడు ఉపదేశించాడు. దీనిని తటస్థ లక్షణం అంటారు.

జగత్కారణత్వం బ్రహ్మమే అయి నపుడు, బ్రహ్మ లక్షణ మేమిటి? అనే ప్రశ్న పుడుతుంది. సత్యం, జ్ఞానం, అనంతం అనేది బ్రహ్మ యొక్క స్వరూప లక్షణము. తైత్తిరీయ శ్రుతి ప్రతిపాదించినది తటస్థ లక్షణం ***(యతో వా ఇమాని భూతాని జాయన్తే . . .).***

ఏది సృష్టింప బడినా, అలా సృష్టింప బడింది ప్రధానముగా రెండు కారణాలతో ఉంటుంది. ఒకటి నిమిత్త కారణం. రెండవది ఉపాదాన కారణము. జ్ఞానం కలిగిన సృష్టికర్త నిమిత్త కారణ మైతే, సృష్టించడానికి ఉపకరించే వస్తువు ఉపాదాన కారణము. ఇక్కడ సృష్టి విషయంలో బ్రహ్మమే నిమిత్త కారణంగా, బ్రహ్మమే ఉపాదాన కారణంగా తెలుస్తూ ఉన్నందువ, సృష్టి కార్యానికి బ్రహ్మము అభిన్న నిమిత్త ఉపాదాన కారణము అని చెప్పడం జరిగింది. బావుంది.

సర్వజ్ఞ డైన పరమేశ్వరుడు ***సోఽ కామయత బహుస్యామ్ ప్రజాయేయ*** - నేను అనేకముగా అవుతాను అనే సంకల్పం చేయడం వల్ల సృష్టి జరిగిందని ప్రమాణము కనుక సృష్టికి భగవంతుడు నిమిత్త కారణము అనుటలో సందేహము లేదు. మరి పరమేశ్వరుడు తన సర్వజ్ఞత్వము చేత సృజించిన ఈ సృష్టి కార్యానికి ఉపాదాన మేమిటి? ఉపాదానం మరొక టైతే, ఈశ్వరుడు సృష్టికర్త కాలేడు. సృష్టికి అభిన్న నిమిత్త ఉపాదాన కారణం అతడే అన్నప్పుడు, సృష్టికి ఉపాదానం మరొకటి ఎలా ఉంటుంది? కనుక తావే సృష్టికి ఉపాదానం. అంటే, బ్రహ్మము సృష్టిగా పరిణామం చెందినట్లేనా? పాలు పెరుగుగా మారినట్లు, బ్రహ్మము గనుక జగత్తుగా

పరిణామం చెందితే, బ్రహ్మము యొక్క అస్తిత్వము ప్రశ్నార్థకం కాదా? కనుక ఇక్కడ బ్రహ్మము ఎలాంటి ఉపాదానమో మనకు తెలియాలి.

**పరిణామమా? వివర్తమా?**

సృష్టికి ఉపాదాన కారణం పరమేశ్వరు డైనపుడు, ఉపాదాన మైన తాను సృష్టిగా పరిణామం చెందడం చేత, జగదుత్ప త్త్యనంతరం జగత్తు ఉంటుందే గాని పరమేశ్వరుడు ఉండడు. కనుక, ఉపాదాన కారణం పరమేశ్వరుడే అని అంగీకరించి నపుడు, తాను పరిణామి ఉపాదాన కారణం కాదని, వివర్త ఉపాదాన కారణ మని అర్థం చేసుకోవాలి.

పరిణామి ఉపాదాన మైతే, పరిణామం చెందడంలో తన స్వరూపాన్ని పోగొట్టు కోవడం జరుగు తుంది. కాని, వివర్తం అలా కాదు. తన స్వరూపాన్ని త్యాగం చేయకుండానే మరొక స్వరూపంగా రూపాంతరం చెందడం వివర్తము *(స్వస్వరూప అపరి త్యాగేన రూపాంతరాపత్తిః).*

నిద్రించి నపుడు మనం కల కంటూ ఉంటాం. స్వప్నము అనేది మన సృష్టి. ఎవరి స్వప్నాన్ని వారు సృష్టించు కుంటారు. కేవలం మన సంకల్పమే స్వప్న రూపం దాల్చింది కనుక, స్వప్న సృష్టికి మనమే నిమిత్త కారణము. అలాగే స్వప్నగత విషయాలకు, వస్తువులకు మన కన్నా మరో ఉపాదానం ఉండేందుకు అవకాశం లేనందున, మన మనస్సే ఉపాదానము. స్వప్నంగా మనమే మనకు గోచరిస్తున్నాం. స్వప్నానికి ఉపాదానం అయినంత మాత్రాన మన స్వరూపానికి భంగం వాటిల్ల లేదు. మేల్కొన గానే, నిద్రించిన వ్యక్తిగా లేస్తున్నాడే గాని, స్వప్నగత వ్యక్తిగా లేవడం లేదు. ఇదే వివర్త ఉపాదానము. తన స్వరూపంలో ఏ మార్పు లేకుండానే మరొక రూపంగా గోచరించడం. రజ్జువు రజ్జువు గానే ఉంటూ సర్పంగా గోచరించడం. సర్పానికి ఉపాదానము రజ్జువే అయినా, అది వివర్త ఉపాదానమే గాని పరిణామి ఉపాదానం కాదు.

**మాయా శక్తి**

సృష్టి కార్యానికి బ్రహ్మము పరిణామి ఉపాదానం కాదు, వివర్త ఉపాదానం అనగానే, సత్య జ్ఞానానంద స్వరూప మైన పరబ్రహ్మము నందు ఏ విధమైన మార్పు లేదని అర్థమౌతూ ఉంది. మరి, ఈ జగత్తు భిన్నత్వంతో గోచరిస్తూ ఉంది కదా? అది ఎలా సాధ్యం? అది దేని కార్యము? అది మాయా కార్యము. మాయ సృష్టి కార్యానికి పరిణామి ఉపాదాన కారణము. బ్రహ్మమును అశ్రయించుకొని ఉన్న మాయ ఈశ్వర శక్తి చేత ఈ సృష్టికి ఉపాదాన కారణంగా ఉందని మూడవ శ్లోకం లోనే తెలుసుకున్నాం. బ్రహ్మము మాయా శక్తి చేత సృష్టి కారణ మౌతున్నాడు. మాయ ఉపాధిగా ఉంది. మాయను ఉపాధిగా కలిగిన ఈశ్వరుడు, మాయను తన అధీనంలో ఉంచుకొని ఈ సృష్టి కార్యాన్ని సాగిస్తున్నాడు. ఈ విధంగా సృష్టికి పరాపర ప్రకృతులే కారణాలుగా ఉన్నాయి. జడ చైతన్యాలే కారణాలుగా తెలుస్తూ ఉన్నాయి. మాయ అపరా ప్రకృతి. చైతన్యము పరా ప్రకృతి. ఈ రెండిటి సమ్మేళనమే సృష్టి.

**మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయనం తు మహేశ్వరమ్**

మాయే ప్రకృతి అని తెలుసుకో! మాయను ఉపాధిగా కలిగిన మాయావి మహేశ్వరుడు.

పరమేశ్వరుడు సత్యం. ఉపాధి మిథ్య. మిథ్య కూడా బ్రహ్మమే. కాని బ్రహ్మము మిథ్య కాదు. ఉపాధితో కూడి నపుడు ఈశ్వరుడుగా తెలుస్తున్న వాడే ఉపాధి వినిర్ముక్తుడై నపుడు సచ్చిదానంద పరబ్రహ్మముగా శోభిస్తున్నాడు.



సృష్టి స్థాయి నుండి చూచి నపుడు, మాయ సృష్టికి పరిణామి ఉపాదానంగా తెలుస్తూ ఉంది. పరమేశ్వరుడు నిమిత్త కారణంగా గోచరిస్తున్నాడు. పరమేశ్వరుని స్థాయి నుండి చూచి నపుడు తానే సర్వ కారణంగా శోభిస్తున్నాడు. ***యద్భూత యోనిం పరిపశ్యన్తి ధీరాః*** - వినాశ మెరుగని బ్రహ్మమును సృష్టి కారణంగా ధీమంతులు దర్శించారు అన్నది ముండకోపనిషత్తు. మాయ లోని శక్తి తనదే కనుక, తన ప్రకృతి కారణం గానే సృష్టి కార్యం జరిగింది.

అర్జునా! ఈ విధంగా సమస్త జగత్తుకు *(కృత్స్నస్య జగతః)* నేనే ఉత్పత్తి స్థానం గాను, లయ స్థానం గాను ఉన్నాను *(అహం ప్రభవః ప్రలయః)* అన్నాడు భగవంతుడు.

*ఈ కారణం చేత పరమేశ్వరుని కన్నా వేరుగా ఏమీ లేదు. అదే చెబుతున్నాడు.*

**మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనఞ్జయ ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥** 7

*మత్తః-పరతరం-న-అన్యత్-కించిత్-అస్తి-ధనంజయ*
*మయి-సర్వం-ఇదం-ప్రోతం-సూత్రే-మణిగణాః-ఇవ*

| | | | |
|---|---|---|---|
| ధనంజయ | = అర్జునా! | సూత్రే | = దారము నందు |
| మత్తః | = నా కంటె | మణిగణాః ఇవ | = రత్నముల వలె |
| పరతరం | = శ్రేష్ఠమైన | మయి | = నా యందు |
| అన్యత్ | = వేరొకటి | ఇదం | = ఈ |
| కించిత్ | = ఏదియును | సర్వం | = సమస్త ప్రపంచము |
| న అస్తి | = లేదు | ప్రోతం | = గ్రుచ్చబడింది |

**ధనంజయా! అర్జునా! నా కంటే శ్రేష్ఠ మైనది మరొకటి లేనే లేదు. దారము నందు మణుల లాగా ఈ ప్రపంచ మంతా నా యందే గ్రుచ్చబడి ఉంది.**

**వ్యాఖ్య**

**చేతన కర్తృత్వం**

కారణము లేకుండా కార్యము ఉండదు. సృష్టి కార్య రూపంలో తెలుస్తూ ఉన్నందున, దానికి కారణ మేమిటి? అనే అన్వేషణ, విచారము ఎందరో చేశారు. సృష్టి కారణం ఏమిటి అనగానే సాంఖ్యుల దృష్టిలో ప్రధానం మెదిలితే, వైశేషికుల మనస్సులలో అణువులు కదుల్తాయి. ఇవి సృష్టి కారణాలని చెప్పడానికి ఏ విధమైన ప్రమాణమూ లేదు.

ప్రధాన మైనా, అణువు లైనా ప్రకృతి సంబంధ మైనవే కనుక అవి జడప్రాయాలు. జ్ఞానమయంగా తెలుస్తున్న సృష్టికి జడాలు ఎలా కారణ మౌతాయి? నియతి ఉన్నచోట జ్ఞానం కలిగిన నియంతయే కారణంగా ఉంటాడు. ఉండాలి.

***ఈక్షతే ర్నాశబ్దమ్*** - అతడు సృష్టించాలని చూశాడు ***(ఈక్షతేః)*** అని శ్రుతి యందు చెప్పబడటం చేత, శ్రుతి యందు ప్రతిపాదించని ప్రధానము లేదా అణు సముదాయము ***(అశబ్దమ్)*** కారణం కాలేదు ***(న)*** అని బ్రహ్మసూత్ర విషయము. కనుక, సృష్టికి జడాలు కారణం అని చెప్పడం అప్రమాణము.

సృష్టికి ఏది కారణ మని చెప్పినా, అలా కారణమైన దానికి మరొకటి కారణం కాకూడదు. కారణానికి

కారణం ఉండే, మరొక కారణం అనబడేది కార్య మవుతుందే గాని కారణము కాలేదు. కనుక, సృష్టి కార్యానికి కారణము చేతనమై ఉండాలే గాని జడము కాలేదు. కాబట్టి, సర్వజ్ఞ మైన పరమేశ్వరుని కన్నా మరొక జగత్కారణం ఉండేందుకు అవకాశమే లేదు అనేది ప్రస్తుత శ్లోకము లోని విషయము.

## సర్వ కారణమ్

అర్జునా! ధనంజయా! నా కంటే *(మత్తః పరమేశ్వరాత్)* పరమోత్కృష్ట మైన *(పరతరమ్)* మరొక కారణము *(అన్యత్ కారణాంతరం)* ఏదీ లేదు *(కించిత్ నాస్తి న విద్యతే)* అంటున్నాడు భగవంతుడు. మరొక జగత్కారణము లేదు అంటున్నాడు. అంటే, సత్య జ్ఞానానంద స్వరూప లక్షణము కలిగి, మాయను ఉపాధిగా కలిగిన తన కంటే గొప్పదైన మరొకటి జగత్కారణంగా లేదు అని అర్థము. జగత్తుకు కారణ మైంది ఏదో అది పరమోత్కృష్ట మైనదై ఉండాలి. కాని, తన కన్నా ఉత్కృష్ట మైనది మరొకటి లేనందున తానే జగత్కారణము అని నిర్ధారణ చేస్తున్నాడు *(అహ మేవ జగత్కారణం ఇత్యర్థః)*. ఈ విషయం ప్రామాణికంగా ఉంది. శ్రుతి ప్రతిపాదితమై ఉంది.

***యః సర్వజ్ఞః సర్వవి ద్యస్య జ్ఞానమయం తపః ఏష సర్వేశ్వరః ఏష సర్వజ్ఞ ఏషోఽ న్తర్యా మ్యేష యోనిః సర్వస్య ప్రభవా ప్యయౌహి భూతానామ్*** - అతడు సర్వజ్ఞుడు, సర్వవేత్త. అతని తపస్సు జ్ఞానమయము *(ఈక్షతేః)*. అతడే సర్వేశ్వరుడు. అతడే సర్వజ్ఞుడు. అతడే అంతర్యామి. సమస్తమునకు కారణము అతడే. సమస్త భూతముల యొక్క ఉత్పత్తి లయాలకు కారణం అతడే.

పూర్వ శ్లోకంలో జగత్తు సృష్టి లయాలకు తానే కారణం అని చెప్పిన పరమేశ్వరుడు, ఈ శ్లోకంలో స్థితి కారణం కూడా తానే అని చెబుతున్నాడు. తనతో సమాన మైనది, శ్రేష్ఠ మైనది మరొకటి లేనందున, జగత్కారణత్వం తనదే అంటున్నాడు. తన కన్నా పరమైనది ఇతరము లేదు అని చెప్పడమే 'పరతర' శబ్దార్థము. ఈశ్వరుని కంటే పరతర మైన కారణం లేదని చెప్పడమే ఉద్దేశ్యము.

పారమార్థికంగా చూచి నపుడు పరమేశ్వరుడు సచ్చిదానంద స్వరూప లక్షణము చేత విలక్షణంగా శోభించుట చేత అంతా పరమాత్మ స్వరూపమే. వ్యావహారికంగా చూచి నపుడు తన కంటే ఇతరమైన స్వతంత్ర కారణము ఏదీ లేనందున, మాయోపాధిని అధీనంలో ఉంచుకున్న పరమేశ్వరుడు, అన్నిటి లోను తానే ఉన్నాడు. ఎలా చూచినా తన కన్నా అన్య మైనది ఏదీ లేదు. ఇదే జ్ఞాన వైభవము.

## సర్వ సంప్రతిష్ఠము

అన్నిటికీ తానే కారణమై, అన్నిటిలో తానే ఉండే టప్పుడు, మరి ఉన్న వన్నీ ఎక్కడున్నట్లు? అని శాస్త్రం ప్రశ్నించింది. ***కస్మిన్ సర్వే ప్రతిష్ఠితా భవన్తి?*** - దేని యందు అన్నీ ప్రతిష్ఠిత మయ్యాయి? అనేది ప్రశ్న. ఉన్నది తానే కనుక, ఏవి ఉన్నా తన యందే ఉండాలి. ఎలా? దారము నందు మణుల లాగా ఉండాలి ***(సూత్రే మణి గణాః ఇవ)***. దారము నందు మణులు కూర్చ బడినట్లు, పరమేశ్వరుని యందు సమస్త భూతాలు, ప్రపంచము గ్రుచ్చబడి ఉంది. సర్వమూ సర్వ కారణమైన సర్వేశ్వరుని యందు సంప్రతిష్ఠమై ఉంది.

మణిహారంలో మణులు ఎన్నున్నా, దారం మాత్రం ఒక్కటే. మణు లన్నీ విడి పోకుండా ఒక్కటిగా హారంలో నిలబడి ఉండటానికి దారమే ఆధారము. స్వశక్తితో మణులు నిలబడ లేవు. అన్ని మణులకు ఒకే దారము ఆధారంగా ఉంది. సర్వాధారంగా ఉంది.

జగత్తులో ఉన్న రూపా లన్నిటికీ ఆధారంగా పరమేశ్వరుడే ఉన్నాడు. మణులు నిలవ దానికి సూత్రము





ఎలా ఆధారమో, విశ్వము లోని నామరూపాలకు సూత్రాత్మ ఆధారము. మణిహారంలో మణులు గోచరిస్తాయే గాని దారము కనిపించదు. పరిశీలించి వివేచనం చేస్తేనే కనిపిస్తుంది. సృష్టిలో రూపాలు గోచరిస్తాయే గాని సూత్రాత్మ కనిపించదు. విచారించిన వారికే ఉన్నట్లు అర్థ మవుతుంది. మణిహారంలో దారం లోపలే ఉంటుంది. సూత్రం అంతర్యామి. అలాగే సర్వములో పరమేశ్వరుడు అంతర్యామి.

***సూత్రే మణి గణాః ఇవ*** - అనే చోట మణులు అనకుండా మణుల సముదాయము అనడం జరిగింది. 'గణ' శబ్దము చేత వివిధములు అని సూచించడము జరిగింది. వివిధ ఆకారములలో, వివిధ రంగులలో, వివిధ రూపాలలో మణు లుంటాయి. ఈ విధమైన ద్వైతము దారములో కనిపించదు. అది అద్వయమే.

సూత్రము నందు మణుల వలె, సూత్రాత్మ యందు భూతాలు, ప్రపంచము ఓతప్రోతమై ఉన్నవి అనేది దృష్టాంతము. దృష్టాంతము ఎప్పుడైనా ఏకదేశీయమే గాని సార్వదేశీయం కాదు అనేది గమనార్హం (దారం మణుల కన్నా వేరై నపుడు అద్వైత మెలా సిద్ధిస్తుంది? అనే పిడి వాదాన్ని నివారించేందుకు దృష్టాంతాన్ని వివరించాము).

ఇక్కడ ఒక గమ్మత్తు ఉంది. దారము నందు మణుల వలె నా యందు ఈ సమస్తము ప్రోతమై ఉంది అన్నాడు భగవంతుడు *(మయి సర్వ మిదం ప్రోతం)*. ***ఓతః ప్రోతః*** అనేది సంస్కృతములో ఉంది. తెలుగులో కూడా ఓతప్రోతము అనే వాడుక ఉంది. ఓతప్రోత మంటే ఓతములు, ప్రోతములు అని అర్థము. పడుగు పేకలతో వస్త్రాన్ని వేయడము ఓతప్రోతము. అడ్డముగా వేయబడే దారములు ఓతములు. పొడవుగా ఉండే దారాలు ప్రోతములు. ఇదే ఓతప్రోతము. దీనిని రెండుగా మనం పిలుస్తున్నా, వాస్తవానికి అంతా దారమే. దూది మాత్రమే. ఇలా అద్వైతాన్ని భావించ వచ్చు. దృష్టాంతాలు ఎన్నైనా ఇవ్వవచ్చు. విషయాన్ని గ్రహించడమే ప్రధానం.

చివరగా అర్థం కావలసింది ఒక్కటే. పరమాత్మ ఆధారము. జగత్తు ఆధేయము. పరమాత్మ సత్యము. జగత్తు పరమాత్మపై ఆధారపడి ఉన్నందున మిథ్య. ఉన్నది సత్య మొక్కటే కనుక, మిథ్య కూడా సత్యమే. కాని, సత్యము విలక్షణంగా ఉన్నందున సత్యము మిథ్య కాదు. సత్యమే మిథ్యకు ఆధారము. మిథ్యలో సారభూత మైనది సత్యమే. దాని కన్నా అన్య మైనది లేనే లేదు. కనుక, అన్నిటిలో అంతట పరమేశ్వరునే దర్శించాలి.

*అదెలాగో వరుసగా ఐదు శ్లోకాలలో వివరిస్తున్నాడు.*

**రసోఽ హ మప్సు కౌన్తేయ ప్రభాస్మి శశిసూర్యయోః ।**
**ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥** 8

***రసః-అహం-అప్సు-కౌంతేయ-ప్రభా-అస్మి-శశిసూర్యయోః***
***ప్రణవః-సర్వవేదేషు-శబ్దః-ఖే-పౌరుషం-నృషు***

| | | | | | |
|---|---|---|---|---|---|
| కౌంతేయ | = అర్జునా! | | ఖే | = | ఆకాశము నందు |
| అప్సు | = నీటి యందు | | శబ్దః | = | శబ్దము |
| రసః | = ద్రవ పదార్థము | | నృషు | = | మనుష్యుల యందు |
| శశిసూర్యయోః | = చంద్రసూర్యుల యందు | | పౌరుషం | = | పురుష లక్షణము |
| ప్రభా | = ప్రకాశము | | అహం | = | నేను |
| సర్వవేదేషు | = సర్వ వేదములలో | | అస్మి | = | అయి యున్నాను |
| ప్రణవః | = ఓంకారము | | | | |

కౌన్తేయా! అర్జునా! నీళ్ళలో నేను రసాన్ని, చంద్రసూర్యుల లోని కాంతిని నేనే. వేదాలలో నేనే ఓంకారము. ఆకాశంలో శబ్దాన్ని, పురుషులలో పౌరుషాన్ని నేనే.

వ్యాఖ్య

జగత్తు యొక్క ఉత్పత్తి ప్రళయాలకు తానే కారణ మని ఆరవ శ్లోకంలో ప్రవచించిన పరమేశ్వరుడు, జగత్తు యొక్క స్థితి కారకుడు కూడా తానే అని ఏడవ శ్లోకంలో స్పష్టం చేశాడు. జగత్తు యొక్క స్థితికి కారకుడు కావాలంటే, జగత్తు లోని ప్రతి వస్తువులో తానే సత్తా రూపుడై ఉండాలి. అలా ఉండటమే పరమేశ్వరుని యొక్క సర్వ వ్యాపకత్వము. సారభూత మైన అస్తిత్వము.

సారము అంటే ఒక వస్తువును పోషించే కారణము లేదా హేతువు అని అర్థము. ఘటము అనేది మృత్కార్యము. మృత్కార్య మైన ఘటానికి కారణము మృత్తికే కదా! మృత్తిక కన్నా వేరుగా ఘటం ఉండ గలదా? కనుక కార్యా లైన మట్టిపాత్ర లన్నీ వాటి అస్తిత్వానికి కారణమైన మృత్తిక యందే కూర్చబడి ఉన్నాయి. ప్రోతమై ఉన్నాయి. అలాగే సర్వ కారణమైన తన యందు జగత్తు సర్వము ప్రోతమై ఉండటం చేత సర్వ కారణమైన పరమేశ్వరుడే సర్వవ్యాపిగా ఉంటూ సర్వములో సత్తారూపుడై ఉన్నాడు.

ప్రపంచంలో సారభూత మైన వాడు సర్వేశ్వరుడు అనగానే, ప్రపంచం తన కన్నా వేరు కాదు అని అర్థ మవుతుంది. ఒకవేళ పదార్థంలో సారము లేకపోతే, సారమే పదార్థము యొక్క ధర్మం కావడం చేత, పదార్థము తన మనుగడనే కోల్పోతుంది.

పంచదార తియ్యగా ఉంటుంది. తీపి అనేది పంచదార లోని సారము. ఆ సారమే పంచదార యొక్క ధర్మము. పంచదారలో తీపి నశిస్తే, పంచదారను పంచదారగా ఎవ్వరూ గుర్తించరు. కనుక తీపి అనేది పంచదార యొక్క లక్షణమే గాని విశేషణము కాదు. తీపి చక్కెర అని ఎవ్వరూ అనరు. చక్కెరే తియ్యగా ఉంటుంది కనుక, ప్రత్యేకించి తీపి అనే విశేషణాన్ని వాడ వలసిన అవసరం లేదు. చేదు చక్కెర ఒకటి వేరుగా ఉంటే, అప్పుడు మాత్రమే తీపి అనే విశేషణాన్ని ఉపయోగించి తీపి చక్కెర అనవలసి ఉంటుంది.

కనుక పంచదారలో తీపి అనేది సారము కనుక, సార రూపమైన మాధుర్యము పంచదార యొక్క ధర్మము. అంటే పంచదార పంచదారగా ఉండాలి అంటే, పంచదార తీపి అనే తన ధర్మాన్ని కోల్పోకూడదు.

సారరూపంగా, హేతువుగా అర్థ మౌతున్న ధర్మ నిర్వచనాన్ని కూడా చూద్దాం. ***ధర్మమ్ = ధరతి విశ్వం ధర్మః 'ధృఞ్ ధరణే'*** - ధర్మము అంటే విశ్వమును ధరించునది అని అర్థము. ధర్మము అనేది చాలా విస్తృత మైన అర్థంతో భాసించే పదము. విశ్వమును ధరించేది అనగానే మనకు గోచరించే మానవ లోకమే కాదు, మానవ లోకము మానవ లోకంగా ఉండటానికి ఏది కారణమో, బ్రహ్మలోకము నుండి రసాతలము వరకు ఏయే లోకాలు ఉన్నాయో, అవన్నీ అలా ఉండటానికి ఏది హేతువో అదే ధర్మము. ***ధర్మః = ధరతి లోకానితి ధర్మః*** - లోకాలను ధరించునది ధర్మము. కనుక సర్వ లోకాలకు ధర్మమే సారము. సారమైన ధర్మ రూపంలో దైవమే ఉండటం చేత, ధర్మమును సారముగా గల లోకాలన్నీ దైవము నందు ప్రోతమై ఉన్నాయి, కూర్చబడి ఉన్నాయి, దారము నందు మణుల వలె గ్రుచ్చబడి ఉన్నాయి అని అర్థము *(7 - 7)*. ఈ విధంగా పరమేశ్వరుడు విశ్వానికి స్థితి కారకుడు. హేతుభూత మైన సారమును సూచిస్తూ ప్రవచించడం చేత జగత్తు యొక్క స్థితికి తానే కారణ మయ్యాడు. మరి, వివిధ ప్రత్యయ గమ్యమైన విశ్వంలో ఒక్కొక్క వస్తువు ఒక్కొక్క విధమైన సారమును, హేతువును కలిగి ఉంది కదా! ఆ సారములు లేదా ధర్మాలన్నీ సర్వేశ్వరుడేనా? అదే నిశ్చయ మైతే, ***కేన కేన ధర్మేణ విశిష్టే త్వయి సర్వమ్ ఇదమ్ ప్రోతమ్ ఇతి?*** - ఏయే ధర్మములతో కూడిన నీ యందు





(పరమేశ్వరుని యందు) ఈ జగత్తు, ఈ జగత్తు లోని విషయా లన్నీ ప్రోతమై ఉన్నాయి, లేక కూర్చబడి ఉన్నాయి? అనే ప్రశ్నకు సమాధానంగా విశిష్ట మైన వాటిని కొన్నిటిని ఏరుకొని, అవి పరమేశ్వరునిలో ఎలా ఓతప్రోతమో వివరిస్తున్నాడు. ఎనిమిదవ శ్లోకం నుండి వరుసగా ఐదు శ్లోకాల లోని కేంద్ర విషయం ఇదే.

**ఉదకంలో ఊరేగింపు**

జలములో రసము నేనే అంటున్నాడు భగవంతుడు ***(అప్సు అహం రసః)***. నీళ్ళలో రుచి ఉంది. అలాగే శక్తి ఉంది. నీరము ప్రాణాధారము అని కదా నానుడి! నీళ్ళు లేకుండా ప్రాణాలను నిలుపుకో లేము. కనుక నీరు ప్రాణాధార మైంది. జలము పవిత్ర మైంది కూడా. అపవిత్రాన్ని పవిత్రం చేసే వాటిలో జల మొకటి.

స్థూలంగా కనిపిస్తున్న నీటిలో రుచి అనేది సూక్ష్మంగా ఉంది. చూస్తే కనిపిస్తాయి నీళ్ళు. రుచి చూస్తేనే అర్థ మవుతుంది రసం. కనుకనే రసం అంటే ఆస్వాదింప బడేది అనే అర్థం కూడా ఉంది. ***రస్యతే ఆస్వాద్యతే ఇతి రసః*** ఆస్వాదింప బడేది రసము. అవలోకిస్తే జలం. ఆస్వాదిస్తే రసం.

జలము జడము. జడమైన జలంలో దాహం తీర్చే శక్తి ఉంది. సదా చలనశీలమై ఆనందానుభూతికి ప్రతిరూపంగా కనిపించే జలంలో సర్వ ప్రాణులను తృప్తి పరచే అద్భుత మైన రస పుష్టి ఉంది. ఇదంతా భగవద్వైభవము.

ఉదజని, ప్రాణవాయువుల రసాయనిక పదార్థ సమ్మేళన సూత్రము ఎవరిది? నీళ్ళల్లో కనిపించే జ్ఞానము ఇదే కదా! ఆ రసాయనిక సూత్రము రస స్వరూపుడైన సూత్రాత్మదే కదా! ఉదకం ఉర్విలో ఉన్నా, ఉదకం ఉదకంగా ఉండటానికి హేతువైన పరమేశ్వరుడు అర్థమైతే, ఉదకం పరమేశ్వరునిలో ఎలా ప్రోతమో తెలిసి వస్తే, ఆ తరువాత ఉదకంలో రస రూపంలో, శక్తి రూపంలో శీతల గుణంతో చల్లగా, హాయిగా ఉమానాథుడే ఊరేగుతూ నేత్ర పర్వంగా దర్శన మిస్తాడు. శుచిరుచుల రూపంలో పవిత్రంగా, పసందుగా అనుభవానికి అందుతాడు.

జలము ద్రవ రూపం లోనే ఉండాలని లేదు. మంచుగడ్డ లాగా ఘనరూపం లోను ఉండొచ్చు. వాయు రూపంలో కూడా ఉండొచ్చు. మేఘ రూపంలో ఉండొచ్చు. వర్ష రూపంలో క్రిందికి జారి సమస్తాన్ని ముద్ద ముద్దగా తడుపవచ్చు. లేదా, కళ్ళను మాత్రమే తడిపే స్థితిలో నేత్ర గోళాలలో దాగి ఉండొచ్చు. అందుకే జలాన్ని సంస్కృతములో ***ఆపః*** అన్నారు. ***ఆప్నువన్తి వ్యాప్నువన్తి సర్వం జగదితి ఆపః*** - జగత్తంతా వ్యాపించి ఉండటం చేత జలమును ***ఆపః*** అన్నారు. అట్టి జలములలో ***(అప్సు)*** నేను రసరూపుణ్ణి ***(అహం రసః)*** అంటున్నాడు గీతాచార్యుడు.

జలము లోని రసం జగన్నాథుడే. జలము యొక్క మనుగడకు రసమే ప్రధానం కనుక, రస రూపుడైన పరమేశ్వరునిలో జలాలు ప్రోతమై ఉన్నాయి. కూర్చబడి ఉన్నాడు. ఇదీ ప్రోతం అంటే. ఇలాగే ప్రతి వస్తువును, ప్రతి విషయాన్ని పరమేశ్వరునిలో ప్రోతమై ఉన్నట్లు అర్థం చేసుకోవాలి. అప్పుడు ప్రతి వస్తువులో, ప్రతి అణువులో అచ్యుతుడే అగుపిస్తాడు.

**వెలుగుల విన్యాసము**

సూర్యచంద్రులలో ప్రకాశము పరమేశ్వరుడే. జలంలో రసం లాగా, శశిసూర్యులలో కాంతిగా లక్ష్మీకాంతుడే ఉన్నాడు ***(శశిసూర్యయోః అహం ప్రభా అస్మి)***.

చీకటిలో బ్రతకడం ఎవరి కైనా కష్టమే. అంధకారంలో అలమటిస్తూ బ్రతుకును ఈడ్చుకుంటూ పోవడం

అంధులకు ఎలాగూ తప్పదు. కళ్ళున్న వారు కళాత్మక మైన విశ్వ సౌందర్యాన్ని వీక్షించడానికి వెలుగులు కావాలి. వెలిగించుకొనేవి ఎప్పుడు ఆరిపోతాయో తెలియదు. ఆరి పోకుండా వెలుగులను విరజిమ్మే సూర్యచంద్రుల లోని కాంతి పరమేశ్వరునిదే. శశిసూర్యులలో ప్రకాశంగా తెలిసేది తానే.

వాస్తవానికి చంద్రునిలో గోచరించే ప్రకాశము సూర్యునిదే. ఏదైనా, ఎవరి నుండి వచ్చినా, ఎలా వచ్చినా ఆ ప్రకాశము పరమేశ్వరునిదే. సూర్యుడు సూర్యుడుగా ఉండటానికి ఏ ప్రకాశము కారణమో, చంద్రుడు చంద్రుడుగా ఉంటూ చల్లదనాన్ని చిందించడానికి ఏ ప్రకాశము కారణమో, అది పరమేశ్వరుని ప్రకాశమే అని అర్థమైతే, శశిసూర్యులు పరమేశ్వరుని యందే ప్రోతమై ఉంటారు.

**చరణము: కన్నులలో వెలుగువు నీవే - వెన్నెలలో వెలుతురు నీవే**
**జలమున ప్రాణము జగతిలో జీవము - అంతా నీవే అనంతము నీవే ॥**
**పల్లవి : గానలోల! కరుణాల వాల! గాచిబ్రోవు నిరుపమ గుణశీల ॥ గానలోల ॥**

అని కవిత నల్లిన చైతన్య హృదయం పరమాత్మలో ప్రోత మైంది.

### వేద నాదం

వేదాలలో ప్రణవనాద మైన ఓంకారము తానే అంటున్నాడు గీతాచార్యుడు ***ప్రణవః ఓంకారః సర్వ వేదేషు।*** వేదజ్ఞానము అక్షయము. అక్షరము. వేదజ్ఞానము అక్షరవిద్య. అట్టి వేదముల సారమే ఓంకారము. అదే ఓంకారవిద్య. లేదా ప్రణవవిద్య.

ప్రణవము అంటే ఓంకారము. ***అవతి భూతిని ఇతి ఓం, అవ రక్షణే*** - సర్వ భూతములను రక్షించునది ఓంకారము. వేదోపదేశ సారమే ఓంకారము. సర్వులను రక్షించేది ఏది? సర్వత్ర ఉన్నదే సర్వులను రక్షించ గలదు. దైవము ధర్మ రూపంలో సర్వత్ర ఉంటూ రక్షించడము ఎలా జరుగుతూ ఉందో, అలాగే ఓంకారము సర్వత్ర ఉండి సర్వులను రక్షిస్తూ ఉంది. ఇలా సర్వగతమై రక్షించడ మనేది దైవము, ఓంకారము రెండూ చేస్తున్నాయా? సర్వ వ్యాపకత్వ మనేది రెండిటికి ఉండే అవకాశము లేనందున బ్రహ్మమే ప్రణవము. ప్రణవమే బ్రహ్మము. ***తస్య వాచకః ప్రణవః*** - ప్రణవము అనేది పరమాత్మ నామము అన్నది శాస్త్రం. ఓంకార ధ్యానము పరమాత్మ ధ్యానము. ఓంకార జ్ఞానము పరమాత్మ జ్ఞానము. ఉపనిష త్ప్రతిపాదిత మైన జ్ఞానమే ఓంకారము నందు ఉంది. అందుచేత, ఓంకార జ్ఞానము ముక్తిని ప్రసాదిస్తుంది.

***ఓంకారేణ ప్లవేనైవ సంసారాబ్ధిం తరిష్యసి*** - ఓంకారము అనే నౌక నెక్కి, సంసార సాగరాన్ని దాటవచ్చు. ప్రణవము దేశకాలాదులకు పరిమిత మైనది కాదు. సత్యస్వరూప మైనది. కనుక, కాలాతీత మైనది.

మూడు కాలాలు ప్రణవంలో ఇమిడి ఉన్నాయి. గతంలో ఉన్నది, ప్రస్తుతము ఉన్నది, భవిష్యత్తులో ఉండబోయేది అంతా ఓంకారము నందే ఉంది. ***భూతం భవ ద్భవిష్యదితి సర్వం ఓంకార ఏవ*** అన్నది మాండూక్యోపనిషత్తు. మూడు కాలాలలో ఉంటూ, ప్రణవము కాలాతీతంగా ఉన్నట్లు, మూడు అవస్థలలో ఉంటూ, అవస్థాత్రయ సాక్షిగా ఓంకారము విరాజిల్లుతోంది.

ఆత్మస్వరూప మైన ఓంకారము నాలుగు పాదాలతో ఉందని ఉపనిషత్ నిర్వచనము. 'అ' కారము జాగ్రదవస్థ అభిమాని యైన వైశ్వానరుని, 'ఉ'కారము స్వప్నావస్థకు సంబంధించిన తైజసుని, 'మ'కారము సుషుప్త్యవస్థాభిమాని అయిన ప్రాజ్ఞునికి సంకేతమై ఉండగా, అమాత్రా ప్రణవము చతుర్థ పాదమైన తురీయుని వైభవమై ఉంది. అకారాది మాత్రలు, విశ్వాది పాదాలు లేని, సమస్త ద్వైతము ఉపశమించిన అద్వైత స్థితియే





ఓంకారము అని మాండూక్య నిర్ణయము ***(అమాత్ర శ్చతుర్థోఽ వ్యవహార్యః ప్రపంచోపశమః శివోఽ ద్వైత ఏవం ఓంకార ఆత్మ ఏవ)।*** ఓంకారవిదుడు ఆత్మవిదుడే. ఆత్మజ్ఞానము అజ్ఞానమును ఎలా అంత మొందిస్తూ ఉందో, ఓంకార జ్ఞానము కూడా అవిద్యను అంతం చేస్తుంది. కనుక వినాశ మెరుగని పరబ్రహ్మమే ఓంకారము. విశ్వ మంతా బ్రహ్మమే వ్యాపించి ఉన్నాడని అర్థం చేసుకున్నాం. ప్రణవము, పరబ్రహ్మము రెండూ ఒక్కటే కనుక, ప్రణవమే ప్రపంచ రూపంలో ఉంది.

***ఓం ఇతి ఏత దక్షరం ఇదం సర్వం*** - ఇదం సర్వం బ్రహ్మ ఏవ అని ఉపనిషత్ చెప్పినట్లే, ఈ సమస్త ప్రపంచము 'ఓం' అనే ప్రణవాక్షరమే అన్నది మాండూక్యోపనిషత్తు.

సర్వ వేదాలలో సారరూపంగా ఓంకారము ఉండటం చేత, ప్రణవ స్వరూపుడైన పరమాత్మ యందు వేదాలు ప్రోతమై ఉన్నాయి. గ్రుచ్చబడి ఉన్నాయి.

**తద్యథా శఙ్కునా సర్వాణి పర్ణాని సంతృణ్ణాని ఏవం ఓంకారేణ సర్వావాక్**

**సర్వావాక్** అంటే సర్వ వేదములు. **సంతృణ్ణాని** అంటే ప్రోతములు, గ్రథితములు, కూర్చబడ్డవి. 'శంకువు' అంటే ఈనె. 'పర్ణములు' అంటే ఆకులు.

ఈనె చేత ఆకులు గ్రుచ్చబడి నట్లు, ఓంకారము అనే ఈనె చేత సర్వ వేదములు గ్రథితమై ఉన్నాయి అన్నది వేదం. ఇలా పరమేశ్వర స్వరూపమైన ప్రణవము వేదాలను గ్రథితం చేయడం వల్ల కూడా, వేదాలు పరమాత్మ యందే ప్రోతమై ఉన్నాయి.

### గగనంలో గోల

ఆకాశము నందు శబ్ద రూపంగా ఉన్నది కూడా పరమేశ్వరుడే ***(శబ్దః ఖే)।*** అవకాశాన్నిస్తూ ఉన్నందున ఆకాశ మైంది. చప్పట్లు చరిస్తే శబ్దం వస్తుంది. అలా చప్పట్లు చరచాలి అంటే ఆకాశం ఉండాలి. శబ్ద గుణం కలది ఆకాశము. శబ్దమును కలిగించ లేకపోతే అది ఆకాశమే కాదు. కనుక ఆకాశము ఆకాశంగా ఉండటానికి ఏ శబ్దము సారమై ఉందో, ఆ శబ్దము పరమేశ్వరుడై ఉన్నందున, ఆకాశము పరమేశ్వరుని యందే ప్రోతమై ఉంది. సుప్రతిష్ఠమై ఉంది. అందుచేత ***ఆకాశవత్*** అని, ***గగన సదృశం*** అని పరమేశ్వరుని వర్ణిస్తూ ఉంటారు.

### పురుషులలో పౌరుషం

పురుషులలో పురుష లక్షణంగా ఉన్నాడు ***(పౌరుషం నృషు)।*** 'పురి' అంటే శరీరము. నవద్వారాలు కలిగిన పురమే దేహము అని ఐదవ అధ్యాయం లోనే చూశాము. దేహము అనే పురి లేదా పురములో ఉండేవాడు పురుషుడు ***(పురి శరీరే శేతే ఇతి పురుషః)।*** కనుక ఇక్కడ పురుషుడు అంటే మగవాడు అని గ్రహించ కూడదు. దేహము అన్నప్పుడు అది పురుష దేహం కావచ్చు, లేదా స్త్రీ దేహము కావచ్చు. కనుక ఇక్కడ పురుష శబ్దాన్ని ఉపలక్షణంగా గ్రహించాలి.

పురుషులలో పౌరుషము అంటే మానవ దేహంలో శక్తి అని అర్థము. ఆ శక్తి దైహిక శక్తి కావచ్చు. బౌద్ధిక శక్తి కావచ్చు. ఏదైనా శక్తిని కలిగి ఉంటేనే మానవులు.

మనుషులలో శక్తి ఉంది కనుకనే భారాలు మోస్తున్నారు. భారమైన శరీరాన్ని మోసే శక్తి కూడా దేహం లోనే ఉంది. తిరిగే శక్తి ఉంది. తిట్టే శక్తి ఉంది. నడిచే శక్తి ఉంది. నవ్వే శక్తి ఉంది. కొట్టే శక్తి ఉంది. భరించే శక్తి ఉంది. ఇదంతా పౌరుషమే. మానవులలో ఉన్న ఈ శక్తి ఈశ్వర శక్తియే కనుక, మానవు లందరూ పరమేశ్వరునిలో ప్రోతమై ఉన్నారు. పరమేశ్వరుని మీదే ఆధారపడి ఉన్నారు.

మానవులలో ఉండే శక్తి ఈశ్వరునిదే. కాని ఈశ్వరుని లోని సర్వశక్తిమత్వం మానవులలో ఉండదు. అందుచేత పరమేశ్వరుని వైభవము సంపూర్ణంగా తమలో లేనందున అందరూ ఈశ్వరునిపై ఆధారపడి ఉంటారు.

**ఆఖ్యాయిక**

ఒకనాడు అరణ్యంలో బందిపోటు దొంగ అంగులీమాలుడు గౌతమ బుద్ధునికి తటస్థ పడ్డాడు. బుద్ధుణ్ణి వధించుటకు సిద్ధపడ్డాడు.

బుద్ధుడు అతణ్ణి వారిస్తూ, తన చివరి కోరికను తీర్చమని అడిగాడు. 'ఏమిటది?' అని ప్రశ్నించాడు అంగులీమాలుడు.

ప్రక్కనే ఉన్న చెట్టుకొమ్మ నొక దానిని చూపిస్తూ, 'ఆ వృక్ష శాఖను ఖండించు' అన్నాడు బుద్ధుడు. కత్తి తీసుకొని క్షణాల్లో ఆ చెట్టుకొమ్మను నరికేశాడు అంగులీమాలుడు. 'ఇంకేమి కావాలో కోరుకో!' అన్నాడు మళ్ళీ.

'ఆ చెట్టుకొమ్మను పూర్వం లాగే చెట్టుతో కలుపు' అన్నాడు బుద్ధుడు. అంగులీమాలుడు ఆశ్చర్య పోయాడు. 'నీకు పిచ్చి పట్టలేదు కదా! తెగిన కొమ్మను ఎవ్వరైనా తిరిగి అతికించ గలరా?' అన్నాడు.

'ఆ పిచ్చి ఏదో నీకే పట్టి ఉండాలి. నాకు కాదు. తిరిగి అతికించే శక్తి లేని వాడివి ఎందుకు ఖండించావు? విధ్వంసాలు చెయ్యడానికి పిల్లలు, పిచ్చివాళ్ళు కూడా సరిపోతారు.

విధాయకం తెలిసిన వాడే విధ్వంసాన్ని సృష్టించాలి. నిర్మాణం చేయగలిగే శక్తి ఉన్నవాడే నిర్మూలనం చెయ్యాలి. నిర్మాణం చెయ్యలేని వానికి నిర్మూలనం చేసే హక్కు ఎక్కడుంది?' అని ప్రశ్నించాడు బుద్ధుడు.

బుద్ధుని మాటలు బందిపోటులో గొప్ప పరివర్తనము కలిగించాయి. అతని జీవన విధానాన్నే మార్చేశాయి. ఈశ్వర శక్తి అర్థమైతే, పరమేశ్వరుని వైభవం తెలిసి వస్తే ప్రతి వ్యక్తిలో పరివర్తన చోటు చేసుకుంటుంది.

పువ్వుకు రంగును నీటికి రుచిని
నిప్పుకు కాంతిని ఇచ్చిన దేవుడు
అన్నిట తననే చూడమని
సర్వము తానుగా మారాడు
ఎన్నున్నా తానన్నిటిలో
పువ్వులో తావిగా ఉన్నాడు
రామ రామ జయ రాజారామ్
రామ రామ జయ సీతారామ్

అని రామజోగి చిట్కా.

*ఇలాగే మరి కొన్ని ఎలా ఓతప్రోతమో తరువాత శ్లోకంలో చెబుతున్నాడు.*

**పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।**
**జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥** 9

*పుణ్యః-గంధః-పృథివ్యాం-చ-తేజః-చ-అస్మి-విభావసౌ*
*జీవనం-సర్వభూతేషు-తపః-చ-అస్మి-తపస్విషు*





| | | |
|---|---|---|
| పృథివ్యాం | = | భూమి యందు |
| పుణ్యః | = | పవిత్రమైన |
| గంధః చ | = | వాసనయు |
| విభావసౌ | = | అగ్ని యందు |
| తేజః చ | = | తేజస్సును |
| అస్మి | = | నేనే అయి ఉన్నాను |
| సర్వభూతేషు | = | సమస్త భూతముల యందు |
| జీవనం | = | ప్రాణమును |
| తపస్విషు | = | తపస్సు గల వారి యందు |
| తపః చ | = | తపస్సును |
| అస్మి | = | నేనే అయి ఉన్నాను |

**పార్థా! పృథివిలో పరిమళం నేను. అగ్ని యందు తేజస్సు నేనే. సర్వ జీవులలో జీవనము నేను. తాపసులలో తపస్సు నేనే.**

**వ్యాఖ్య**

**పృథివిలో పరిమళం**

పృథివి లోని పవిత్ర పరిమళం పరమేశ్వరుడే (*పృథివ్యాం పుణ్యః గన్ధః*). పృథివికి గంధం సహజ లక్షణం. అందుచేత గంధానికి పుణ్య మనే విశేషణం వాడ బడింది. ఆ నేల దుర్గంధంగా ఉంది అంటే అది పృథివి యొక్క లక్షణం కాదు. పుణ్య గంధమే, సుగంధమే పృథివి లక్షణం. మరో విధమైన వాసన కర్మకృతం.

**పుణ్యః** అంటే **సురభిః** అని అర్థం చెప్పారు భాష్యంలో శ్రీ శంకరులు. **సురభిః** అంటే పరిమళించేది, సుందర మైనది అని అర్థాలు. కనుక పృథివి లోని గంధము సుందర సురభిళము.

*సురభిః - సుష్ఠు రభతే జనానంద మితి సురభిః -* చక్కగా ఆనందాన్ని కలుగ చేసేది *సురభిః* అని అమరకోశము. తొలకరికి భూమి తడిసి నపుడు, పృథివి నుండి వెదజిమ్మబడే మట్టి వాసన ఎవరికైనా మత్తెక్కిస్తుంది. అదే సురభి. పవిత్రమైన సుగంధము. పృథివిలో ఈ విధమైన తియ్యని పరిమళాల రూపంలో ఉన్నది పరమేశ్వరుడే.

పృథివి పృథివిగా ఉండటానికి ఏ పుణ్యగంధం సారమై ఉందో, అట్టి పవిత్ర పరిమళ రూపుడైన పరమాత్మ యందు భూమి ప్రోతము, అంటే ప్రతిష్ఠితమై ఉంది అని అర్థము. పరమేశ్వరునికి అన్యంగా పృథివికి మనుగడ లేదు అని భావం.

**అగ్నిలో తేజము**

అగ్ని యందు తేజము పరమేశ్వరుడే (*విభావసౌ తేజః*). అగ్నికి విభావసు అని పేరు. కాంతి అనే ధనము కలిగిన వాడు కావడం చేత అగ్ని విభావసు అయ్యాడు (*విభా ప్రభైవ వసు ద్రవ్య మస్య విభావసుః*). వేడి వెలుగులు గల అగ్ని లోని వైభవము (*తేజః*) ఈశ్వరునిదే. అగ్నిలో వెలుగే కాదు, వేడి కూడా ఉంది.

చీకటిలో పడి ఉండాలని ఎవ్వరూ అభిలషించరు. వెలుగులో విహరించా లనే భావిస్తారు. వెలుగు ఏదైనా అది పవిత్ర మైనదే. ప్రతాపము కలిగినదే. పరమేశ్వరుని ప్రభావమే. కనుకనే, ***తమసోమా జ్యోతిర్గమయ*** - చీకటి నుండి వెలుగు లోకి నడిపించ మని ప్రార్థిస్తాము. భగవద్దర్శనం కలిగితే, రథోత్సవంలో ఉత్సవమూర్తి కంట బడితే కరములు జోడించి నమస్కరిస్తాము. తేజము పరమేశ్వరుని స్వరూపము కనుకనే, మన సంప్రదాయంలో దీపాన్ని వెలిగించ గానే, చేతులు జోడించి ***దీప జ్యోతిర్నమోస్తుతే*** అని నమస్కరిస్తాము.

ఏ వేడి, వెలుతురు ఉండటం చేత, ఏ తేజము ప్రకాశించడం చేత అగ్ని అగ్నిగా ఉందో, అట్టి అగ్ని లోని తేజము పరమేశ్వరుడే కావడం చేత అగ్ను లన్నీ పరమేశ్వరుని యందు ప్రోతములు. సూత్రము నందు మణుల లాగా కూర్చబడ్డాయి.

**జీవులలో జీవనము**

జీవులలో జీవనము పరమేశ్వరుడు *(సర్వ భూతేషు జీవనమ్).* సర్వ ప్రాణులలో జీవనంగా, అంటే జీవనాధారంగా పరమేశ్వరుడు ఉన్నాడు అని అర్థము. ఏది ఉండటం చేత ప్రాణులు జీవిస్తున్నారో, ఏది లేనపుడు నిర్జీవమై జీవులు మరణిస్తున్నారో అదే జీవనము.

అన్నం లేకపోతే మనిషి జీవించ లేడు. అన్నం మనిషిని బ్రతికిస్తూ ఉంది. అందుకే అన్నాన్ని అమృతము అంటారు. అమృతము బ్రహ్మ స్వరూపము కనుక ***అన్నం బ్రహ్మేతి వ్యజానాత్*** - అన్నమును బ్రహ్మముగా తెలుసుకో! అన్నది తైత్తిరీయ శ్రుతి. అంతేకాదు, అన్నమును నిందించ కూడదు అని కూడా ఆదేశించింది. ***అన్నం న నిన్ద్యాత్! తద్వ్రతం!*** అన్నమును నిందించ కూడదు. ఇది బ్రహ్మవేత్తకు వ్రతము అన్నది.

అలాగే జలపానం లేకపోతే జీవనం మిగలదు. అన్నపానాదుల లాగా ప్రాణం లేకపోయినా జీవనం కొనసాగదు. అన్నపాన ప్రాణాదుల వల్లే జీవనం కొనసాగుతూ ఉంది కనుక, అన్న రసాత్మకు డైన పరమేశ్వరుడే జల ప్రాణాదుల యందు కూడా రసరూపుడై ఉన్నందున, జీవుల జీవనము సాగుతూ ఉంది. జీవనము అనేది కేవలం అన్నం కాదని, నీళ్ళు కాదని, గాలి కాదని కూడా ఈ సందర్భంలో సూక్ష్మంగా అర్థం చేసుకోవాలి.

అన్నం తింటున్నా జీవులు మరణిస్తున్నారు. నీళ్ళు త్రాగుతున్నా జీవులు గతిస్తున్నారు. బ్రతుకుతా డేమో నని జీవితాంతం పానం చేసిన నీళ్ళలో తులసిని కలిపి మరీ త్రాగిస్తున్నారు. అయినా జీవులు తమ దారిన పడి తాము పోతున్నారు.

అన్నంతో జీవనం కొన సాగదు. అన్నం లోని సారంతో జీవనం సాగుతుంది. నీళ్ళతో, గాలితో కాదు మనిషి బ్రతికేది. నీళ్ళ లోని సారంతో, గాలి లోని సారంతో బ్రతుకుతాడు. ఆ సారం ఏదో అది రస రూపుడైన భగవంతుడే గాని మరొకరు కారు. ఇలా జీవనాధారాలుగా తెలుస్తున్న వాటిలో సారభూతుడై నిజ జీవనంగా శోభిస్తున్న ఈశ్వరుడు ఉండటం చేతనే జీవులు జీవిస్తూ ఉన్నందున, జీవు లందరూ పరమేశ్వరునిలో కూర్చబడి ఉన్నారు. జీవు లందరూ భగవంతునిలో ప్రోతములే.

***త్వం సత్యం దేవ దేవాత్వం న జడో న మృతోఽపి వా ।***
***జగతాం జీవితం చ త్వం ప్రాణినామ్ జీవితం తథా ॥***

భగవాన్! నీవే సత్యము. దేవదేవుడవు. జడ మృత్యువులు కాని వాడవు. జగత్తుకు జీవము నీవే. ప్రాణులకు జీవితము కూడా నీవే.

**తాపసులలో తపస్సు**

తపస్సు చేసే మునిపుంగవులలో నేను తపస్సు అంటున్నాడు భగవంతుడు *(తపస్విషు తపః అస్మి).* తపింప చేసేది తపస్సు. తపస్సు అనేది సర్వులకు సాధ్య మయ్యేది కాదు. శీతోష్ణాలు, ఆకలిదప్పులు మొదలైన ద్వంద్వాలను సంతోషంగా సహించే సహన సామర్థ్యము తపస్వికి ఉండాలి. అదే తపశ్శక్తి.

తపస్సు అద్భుత మైన శక్తి. అమూల్య మైన ధనం. అందుచేతనే తపోధనులు సర్వులకూ సంపూజ్యులు. అగ్నిలో కాలి బంగారు వన్నె తేరినట్లు, తపోగ్నిలో తప్తులై తాపసులు తేజోవంతు లౌతారు.

ధనం గల వారు ధనవంతులు. బలం కల వారు బలవంతులు. జ్ఞానం కల వారు జ్ఞానవంతులు. గానం కల వారు గాయకులు.

గాయకులలో గానంగా, జ్ఞానులలో జ్ఞానంగా, బలాఢ్యులలో బలంగా, ధనికుల వద్ద ధనంగా ఏ పరమేశ్వర





స్వరూపము విరాజిల్లుతూ ఉందో, అదే స్వరూపము తాపసులలో తపస్సుగా ఉంది. బలం లేని వాడు ఎలా బలవంతుడు కాడో, తపస్సు లేని వారు తాపసులు కారు. కనుక తపస్వి తపస్విగా ఉండటానికి ఏ తపశ్శక్తి ఆధారమో, ఆ తపశ్శక్తి పరమేశ్వరుడే కావడం చేత తపశ్శాలు లందరు పరమేశ్వరుని యందే ప్రోతులు *(తపసి మయి తపస్వినః ప్రోతాః).*

*అందరూ తన పైనే ఆధారపడి ఉన్నందున, అందరూ తన లోనే ఉన్నారు. చదవండి.*

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।**
**బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ ॥** 10

***బీజం-మాం-సర్వభూతానాం-విద్ధి-పార్థ-సనాతనం***
***బుద్ధిః-బుద్ధిమతాం-అస్మి-తేజః-తేజస్వినాం-అహం***

| | | |
|---|---|---|
| పార్థ | = | అర్జునా! |
| సనాతనం | = | నిత్యుడనగు |
| మాం | = | నన్ను |
| సర్వభూతానాం | = | సర్వభూతములకు |
| బీజం | = | మూలముగ |
| విద్ధి | = | తెలుసుకో! |

| | | |
|---|---|---|
| అహం | = | నేను |
| బుద్ధిమతాం | = | బుద్ధిమంతులలో |
| బుద్ధిః | = | బుద్ధి |
| తేజస్వినాం | = | తేజోవంతులలో |
| తేజః | = | తేజము |
| అస్మి | = | అయి ఉన్నాను |

**పార్థా! సర్వ భూతాలకు సనాతన మైన బీజము నేనే. బుద్ధిమంతులలో బుద్ధిని నేనే. తేజశ్శాలులలో తేజస్సును నేనే.**

**వ్యాఖ్య**

**ఆది బీజము**

సర్వ భూతాలకు పురాతన మైన ఆది బీజము పరమేశ్వరుడు *(బీజం సనాతనం).* బీజములకు మొలకెత్తుట అనేది స్వభావము. అలా మొలకెత్తడము అనే స్వభావానికి ఏది కారణమో అది పరమేశ్వరుడు. బీజములు అంకురించడము అనేది అనాదిగా జరుగుతూనే ఉంది. అలా అంకురించడానికి కారణము *(ప్రరోహ కారణం)* కూడా అనాది గానే ఉండాలి. కనుక అట్టి కారణ మైన పరమేశ్వరుడు సనాతనుడు.

ఒక్కొక్క దానికి ఒక్కొక్క బీజము ఉంటుంది. కాని, బీజత్వ ధర్మము అన్నిటిలో ఏదైతే ఉందో అది ఒక్కటే. అదే బీజ ప్రరోహ కారణంగా ఉంది. కనుక అదే ఆదిబీజము. మూల బీజము. సర్వభూతాలు ఆవిర్భవించుటకు మూలస్థానము. మూలస్థానేశ్వర స్థానము.

బీజములు ఆద్యంతములు కలిగి ఉన్నా, బీజాంకుర శక్తి ఆది లేనిదై ఉంది. అంటే, సర్వ బీజాలకు తానే కారణంగా ఉన్న పరమేశ్వరుడు, తనకు మరొక కారణము లేని వాడై ఉన్నాడు. అందుచేత సనాతనుడు. ***న తస్య కశ్చిత్ జనితా*** - సర్వకారణ మైన సర్వేశ్వరునికి మరొకడు కారణముగా లేడు.

బీజాలు అనేకాలు. వృక్ష బీజము, జంతు బీజము, మనుష్య బీజము - ఇలా ఎన్నో బీజా లున్నాయి. ఇవి అంకురించి కార్య రూపాన్ని దాల్చిన తరువాత, ఏయే కారణాల నుండి అవి అంకురించాయో తిరిగి ఆయా బీజాలలో ప్రోత మౌతాయి గాని, పరమేశ్వరునిలో ఎలా కూర్చబడతాయి? అని మరొక సందేహ బీజము అంకురిస్తుంది.

పృథివికి జలము బీజ మైతే, జలానికి అగ్ని, అగ్నికి వాయువు, వాయువుకు ఆకాశము బీజాలుగా

ఉంటాయి. *ఆకాశాద్వాయుః* - వాయువు ఆకాశం నుండి పుట్టింది. తిరిగి ఆకాశంలో కలిసి పోవాలి, పరమేశ్వరుని యందు కాదు అనేది కదా సందేహము! ఆకాశం జడం కదా! జడమైన ఆకాశము వాయు బీజానికి ప్రరోహ కారణం ఎలా అవుతుంది? ఆకాశంలో బీజమును అంకురింప చేసే శక్తి ఏదయితే ఉందో అది పరమేశ్వరుని శక్తి. పంచ సర్వభూతాలు ఆకాశములో విలీన మైతే, *తతః ఆకాశః సంభూతః* - పరమేశ్వరుని నుండే ఆకాశం ఆవిర్భవించడం చేత పరమేశ్వరుడే ఆదిబీజము. అతడే బీజ ప్రరోహ కారణం. ఈ విధంగా సమస్త బీజాలకు బీజాంకుర శక్తి పరమాత్మ అయినందున సర్వభూతాలు పరమేశ్వరుని యందు ప్రోతములు.

**వివేక బుద్ధి**

బుద్ధిమంతులలో వివేక బుద్ధి భగవంతుడు. బుద్ధి అందరికీ ఉంటుంది. బుద్ధి ఉన్న వాళ్ళందరు బుద్ధిమంతులు కారు. ఎవరి బుద్ధిలో వివేకం ఉంటుందో అట్టి వివేక శక్తిమంతులు బుద్ధిమంతులు *(బుద్ధిమతాం వివేక శక్తిమతామ్).*

బుద్ధి శబ్దము ఇక్కడ వివేక వాచకము కనుక, వివేక శక్తి ఏ బుద్ధిమంతులలో ఉందో, అట్టి వివేక శక్తి గల బుద్ధి పరమేశ్వరుడే. వివేకులలో వివేక సామర్థ్యం పరమేశ్వరుడే కనుక వివేకము గల వారందరు పరమేశ్వరుని యందే ప్రోతములు.

**బ్రహ్మ తేజము**

తేజస్సు అంటే ప్రకాశము. ఎవరిలో తేజము ఉన్నా, అది వాస్తవానికి పరమేశ్వర తేజమే. జ్యోతులలో జ్యోతి తాను. ఎనిమిదవ శ్లోకములో మనం చూచినట్లు, శశిసూర్యుల లోని తేజము తానే. జ్ఞానుల లోని బ్రహ్మజ్ఞాన తేజము తనదే. సర్వ తేజములకు కారణభూత మైన తేజస్సు తనదే అయినందున, తేజోమయము లైన వన్నీ పరమేశ్వరుని యందే కూర్చబడి ఉన్నాయి *(అహం తేజస్వినాం తేజః).*

*ముళ్ళు తీసిన తరువాత గులాబీలను పూజా సుమాలుగా సమర్పిస్తాము. కామాదులు కూడా అలాగే ప్రోతములు. చెబుతున్నాడు.*

**బలం బలవతాం చాహం కామ రాగ వివర్జితమ్ ।**
**ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥** 11

*బలం-బలవతాం-చ-అహం-కామరాగ వివర్జితం*
*ధర్మావిరుద్ధః-భూతేషు-కామః-అస్మి-భరతర్షభ*

| | | | |
|---|---|---|---|
| భరతర్షభ | = అర్జునా! | అస్మి | = అయి ఉన్నాను |
| అహం | = నేను | భూతేషు చ | = ప్రాణుల యందు |
| బలవతాం | = బలవంతుల యొక్క | ధర్మావిరుద్ధః | = ధర్మమునకు విరుద్ధము గాని |
| కామరాగ వివర్జితం | = ఆశ, రాగము లేని | కామః | = కామము |
| బలం | = బలమును | అస్మి | = అయి ఉన్నాను |

**బలవంతులలో కామరాగాలు లేని బలం నేను. సర్వభూతాలలో ధర్మానికి విరుద్ధం కాని కామము నేనే.**

**వ్యాఖ్య**

భగవంతుడు ఎక్కడున్నాడు అని కొందరు, భగవంతుని ఎక్కడ దర్శించాలి అని కొందరు, భగవంతుని ఎలా పొందాలి అని కొందరు - ఇలా భక్తులు ఆవేదన చెందుతూ కనిపిస్తారు. ఎక్కడ ఏ వస్తువు ఉన్నా, అది





అలా ఉండటానికి కారణ మైన వాడు పరమేశ్వరుడే అనే భావన మనస్సులో స్థిరపడితే, అంతట, అన్నిటిలో సదా పరమేశ్వర దర్శనమే అవుతుంది అనే సత్యమును ఇంతవరకు జరిగిన విశ్లేషణలో మనం చూశాం. ఇప్పుడు మరి కొన్ని చెబుతున్నాడు.

**బలహీనత లేని బలము**

బలం లేని వాడు బలహీనుడు అని మనకు తెలుసు. కాని బలంలో బలహీనతలు చోటు చేసుకున్న వాడు కూడా బలహీనుడే అనేది ప్రస్తుతం మనకు అర్థం కావాలి. ఏనుగు బలం గల ప్రాణి. అనేక విధాలుగా ఉపయోగ పడుతుంది. కాని, మదం పట్టిందంటే, ఆ తరువాత అది ఎంత వినాశాన్ని సృష్టిస్తుందో మనం ఊహించ లేము. అదే బలంలో బలహీనత.

బలం ఏదైనా బలమే. బలము ఎప్పుడైనా ఉపయోగ పడేదే. కాని, బలంలో బలహీనతలు చేరినపుడే విషం కలిసిన పాల లాగా బలం కూడా పాడు పనులు చేసి పాడై పోతుంది. బలాన్నిచ్చే క్షీరం లాగా బలం పవిత్ర మైంది. బలహీనతలు పాలలో విషం లాంటివి. బ్రతుకును బుగ్గిపాలు చేస్తాయి. ఏమిటా బలహీనతలు?

కామము, రాగము అనేవే బలహీనతలు. అవి చేరినపుడే బలం బలహీన పడుతుంది. వాటిని దూరం చేస్తే, బలం బలవత్తర మవుతుంది. భగవంతుని స్వరూపం అవుతుంది. అందుచేత కామరాగ వివర్జిత మైన బలం తానే అంటున్నాడు భగవంతుడు *(బలవతాం కామరాగ వివర్జితం బలం అహమస్మి).*

వస్తువుల విషయంలో ప్రాప్తాప్రాప్తములు ఉంటాయి. కొన్ని ప్రయత్నించి పొందలేక పోతాము. కొన్నిటిని ప్రయత్నం చేత సాధించుకుంటాము. ఇలా ప్రాప్తాప్రాప్త విషయాల యందు కామరాగాలు తలెత్తుతాయి. వీటి విషయంలో శ్రీ శంకరులు తమ భాష్యంలో స్పష్టతను అందించారు.

మనకు లభించని, సమీపంగా లేని విషయాల మీద కోరిక కామం అన్నారు *(కామః తృష్ణా అసంనికృష్టేషు విషయేషు).* మనకు ప్రాప్తించని విషయాల నన్నిటినీ మనం ఆశించము. మనకు దూరంగా ఉన్న వన్నీ దగ్గర కావాలి అని అభిలషించము. వేటి మీద మనకు ఆసక్తి ఉంటుందో అవి అప్రాప్తంగా, దూరంగా ఉన్నప్పుడు, అవి దగ్గర కావాలని, మనకు ప్రాప్తించాలని కోరుకుంటాము. ఇదే కామము.

లభించిన విషయాల మీద మమకారము రాగము. అనురాగము *(రాగః రంజనా ప్రాప్తేషు విషయేషు).* మనకు లభించిన అన్నిటి మీద మనకు రాగం ఉండదు. మనకు ఆసక్తి ఉండి, అలాంటివి ప్రాప్తించి నపుడు, వాటి యందు వినలేని మక్కువ ఉంటుంది. అదే రాగము.

లేని దానిని పొందాలని ఆశించే కోరిక కామం. ఆశించి పొందిన దానిపై మమకారాన్ని కలిగి ఉండటం రాగం. ఈ కామరాగాలు లేకుండా ఉండే బలం ఏదో అది తానే అంటున్నాడు భగవంతుడు.

అర్జునుడు బలవంతుడు. బలహీనతలు లేని బలం అతనిది. కామరాగాలకు చోటివ్వని బలం. అందుచేత అది ఈశ్వర బలం. కనుకనే, పాండవులలో తాను అర్జును డని పరమేశ్వరుడే స్వయంగా చెప్పుకున్నాడు.

అర్జునుడు ఎలా బలవంతుడో, అలాగే దుర్యోధనుడు కూడా బలవంతుడే. రావణాసురుడు కూడా బలవంతుడే. కాని వాళ్ళది ఈశ్వర బలం కాదు. రాక్షస బలం. అదే వారి బలం లోని బలహీనత. కామరాగాలు చోటు చేసుకోవడం వల్ల వారు సుఖించలేక పోయారు. పరులను హింసించడం మానలేక పోయారు.

వ్యక్తి సుఖానికి, సమాజ హితానికి కామరాగాలు లేని బలమే ఉపకరిస్తుంది. కామరాగాలు లేని బలం పరమేశ్వరుని స్వరూపం. కనుక బలవంతులలో కామరాగ వివర్జిత మైన బలం ఈశ్వర బలం కావడం చేత, అట్టి కామరాగ వివర్జిత మైన బలమును కలిగిన బలవంతులు భగవంతునిలో ప్రోతములు.

## అధర్మం గాని కామము

కామము నిరసించ దగిందే గాని లభిలషించ దగింది కాదు అని మనం భావిస్తూ ఉంటాము. కాని, కామము కూడా నానే అంటున్నాడు భగవంతుడు. కాకపోతే, అది ఎలాంటి కామమో స్పష్టం చేశాడు. ధర్మానికి విరుద్ధం కాని కామము తన స్వరూపమే అంటున్నాడు ***(ధర్మ అవిరుద్ధః కామః అహమస్మి).***

కామము అనేది కోరిక. కోరే శక్తి ఉన్నవాడే కోరుతాడు. ఈ కోరే శక్తినే ఇచ్ఛాశక్తి అంటారు. మనిషి దేనిని ఇష్ట పడతాడో దానినే కోరుకుంటాడు. ఇష్ట వస్తువుకు సంబంధించిన జ్ఞానం ఉన్నప్పుడే ఇష్టపడటం జరుగుతుంది. ఇదే జ్ఞానశక్తి. మనిషికి ఇచ్ఛాశక్తిని, జ్ఞానశక్తిని పరమేశ్వరుడే ప్రసాదించాడు.

కోరుకోవడం తప్పు కాదు. కాని, దేనిని కోరాలో దానికి సంబంధించిన జ్ఞానం విషయంలో స్పష్టత ఉండాలి. ***కామమయ ఏవ అయం పురుషః*** - మనిషి కామమయుడు గానే ఉంటాడు అన్నది వేదం. కోరిక ఉండటం తప్పు కాదు. కోరడమూ దోషం కాదు. కాని, ఆ కోరిక ధర్మానికి విరుద్ధ మైంది కాకూడదు. ధర్మానికి అవిరుద్ధంగా ఉండాలి. మతి చెప్పినట్లు కాకుండా శ్రుతి చెప్పినట్లు ప్రవర్తించాలి. అదే ధర్మ అవిరుద్ధ కామం ***(ధర్మేణ శాస్త్రార్థేన అవిరుద్ధః).***

చేసే ఆలోచనలలో గాని, పలికే మాటలలో గాని, ఆచరించే కర్మలలో గాని ఎక్కడా అధర్మం చోటు చేసుకోకుండా కోరికల్ని కదిలించాలి. అలాంటి కోరిక ధర్మబద్ధమై ఉంటుంది. ధర్మరూపంలో ఉన్నది దైవమే కనుక, ధర్మబద్ధ మైన కామము ఈశ్వరుడే. ధర్మానికి విరుద్ధం కాని కామము పరమేశ్వరుడే అయినందున, అట్టి అధర్మ రహిత కామమును కలిగిన జీవు లందరూ ఈశ్వరుని యందు ప్రోతములే.

***మత్తః పరతరం నాస్తి*** - అంటూ ఏడవ శ్లోకంలో వినిపించిన ప్రతిజ్ఞను అనుభవానికి అందించే ప్రయత్నంలో భాగంగా, సమస్తములో పరమేశ్వరుడు ఎలా ఉన్నాడో తెలియ చేస్తూ, పరమేశ్వర దర్శనం ఎక్కడైనా సాధ్యమే అనే సత్యాన్ని అనేకము లైన విశిష్ట వస్తువులలో, వినీతు లైన వ్యక్తులలో దర్శింప చేసిన దయామయుడు, ఈ విభూతిమయ ప్రకరణాన్ని ఇక సమాప్తం చేయబోతున్నాడు.

*తన నుండి ఆవిర్భవించిన వన్నీ తన యందే ఉన్నా, తాను విలక్షణంగా ఎలా విరాజిల్లు తున్నాడో చెబుతున్నాడు.*

**యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే ।**
**మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి ॥** 12

***యే-చ-ఏవ-సాత్త్వికాః-భావాః-రాజసాః-తామసాః-చ-యే***
***మత్తః-ఏవ-ఇతి-తాన్-విద్ధి-న-తు-అహం-తేషు-తే-మయి***

| | | | |
|---|---|---|---|
| సాత్త్వికాః | = సాత్త్వికమైన | మత్తః ఏవ ఇతి | = నా వలననే అని |
| భావాః | = భావములు | విద్ధి | = తెలుసుకో! |
| యే చ | = ఏవియో | తేషు | = ఆ భావముల యందు |
| రాజసాః చ | = రజోగుణ సంబంధము లైనవి | అహం తు | = నేను |
| యే | = ఏవియో | న | = లేను |
| తామసాః చ ఏవ | = తామసిక మైనవి | తే | = అవి |
| యే | = ఏవియో | మయి | = నా యందు (ఉన్నవి) |
| తాన్ | = వానిని | | |





**అర్జునా! సత్త్వ గుణం నుండి పుట్టినా, రజో గుణము నుండి కలిగినా, తమోగుణము నుండి జనించినా - అవన్నీ నా నుండే పుట్టాయి అనేది అర్థం చేసుకో! అవి నా లోనే ఉన్నాయి. నే నైతే వాటిలో లేను.**

**వ్యాఖ్య**

అంతా పరమేశ్వరుని స్వరూపమే అయి నపుడు ఏయే వస్తువులు ఉన్నాయో, ఏయే భావాలు ఉన్నాయో, ఏయే భూతాలు ఉన్నాయో అవన్నీ పరమాత్మ కన్నా అన్యంగా లేవు కనుక పరమాత్మ స్వరూపాలే.

పరమేశ్వరుని ద్వివిధ ప్రకృతులను గూర్చి విశ్లేషించుకొని ఉన్నాం కదా! పరాపరము లని, స్వరూప స్వభావాలని చెప్పుకున్న ప్రకృతి ద్వయంలో, ఈ ప్రపంచ మంతా అపరా ప్రకృతి చేతనే కలిగింది కనుక పరమేశ్వరుని కన్నా వేరుగా ప్రపంచం ఉండ లేదు.

అన్నిటిలో పరమాత్మ ఉండినా, ఉపాసనార్థం వాటిలో కొన్నిటిని తీసుకొని, వాటిలో పరమేశ్వరుడు ఎలా ఉన్నాడో, అలాగే అవి ఎలా పరమేశ్వరుని యందు ప్రోతమై ఉన్నవో తెలుసుకున్నాం. ఇక్కడ ఒక సంశయం వస్తుంది. జ్ఞానయుతము లైన వ్యక్తులు, విషయాలు, వస్తువులు మాత్రమే ఈశ్వరాత్మకంగా ఉన్నాయా? తక్కినవి ఈశ్వర స్వరూపాలు కావా? అదే వాస్తవ మైతే పరమేశ్వరుని అనంత స్వరూపానికి భంగం వాటిల్లదా? ఈ శంకను పరిహరిస్తూ ప్రస్తుత శ్లోకం చెప్పబడుతూ ఉంది.

## ఆది దేవుడే

ఆదిలో ఉన్నది దేవు డొక్కడే ***(ఏకం సత్).*** అందరికీ, అన్నిటికీ ఆది కూడా ఆదిదేవుడే. అందరికీ పుట్టుక అక్కడే. అన్నీ అక్కడ నుండే పుట్టాయి. ప్రపంచం అక్కడ నుండే ఆవిర్భవించింది.

ప్రపంచంలో గుణా లున్నాయి. అలాగే దోషా లున్నాయి. వీటన్నిటికీ త్రిగుణాలే కారణంగా ఉన్నాయి. అవే సత్త్వ రజ స్తమోగుణాలు. ప్రపంచం త్రిగుణ మిళితంగా ఉంది. మరి ఈ త్రిగుణాలు ఎక్కడ నుండి వచ్చాయి? ఆదిలో ఏదుందో దాని నుండే రావాలి. ఆదిలో ఉన్నది ఆదిదేవుడే కనుక త్రిగుణాలు కూడా అక్కడ నుండే వచ్చాయి.

శమ దమాదు లనేవి సాత్త్విక సాధనలు. అవి సాత్త్విక భావాలు. సాధువు, గోవు, పాలు ఇవన్నీ సాత్త్విక రూపాలే. హర్ష దర్పాదులు, అభిమాన అహంకారాలు గల వ్యక్తులు, మిరియాలు, మిరపకాయలు రాజసములే. క్రూరులు, క్రూరమృగాలు, గంజాయి మొదలైనవి తామసాలే. ఇలా తాత్పర్య బోధిని వ్యాఖ్యానించింది. ఇవన్నీ విపులంగా, విస్తారంగా మున్ముందు మనం చూడబోతాం. ప్రధానంగా గుణత్రయం మీద ఒక అధ్యాయమే ఉంది కదా! ఇక్కడ ప్రస్తుత ప్రసంగ సారాంశ మేమిటంటే, సాత్త్వికా లైనా, రాజసా లైనా, తామసా లైనా ఏయే భావాలైతే పుట్టినవో, పుడుతున్నవో, పుట్టబోతున్నవో అవన్నీ కూడా పరమేశ్వరు డనే ఒక్క కారణం నుండి రావలసిందే గాని మరో విధంగా వచ్చే అవకాశం లేదు. ఇక్కడ ***భావాః*** - భావములు అంటే, వ్యక్తులు గాను గ్రహించ వచ్చు. విషయాలు గాను స్వీకరించ వచ్చు.

***సత్త్వాత్ ఆగతాః సాత్త్వికాః భావాః*** - సత్త్వగుణము వలన జనించినవి సాత్త్విక భావాలు. ***రజస ఇమే రాజసాః*** - రజోగుణము వలన పుట్టినవి రాజసాలు. ***తమస ఇమే తామసాః*** - తమోగుణము వలన పుట్టినవి తామసాలు. ఈ మూడు పరమేశ్వరుని స్వభావ ప్రకృతి నుండి పుట్టినవే కనుక, వీటికి ఉత్పత్తి స్థానము పరమేశ్వరుడే.

సత్త్వగుణ ప్రధాన మైన వారు దేవతలు. రజోగుణ ప్రధానంగా పుట్టేవారు రాక్షసులు. తమోగుణ ప్రధానంగా జంతువులు కలిగితే, సత్త్వ రజ స్తమోగుణ మిశ్రితంగా మానవులు జన్మిస్తారు అని కూడా నిర్వచిస్తారు.

ఏది ఏమైనా, గుణాలు ప్రకృతి సంబంధం కావటం చేత, పరమేశ్వరుని పరా ప్రకృతి, లేదా స్వభావ ప్రకృతి పరమేశ్వరుని వల్లా ఇతరంగా ఉండే అవకాశం లేకపోవటం చేత, గుణాలు కూడా పరమేశ్వరుని నుండే ఉన్నాయి పరమాత్మ నుండి పుట్టిన గుణాలు పరమాత్మ నుండే ఉన్నాయి (**మత్తః ఏవ ... తే మయి**). గుణాలు పరమాత్మ నుండే ఉన్నాయి. కాని, పరమాత్మ గుణాలలో లేదు (**అహం తు తేషు న**). గుణాలు పరమేశ్వరుని నుండి పుట్టి పరమేశ్వరుని లోనే ఉన్నా, పరమేశ్వరుడు మాత్రము గుణాలలో లేడు అనేది లక్ష్యం కావటం ఉంది.

**తనలో ఉన్నాయి - వాటిలో తాను లేడు**

ఏడవదైన శ్లోకం నుండి ఉన్నదంతా పరమాత్మ ఎలా శోభిస్తున్నాడో తెలుసుకుంటూ వచ్చాం. ఇప్పుడి కొచ్చే సరికి ఒక్కసారిగా విషయం తారుమారైంది. అన్నీ పరమాత్మ నుండే పుట్టి, పరమాత్మ లోనే ఉండే టప్పుడు, పరమాత్మ వాటిలో లేడు అని చెప్పడంలో వైరుధ్యం ఏర్పడినట్లే కదా! కాదు. ఇక్కడ వైరుధ్యమే లేదు.

***మత్తః పరతరం నాస్తి*** - అనే ప్రతిజ్ఞలో ఉన్నది చైతన్యమే అని స్పష్ట మౌతూ ఉంది కదా! దాని కన్నా వేరుగా ఏదైతే తెలియ బడుతూ ఉందో, అదంతా విశేషంగా గోచరించే వికారమే కదా! విశేష మేదైనా సామాన్యంలో ఉండక తప్పదు. అలాగని సామాన్యం విశేషంలో ఎలా ఉంటుంది?

ఉన్నది రజ్జువు. రజ్జువులో సర్పాన్ని చూచి నపుడు, సర్పము విశేషముగా తెలుస్తూ ఉంటే, రజ్జువు సామాన్యంగా ఉంది. సర్పము రజ్జువు కన్నా అన్యంగా ఎలా ఉంటుంది? సర్పము ఎక్కడ నుండి ఆవిర్భవించింది? రజ్జువు నుండి ఆవిర్భవించింది. సర్పము ఎక్కడుంది? రజ్జువు లోనే ఉంది. మరి రజ్జువు సర్పంలో ఉందా? లేదు. ఎందుకని? అదే విశేష మంటే. విశేషంలో సామాన్యం ఉండదు.

కుండ మట్టే. కాని, మట్టి కుండ కాదు. గుణాలు పరమేశ్వరుడే. కాని, పరమేశ్వరుడు గుణాలు కాదు. కెరటాలు కడలిలో ఉంటాయి. అలాగని కడలి కెరటంలో ఇమడ లేదు. ప్రపంచం పరమాత్మ లోనే ఉంది. ప్రపంచానికి ఆధారమైన పరమాత్మ ప్రపంచానికి విలక్షణంగా ఉన్నాడు. ఆధేయానికి ఆధారం ఉండాలి. ఆధేయం లేకపోయినా ఆధారం ఉంటుంది.

మేఘా లన్నీ ఆకాశం లోనే ఉంటాయి. మేఘాలు లేకపోయినా ఆకాశం ఉంటుంది. అంతేకాదు, మేఘ లక్షణాలు ఆకాశంలో లేవు. మేఘంలో ఏదుందో అది ఆకాశంలో లేదు. ప్రపంచంలో ఉన్న గుణ దోషాలు పరమేశ్వరునిలో లేవు.

ప్రపంచం తన అధీనంలో ఉంది. స్వవశమై ఉంది. తాను పరవశం కాడు. కనుక, పరమాత్మను పొందితే సమస్తాన్ని పొందినట్లే.

తండ్రి నుండి పుట్టిన కుమారుడికి తండ్రి వశమై ఉన్నట్లు, పరమేశ్వరుని నుండి పుట్టిన గుణాలకు పరమేశ్వరుడు వశపడి ఉన్నాడని భావించడం సరి కాదు. జ్ఞాన స్వరూపుడైన పరమేశ్వరుని కన్నా అన్యంగా జ్ఞేయ మనేది స్వతంత్రంగా లేదు. అన్యంగా ఏది తెలిసినా అది వికారమే. విశేషమే. ఆధేయమే. మిథ్యామాత్రమే. మాయా రూపమే. ఇవేవి వాస్తవాలు కావు. కనుక వాస్తవ మైనది విశేషంలో ఇమడదు.

అర్జునా! అందుకే చెబుతున్నా. నా నుండి జనించినవి సాత్త్వికాలైనా, రాజసాలైనా, తామసాలైనా నా కన్నా అన్యంగా లేవు. అన్నీ నా లోనే ఉన్నాయి. కాని నేను వాటిలో లేను. అవి నా అధీనంలో ఉన్నాయి.





నా వశమై ఉన్నాయి. నేను సంసారుల లాగా వాటి అధీనంలో లేను. వాటికి వశపడి లేను (***న తు అహం తేషు తదధీనః, త ద్వశః, యథా సంసారిణః, తే పునః మయి, మద్వశాః మదధీనాః***).

పరమేశ్వరుని స్వరూపము ఇలా దివ్యంగా వెల్లొందుతున్నా, లోకం కళ్ళు మూసుకొని ఉంది అంటూ, దానికి కారణ మేమిటో కూడా చెబుతున్నాడు.

**త్రిభి ర్గుణమయై ర్భావై రేభిః సర్వ మిదం జగత్ ।**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పర మవ్యయమ్ ॥** 13

**త్రిభిః-గుణమయైః-భావైః-ఏభిః-సర్వం-ఇదం-జగత్**
**మోహితం-న-అభిజానాతి-మాం-ఏభ్యః-పరం-అవ్యయం**

| | | | |
|---|---|---|---|
| త్రిభిః | = మూడు విధములైన | మోహితం | = మోహింపజేయ బడినదియై |
| గుణమయైః | = గుణ వికారములైన | ఏభ్యః | = ఈ త్రిగుణముల కంటెను |
| ఏభిః | = ఈ | పరం | = విలక్షణుడను |
| భావైః | = భావముల చేత | అవ్యయం | = అవినాశియైన |
| సర్వం | = సమస్తమైన | మాం | = నన్ను |
| ఇదం | = ఈ | న అభిజానాతి | = తెలుసుకోలేక పోతున్నది |
| జగత్ | = ప్రపంచము | | |

**అర్జునా! ఈ ప్రపంచ మంతా మూడు గుణాల వికారాల చేత మోహానికి గురైంది. నేను గుణాలకు అతీతుణ్ణి. ఏ వికారాలు లేని వాణ్ణి. నన్ను తెలుసుకోలేక పోతోంది ఈ ప్రపంచము!**

**వ్యాఖ్య**

మారేవే మహిలో ఉన్నాయి. మాసి పోయేవే మనస్సులలో చేరి పోయాయి. మార్పులే మనుగడను శాసిస్తున్నాయి. ఛాయలే మార్గ నిర్దేశం చేస్తున్నాయి. ఇక్కట్లను తీర్చే ప్రయత్నంలో చీకట్లు భ్రమిస్తున్నాయి.

ఏది ఎందుకు జరుగుతూ ఉందో అర్థం కాదు. ఏది ఎందుకు జరగడం లేదో తెలిసి రాదు. కలలో కూడా ఊహించ లేనివి ఇలలో అలా అలా జరిగి పోతున్నాయి. ఉర్విలో ఏది చూచినా, ఎవరిని చూచినా, ఎక్కడ చూచినా ఊసరవెల్లి విన్యాసాలే. ఉన్న వన్నీ వికారాలే. గుణాల వికారాలే. అవే ప్రపంచంలో ఆకారాలు.

మన దేహంతో పాటు మనం వసించే ఈ ప్రపంచంతో సహా గుణాల వికారాలే గాఢంగా పెనవేసుకొని ఉన్నాయి. మనస్సులో భావాలన్నీ గుణాల సంతానమే. మహిలో కార్యా లన్నీ గుణ మాయలే.

అర్జునా! ఈ మూడు విధాలైన (***ఏభిః త్రిభిః***) గుణ వికారాలైన (***గుణమయైః***) విషయాల చేత (***భావైః***) ఈ ప్రపంచము సమస్తము మోహానికి గురైంది (***ఇదం జగత్ సర్వమ్ మోహితం***).

**మాయ లోనే అందరూ**

భగవంతుడు అందరికీ కావాలి. అందరూ భగవంతుణ్ణి కోరుకునే వారే గాని, ఎవరూ భగవంతు డేమిటో అర్థం చేసుకోరు. అర్థం కాని దానిని ఎలా పొందుతారు?

కొందరు అర్థం చేసుకున్నట్లే కనిపిస్తారు. కొందరు అర్థం చేసుకుంటూ ఉన్నట్లు అగుపిస్తారు. వీళ్ళంతా ఏమి అర్థం చేసుకున్నారో తెలుసుకుందా మని ప్రశ్నిస్తే, వాళ్ళు చెప్పే సమాధానాలు వాళ్ళకు భగవంతుడు ఏమి అర్థం కాలేదని ఇట్టే తేల్చేస్తాయి.

'భగవాన్! ఎందుకిలా చేశావు? నన్నెందు కిలా పుట్టించావు? ఇది ఎందు కిచ్చావు? అది ఎందు కివ్వలేదు? నీకు నా మీద దయ లేకుండా పోయింది - ఇలాంటి మాటలు పలికే వారికి పరమేశ్వరుడు అర్థ మయ్యాడని ఎలా అనుకోవాలి? ఈ మాటలు పలికే మనస్సులకు మహిమ అర్థం కానే లేదు. ఎందుకని? మనస్సులు కూడా ప్రపంచం లోనివే కాబట్టి. మనస్సులో ఉన్నవి కూడా గుణ వికారాలే కనుక వాటికి గుణభావాలు, గుణ కార్యాలు అర్థ మౌతాయే గాని గుణాలకు ఆధారమై, గుణాతీతుడుగా శోభిస్తున్న పరమేశ్వరుడు అర్థం కానే కాడు.

అర్థమైతే జ్ఞానం. అర్థం కాకపోతే అజ్ఞానం. జగత్తు అంతా ఇలా అర్థం చేసుకోలేని స్థితి లోనే ఉంది. జగత్తు లోని ఈ అజ్ఞానానికి కారణ మేమిటి? *(తచ్చ కిం నిమిత్తం జగతః అజ్ఞానం ఇతి).* త్రిగుణాల వికారా లైన విషయాల చేత జగత్తు మోహింప బడటమే కారణం అంటున్నాడు భగవంతుడు.

**అంతా మోహ జాలమే**

ఏవి గుణ వికారాలు? రాగద్వేష మోహాలే గుణ వికారాలు. ఏది ఉంటే మనస్సు సుఖ పడుతుందో, తృప్తి చెందుతుందో అది ఇష్ట వస్తువు. ఇష్ట వస్తువును పొందాలి అనే ఆసక్తియే రాగము. ఏది ఉంటే మనస్సుకు అసౌకర్యంగా ఉంటుందో, అది అనిష్ట వస్తువు. అనిష్ట వస్తువు సమీపంలో ఉండ కూడదు అనేదే ద్వేషము. ఇవే రాగద్వేషాలు. ఇవే మోహ జనితాలు.

రాగం ఉండటం తప్పా? ద్వేషం ఉండటం దోషమా? ఏమో! శ్రుతి తప్పని రాగంలో దోషం లేదు. దారి తప్పక పోతే ద్వేషం కూడా తప్పు కాదేమో! శ్రేయస్సుపై ఉండ వలసిన రాగం ప్రేయస్సు వైపుకు మరలితే, శ్రుతి తప్పినట్లే. ప్రేయస్సుపై ఉండ వలసిన ద్వేషం శ్రేయస్సును ముట్టడిస్తే దోషం తలెత్తినట్లే. మరి ఇలా ఎందుకు జరుగుతోంది? మోహం వల్ల జరుగుతుంది. ఏమిటి ఆ మోహము? ఒకటి మరొకటిగా గోచరించడమే మోహము. ఈ మోహానికి కారణ మేమిటి? అవివేకము. అజ్ఞానము. వివేకము లోపించడమే అవివేకము. జ్ఞానం లేకపోవడమే అజ్ఞానము. ప్రేయస్సు శ్రేయస్సుగా, శ్రేయస్సు ప్రేయస్సుగా కనిపించడం చేత వరించ వలసిన దానిని హరించడము, నివారించ వలసిన దానిని నిలుపుకోవడం జరుగుతూ ఉంది. గుణ వికారాలకు సంబంధించిన ప్రపంచంపై ఆసక్తిని కలిగి ఉండటము, గుణాతీతు డైన పరమేశ్వరుని యందు నిరాసక్తంగా ఉండటము జరుగుతూ ఉంది. ఇదే మోహ ప్రభావము. యావత్ప్రపంచము ఈ మోహ ప్రవాహం లోనే కొట్టుకు పోతోంది *(సర్వం ఇదం ప్రాణిజాతం జగత్ మోహితమ్).*

భావంలో లేని దానిని బాహ్యంలో చూడటం సాధ్య పడదు. భావంలో ఒకటి పెట్టుకొని, బాహ్యంలో వేరొకటి చూడటం సాధ్య మయ్యే పని కాదు. మంచి భావాలు గల వ్యక్తి చెడు కార్యాలు చేయలేడు. చెడు భావాలను బుద్ధిలో నింపుకొని, బాహ్యంలో మంచి చేయడం కూడా శక్యం కాదు. బుద్ధిలో మోహం రాజ్య మేలే టప్పుడు బాహ్యంలో పరమేశ్వరుని దర్శించడం దుస్సాధ్యము. గుణ వికారాలలో విలీన మయ్యే బుద్ధి అవ్యయ రూపుడు, నిత్యుడైన పరమేశ్వరుని గుర్తించ లేదు అంటున్నాడు భగవంతుడు *(పరమమ్ అవ్యయం మాం న అభిజానాతి).* సంసార దోష మనే బీజాన్ని దగ్ధం చేయడానికి కారణ మైన పరమేశ్వరుని గుర్తించలేక పోతోంది అని సర్వ మానవాళిపై భగవంతుడు జాలి పడుతున్నాడు *(అనుక్రోశం దర్శయతి).* పరమాత్మ జాలిగుండెను మన ముందు ఆవిష్కరిస్తూ ***అనుక్రోశం*** అన్నారు భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి. ***అనుక్రోశం*** అంటే, కరుణ, జాలి, దయ, సానుభూతి అని అర్థాలు.





**ఆఖ్యాయిక**

బ్యాంక్ లావాదేవిలో ఒక వ్యక్తి బ్యాంక్ మేనేజర్‌ని కలిశాడు. ఆ సమయానికి మేనేజరు ఊపిరాడనట్లు అనేక వ్యవహారాల్లో తల మునకలై ఉన్నాడు. వచ్చిన పెద్ద మనిషి తాను వచ్చిన పనిని మేనేజరు వద్ద ప్రస్తావించాడు.

మేనేజరు ఆ వ్యక్తిని తల ఎత్తైనా చూడకుండా ఏదో వ్రాసుకుంటూనే, 'ఎరిగిన వాళ్ళెవరైనా సాక్షిగా ఉండాలండీ! పైగా, ఆ వ్యక్తికి బ్యాంకులో ఖాతా కూడా ఉండాలి. అలాంటి వారిని ఎవరి నైనా తీసుకు రండి. అప్పుడే మీ పని అవుతుంది' అన్నాడు మేనేజరు.

మేనేజరు సమాధానానికి ఆ వ్యక్తి నిర్ఘాంత పోయాడు. కొన్ని క్షణాలు నోట మాట రాలేదు. ఎలాగో తేరుకొని, 'నాయనా, రమేశ్! నేను మీ తండ్రిని నాయనా!' అన్నాడు అతి కష్టం మీద. 'నాన్నా, మీరా! కూర్చోండి!' అంటూ తప్పు దిద్దుకొనే పనిలో పడ్డాడు మేనేజరు.

ఏమిటి, ఆశ్చర్య పోతున్నారా? ఇలా జరిగే అవకాశం కూడా ఉంటుందా అని సంశయిస్తున్నారా? నిద్ర లేచింది మొదలు అందరు చేసేది అదే కదా! ఇందులో ఆశ్చర్య మేముంది? బ్యాంక్ వ్యవహారాల్లో మునిగి పోయి కన్నతండ్రినే మేనేజరు గుర్తు పట్టలేక పోయాడు. అందరము ప్రాపంచిక విషయాలలో నిమగ్నమై జగత్పితనే అందరమూ గుర్తించలేక పోతున్నాము. మోహం ఇలాగే మోసగిస్తుంది.

**మహిమను చూచే వారెందరు?**

వివేకం లేని కారణంగా జగత్తంతా మోహ జాలంలో చిక్కుకు పోయింది. గుణ పాశాలతో బంధింపబడి ఉంది. వాడిపోయి ఊడిపోయే పువ్వులను చూచే వారే గాని, పువ్వు లన్నిటిని మాలగా కూర్చి పువ్వుల లోనే దాగి యున్న ఆధారమైన, దారాన్ని ఎవరు చూస్తారు? యుక్తాయుక్త వివేకం కోల్పోయిన వారు గుణ వికారాలలో విహరించే వారే గాని, పరమాత్మ మహిమను దర్శించ లేరు.

*ఇంద్రియాభ్యాం అజయ్యాభ్యాం ద్వాభ్యా మేవ హతం జగత్*
*అహో ఉపస్థ జిహ్వాభ్యాం బ్రహ్మాది మశకావధి ॥*

'అజేయము లైన జిహ్వేంద్రియ గుహ్యేంద్రియా లనే ఈ రెండే బ్రహ్మ మొదలు దోమ వరకు సమస్త ప్రపంచాన్ని హతమార్చు తున్నాయి' అన్నది శాస్త్రం.

త్రిగుణాలు మాయాధీనాలు. మాయ బ్రహ్మము నాశ్రయించుకొని ఉంది. బ్రహ్మమును అర్థం చేసుకొని, మాయను దూరం చేసుకోవాలి. విష్ణు మాయను విడిచి విష్ణుదేవుని పట్టుకోవాలి. ఈశ్వరీ మాయను త్యజించి ఈశ్వరుని ఆశ్రయించాలి. అయితే త్రిగుణ మిళిత మైన ఈ మాయను ఎలా దాటాలి? అదే తరువాత శ్లోక విషయం.

*మాయ దైవ సంబంధ మైంది. దాట శక్యము కానిది. దైవాన్ని ఆశ్రయించిన వారే దైవ మాయను దాటుతారు అంటున్నాడు.*

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా । 14
మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే ॥

**దైవీ-హి-ఏషా-గుణమయీ-మమ-మాయా-దురత్యయా**
**మాం-ఏవ-యే-ప్రపద్యంతే-మాయాం-ఏతాం-తరంతి-తే**

| | | |
|---|---|---|
| దైవీ | = | దైవసంబంధ మైనది |
| గుణమయీ | = | త్రిగుణ స్వరూపము అయిన |
| ఏషా | = | ఈ |
| మమ | = | నా యొక్క |
| మాయా | = | ప్రకృతి |
| దురత్యయా హి | = | దాటశక్యము కానిది |
| యే | = | ఎవరు |
| మామ్ ఏవ | = | నన్నే |
| ప్రపద్యంతే | = | శరణు పొందుతారో |
| తే | = | వారు |
| ఏతాం | = | ఈ |
| మాయాం | = | మాయను |
| తరంతి | = | దాటుతారు |

**పార్థా! మాయ దైవ సంబంధ మైంది. గుణాలతో కూడింది. నా మాయను దాటడం కష్టం. ఎవరైతే నన్ను పొందుతారో వాళ్ళే మాయను దాటుతారు.**

**వ్యాఖ్య**

ఏది ఉన్నా ఉన్నదే ఉంటుంది. లేనిది ఉండట మనేది ఉండదు. లేనిది ఉన్నది అనే వాక్యం లోనే వైరుధ్యం ఉంది. ఎందుకంటే, లేనిది అన్నప్పుడు లేని దానికి సంబంధించిన భావం ఏదో అది ఉండి తీరాలి. అభావానికి సంబంధించిన భావ మేమిటో ఊహకు అందదు. కనుక లేనిది అనేది పదమే గాని వాస్తవానికి దానికి అర్థం లేదు.

మాయ గుణమయం. మాయలో గుణాలే ఉన్నాయి. మాయ ప్రకృతి. మాయను అధీనంలో ఉంచుకున్న వాడు మహేశ్వరుడు. మాయావి.

ప్రపంచం మాయామయం. పరమేశ్వరుడు మాయాతీతుడు. వీరిద్దరిలో ఎవరు సత్యం? ఏదో ఒక్కటే సత్యమై ఉండాలి. మాయ సత్యమైతే, మాయామయ మైన ఈ ప్రపంచమే సత్య మౌతుంది. మాయా ప్రపంచం సత్య మైతే, ప్రత్యేకించి పరమేశ్వరుణ్ణి తెలుసుకోవలసిన అవసరం లేదు. మాయ సత్యం కాదు. సత్యం ఎప్పుడూ ఉండేదై ఉండాలి. కాని, మాయ అలా ఉండ లేదు. అవిద్య లోనే మాయ తెలుస్తూ ఉంది. పైగా బ్రహ్మమును ఆశ్రయించుకొని ఉంది. అన్ని కాలాలలో లేనిది, మరొక దానిని ఆశ్రయించుకొని ఉండేది సత్య మయ్యేందుకు అవకాశం లేదు.

**దైవ మాయ**

సదా ఉండేది సత్యము. సదా లేనిది అసత్యము. మాయ సదా ఉండేది కాదు. కనుక, సత్యం కాదు. అలాగని, మనల్ని ముప్పు తిప్పలు పెట్టే మాయ లేనిదీ కాదు. కనుక, సత్యాసత్యములు కానిది కాబట్టే దానిని మాయ అన్నారు. ఉన్నది కాక, లేనిదీ కాక, లేకనే ఉన్నట్లు కనిపించేది కనుక, అది తొలగిస్తే పోయేది కాదు. అర్థం చేసుకుంటే అదృశ్య మయ్యేది. అర్థం కానంత వరకు అనర్థాలను సృష్టిస్తూనే ఉంటుంది.

మాయ లోనే లోక ముంది. కాని మాయ లోకానికి సంబంధించింది కాదు. లోకేశ్వరుని అధీనంలో ఉండి ఆశ్చర్యాన్ని కలిగించే కార్యాలను అవలీలగా చేసేస్తుంది. అందుచేతనే, శ్రీధర స్వామి తమ 'సుబోధినీ' భాష్యంలో మాయను అలౌకికం గాను, అత్యద్భుత మైనది గాను వర్ణించారు *(అలౌకికీ అత్యద్భుతేతి)*. అలౌకికం కనుకనే అది దైవమాయ.

అర్జునా! ఈ దైవమాయ గుణమయం. ఇది నా మాయ కనుక దాట శక్యం కానిది. దుర్జయము అంటున్నాడు భగవంతుడు. ఇది విష్ణుమాయ. ఈశ్వరీమాయ. దైవమాయ కనుక దాట శక్యం కాకుండా ఉంది.





దేవుడికి సంబంధించింది కనుక, మాయ **దైవీ** అని చెప్ప బడింది ***(దైవీ దేవస్య మహేశ్వరస్య విష్ణోః స్వభూతా)***. దేవుడు ఒక్కడే కదా! ***ఏకో దేవః*** - దేవుడు ఒక్కడే అని ఉపనిషత్తు ప్రవచిస్తూ ఉంది. దేవుడు అంటేనే మరొక దానిని ఆశ్రయించకుండా, నిర్విభాగంగా తనంతట తాను వెల్గొందే వాడు. కనుకనే ఆయన దేవుడు ***(దీవ్యతి)***. అలాంటప్పుడు ఈ మాయ ఎక్కడ నుండి వచ్చింది? మాయ దేవుని లోనే ఉంది. లేకుండానే ఉన్నట్లు ఉంది. అదే మాయ. అదెలా సాధ్యం? ఆకాశంలో నీలివర్ణం లాగా.

ఆకాశం లేకపోతే నీలి వర్ణమే లేదు. నీలి వర్ణం అనేది ఉన్నట్లుండే గాని, విచారిస్తే లేనిదే అని తెలుస్తుంది. అయినా, ఉన్నట్లు కనిపిస్తూ ఉంది అంటే అనంతాకాశం ఉండుట చేతనే గోచరిస్తూ ఉంది. ఆకాశాన్ని నీలి వర్ణం ఆశ్రయించుకొని ఉంది. మాయ కూడా అంతే. అందుకే అది దైవమాయ. దాట శక్యము కానిది ***(దురత్యయా దుఃఖేన అత్యయః అతిక్రమణం యస్యాః సా దురత్యయా)***.

**మాయను దాటలేరు**

మాయను ఎవరు దాటాలి? మాయలో ఉండే వాడే దాటాలి. మాయలో ఉండే వాడు మాయ నెలా దాటుతాడు? మాయ ఏమిటో అర్థం కాకపోవడం వల్లనే కదా మాయలో ఉన్నాడు. మాయే అర్థం కాని వాడు మాయ నెలా దాటుతాడు? మాయ అర్థమైన వాడే మాయను దాట గలడు. అర్థమైన వాడు మాయను ఏమని అర్థం చేసుకుంటాడు? మాయ అనేది గగనంలో నీలి వర్ణము లాగా లేకనే ఉన్నట్లు కనిపించేదే గాని సత్యంగా ఉన్నది కాదు అని అర్థం చేసుకుంటాడు. అలాంటి వాడికి ఇక మాయ ఎక్కడుంది దాట డానికి? మాయలో ఉండి మాయను దాటలేము. మాయలో లేనపుడు దాటడానికి మాయ లేదు. అందుకే మాయ దాట శక్యం కాకుండా ఉంది.

స్వప్నంలో ఉన్న వాడికి తాను అనుభవించేది స్వప్నం అని తెలియదు. కనుక, ప్రయత్నించి స్వప్నం నుండి బయట పడలేడు. ఇక మేలుకున్న వాడు అంటారా, వాడికి స్వప్నమే లేదు బయట పడటానికి. ఇదీ మాయ. స్వప్నం లాగా అనిర్వచనీయ మైనది.

***యథా స్వప్నముహూర్తే స్యాత్ సంవత్సర శత భ్రమః,***
***తథా మాయా విలాసోఽయం జాయతే జాగ్రతి భ్రమః॥***

స్వప్నము సాగిన ముహూర్త కాలంలో నూరు సంవత్సరముల జీవితం సాగి పోయినట్లు ఎలా అనుభవానికి అందుతుందో, అలాగే జాగ్రతలో కూడా భ్రాంతి సాధ్య మవుతుంది. అదే మాయా విలాస మంటే.

ఇంతకీ ఈ మాయ ఏమిటి? ఉన్నదా, లేనిదా? చూస్తే ఉంది. చూడక పోతే లేదు. చూశామా, చూచిన వాళ్ళ అంతు చూసేస్తుంది మాయ. చూడకుండా ఉన్నామా, చూపుకు అందకుండా పోతుంది. కంటేనే స్వప్నము. కనకపోతే స్వప్న మెక్కడుంది? కాని, మాయా ప్రభావాన్ని అనుభవిస్తూ ఉన్నాం కదా? మాయను దాటే అవకాశమే లేకపోతే, ఇలా అనంత దుఃఖాన్ని అనుభవిస్తూ ఉండవలసిం దేనా? అవసరం లేదు. ఉపాయం ఉంది. అపాయం ఉండదు.

**మాయను దాటుతారు**

అర్జునా! ఎవరు నన్ను పొందుతారో ***(యే మామ్ ఏవ సర్వాత్మనా ప్రపద్యన్తే)***. వారు మాయను దాటి పోతారు ***(తే సర్వభూత మోహినీం మాయాం తరన్తి అతిక్రామన్తి)*** అంటున్నాడు భగవంతుడు.

సూర్యుడు మన వెనుక నిలిచి నపుడు మన నీడ మన కన్నా ముందే నడుస్తూ ఉంటుంది. నరుగులు

పెట్టి ఛాయను అదృశ్యం చెయ్యలేము. ఒక్కసారి వెను దిరిగామా, అంటే, సూర్యునికి అభిముఖం కాగానే నీడ వెనుక పడి పోతుంది. ఛాయ కనిపించదు. ఇలాగే మాయను దాటాలి. మాయకు ఆధారమైన పరమేశ్వరుడే సర్వాత్మరూపు డని గ్రహించి,, ఆత్మస్వరూపంగా మనలో భాసించేది పరమేశ్వరుడే అని తెలియగానే, ఈ విధమైన బ్రహ్మాత్మజ్ఞానంలో మాయ అదృశ్యమై పోతుంది. మాయను దాటడం జరుగుతుంది. మాయను దాటడం అంటే సర్వ సంసార బంధాల నుండి విముక్తి పొందటము అని అర్థము *(సంసార బంధనాత్ ముచ్యన్తే).* **మమ మాయా -** ఇది నా మాయ అన్నాడు కనుక, దైవమాయను దాటాలనుకొనే వారు దైవాన్ని ఆశ్రయిస్తే సరిపోతుంది.

*పరమేశ్వరుని పొందితే మాయను దాటే అవకాశం ఉన్నప్పుడు అందరూ పరమేశ్వరుని ఆశ్రయించ వచ్చు కదా! ఎందుకని సర్వులూ ఆశ్రయించడం లేదు? సమాధానం చెబుతున్నాడు.*

**న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।**
**మాయ యాపహృత జ్ఞానా ఆసురం భావ మాశ్రితాః ॥** 15

***న-మాం-దుష్కృతినః-మూఢాః-ప్రపద్యంతే-నరాధమాః***
***మాయయా-అపహృతజ్ఞానాః-ఆసురం-భావం-ఆశ్రితాః***

| | | | |
|---|---|---|---|
| దుష్కృతినః | = దుష్టులు | భావం | = భావమును |
| మూఢాః | = మూఢులు | ఆశ్రితాః | = ఆశ్రయించిన వారు |
| మాయయా | = మాయ చేత | నరాధమాః | = నీచ మానవులు |
| అపహృత జ్ఞానాః | = అపహరింపబడిన జ్ఞానము కలవారు | మాం | = నన్ను |
| ఆసురం | = రాక్షస సంబంధమైన | న ప్రపద్యంతే | = శరణుపొందరు |

**అర్జునా! పాపాత్ములు, బుద్ధిహీనులు, నీచులు, రాక్షస భావాలు కలిగిన వారు అజ్ఞానులు. వారి జ్ఞానాన్ని మాయ అపహరించింది. అందుకే వాళ్ళు నన్ను పొందలేరు.**

**వ్యాఖ్య**

అనిత్యమైన విషయాల వైపు ఆకర్షింపబడే బుద్ధి నిత్యమైన దాని యందు నిలవదు. ఉండదు. నిలిచి ఉండదు. నిత్యమైన దాని యందు మనస్సు లేనపుడు, మనస్సు లేకుండా నిత్యమైన దానిని ఎలా పొందుతారు?

మనస్సు లేకుండా ఎలా ఉంటుంది? మనస్సు ఉంది. కాని, ఉండవలసిన చోట లేదు. అవసరం లేని చోట ఉంది. ఉండకూడని చోట ఉంది. ఉండపట్ట లేక ఏదేదో చేస్తూ ఉంది. ఫలితాన్ని అనుభవిస్తూ ఉంది. ఇలాంటి మనస్సు పరమేశ్వరుని పొందటానికి పనికి రాదు. పరమేశ్వరుని పొందలేదు కనుక మాయ నుండి విడిపడ లేదు. ఇలాంటి మనస్సు కలవారు పాపాత్ములు *(దుష్కృతినః పాపకారిణః).* మూర్ఖులు. మందమతులు *(మూఢాః).* నరులలో నికృష్ట మైన వాళ్ళు. నరాధములు *(నరాణాం మధ్యే అధమాః).* జ్ఞానం లేని వాళ్ళు. మాయ చేత జ్ఞానము అపహరింప బడిన వాళ్ళు *(మాయయా అపహృత జ్ఞానాః).* అసుర స్వభావాన్ని ఆశ్రయించిన వాళ్ళు. హింస, అసత్యము మొదలైనవి అసుర స్వభావం క్రిందికి వస్తాయి. వాటికి అలవాటు పడ్డవాళ్ళు *(అసురం భావం హింసా నృతాది లక్షణాం ఆశ్రితాః).* ఇలాంటి నీచ మానవులు పరమేశ్వరుని పొందలేరు. పరమేశ్వరుని పొందలేరు కనుక మాయను దాటలేరు.

**దుష్కృతులు**

దుష్కృతులు అంటే చెడు కార్యాలు చేసే వారు. పాప కార్యాలు ఆచరించే వారు. దురాచారవంతులు.





సదాచారమును అభ్యసించడానికి దుర్బలులు. వ్యసనపరులు. మలినచిత్తులు. పాప కార్యాలను ఆచరించడం చేత వారి మనస్సులు పాప నిలయా లయ్యాయి. మురికి గుంటలలో మురికే ఉన్నట్లు, పాపపు బుద్ధులలో పాపమే ఉంటుంది. పాపం చేత కలుషిత మైన బుద్ధిలో పుణ్య భావాలు కలగవు. భక్తి బీజాలు మొలకెత్తవు. అందుచేత, పరమేశ్వరుని పొందటానికి ఆచరించ వలసిన దివ్యమైన సాధనలను అభ్యసించడానికి కల్మష చిత్తాలు సిద్ధం కాలేవు.

అంతఃకరణములో ఉన్న భావాలే ఆచరణలో తొంగి చూస్తాయి. బుద్ధిలో లేని వాటిని బాహ్యంలో ఆచరించడము కష్టము. నేడు పాప కార్యాలు చేస్తున్న ఈ దుష్కృతులు గత జన్మలలో కూడా ఇలాంటి చెడు కార్యాలే చేశారు. ఆ దుష్టచర్యల ప్రభావం చేత నేడు కూడా అలాగే చరిస్తున్నారు. వివేక లోపం చేత దురాచార జీవనాన్ని సాగించే ఈ పాపులు మూఢులు.

**మూఢ మానవులు**

వివేకం లేని వారు మూఢులు. అవివేకులు. యుక్తాయుక్త విచక్షణం లోపించిన వారు. ఏది చేయాలి, ఏది చేయకూడదు? అనే వివేక జ్ఞానం లోపించిన వారు. భ్రాంతిలో మగ్నమైన వారు.

వివేకం కలగాలి అంటే, శాస్త్ర జ్ఞానం ఉండాలి. లేదా, మహాత్ముల వాక్యాల యందు అకుంఠిత మైన విశ్వాస మైనా ఉండాలి. ఈ రెండూ లేని వాళ్ళు మూఢులు. వారికి శాస్త్రము నందు విశ్వాసం ఉండదు. మహాత్ముల బోధల యందు నమ్మకం కుదరదు. వారికి మనస్సు చెప్పిందే వేదం. వారి బుద్ధికి తోచిందే సత్యం. ఉత్కృష్ట మైన మానవ జన్మము పొంది ఇలా నికృష్టంగా జీవించే వారు నరాధములు.

**నరాధములు**

పుట్టే స్వభావం గల ప్రాణులలో *(జనన శీలానాం ప్రాణినాం)* మానవ జన్మ దుర్లభ మైంది అన్నారు పెద్దలు. మానవ శరీర మైన ఉపాధిలో సుఖం ప్రాప్తించాలి అంటే పుణ్యం ఉండాలి. పాపం ఉండటం చేతనే దుఃఖం ప్రాప్తిస్తూ ఉంటుంది. సుఖం ప్రాప్తించ డానికి అనుగుణ మైన పుణ్య కర్మలను ఆచరించే వారు నరోత్తము లైతే, దుఃఖం కలగడానికి కారణమైన పాప కర్మలను ఆచరించే వారు నరాధములు. స్వయంగా పాపాగ్నిని తయారు చేసుకొని, ముందు వెనుక చూడకుండా అందులో పడి అన్యాయమై పోయే వాళ్ళు నరాధములు.

మంచిని వింటూనే ఉంటారు. చెడును చేస్తూనే ఉంటారు. వివేకం ఉదయించే ప్రసక్తే ఉండదు. అంతా పశుప్రవృత్తే. బాహ్యానికి శ్రేష్ఠత్వాన్ని ప్రదర్శించినా, వారి ఆంతర్యంలో అశుభ వాసనలే నిక్షిప్తమై ఉంటాయి. వారే నరాధములు. పరమేశ్వరుని యందు మనస్సును లగ్నం చేయలేని అయోగ్యులు. మాయను దాటలేని మందభాగ్యులు.

**అసుర స్వభావులు**

సురులు అంటే దేవతలు. **సుర ఐశ్వర్యే -** ఐశ్వర్యము కలవారు సురులు. అంటే, ఈశ్వర భావం కలిగిన వారు *(ఐశ్వర్య శాలినః).* సురులు కాని వారు అసురులు. అంటే ఈశ్వర భావం లేని వారు. దేవతలు కాని వారు *(సురేభ్యః అన్యేవా).* అసుర స్వభావం కలవారు. హింస, అసత్యము మొదలైన అసుర లక్షణాలను ఆశ్రయించుకొని ఉండేవారు. కారణం, వివేక లోపం. వివేకం ఎందుకు లోపించింది? జ్ఞానం లేదు కనుక. జ్ఞానం ఏమైంది? మాయ చేత అపహరించ బడింది *(మాయాపహృత జ్ఞానాః).*

జ్ఞాన మనే సంపదను మాయ అపహరించడం చేత బుద్ధిలో భావ దారిద్ర్యం నిండి పోయింది. ఈ విధంగా కల్మష చిత్తు లైన నికృష్ట నరాధములు పరమేశ్వరుని ఆశ్రయించ లేరు. అందుచేత మాయను దాటలేరు.

*దుష్కృతులు మాయను దాటలేక అంతరించి పోతూ ఉంటే, సుకృతులు మాయను దాటి తరించి పోతూ ఉన్నారు. చదవండి.*

చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతి నోஉర్జున ।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ 16

***చతుర్విధాః-భజంతే-మాం-జనాః-సుకృతినః-అర్జున***
***ఆర్తః-జిజ్ఞాసుః-అర్థార్థీ-జ్ఞానీ-చ-భరతర్షభ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భరతర్షభ | = | భరతవంశ శ్రేష్ఠుడా! | చతుర్విధాః | = | నాలుగు విధములైన |
| అర్జున | = | అర్జునా! | సుకృతినః | = | పుణ్యాత్ములైన |
| ఆర్తః | = | ఆర్తుడు | జనాః | = | జనులు |
| జిజ్ఞాసుః | = | జిజ్ఞాసువు | మాం | = | నన్ను |
| అర్థార్థీ | = | ధనమును కోరువాడు | భజంతే | = | సేవిస్తున్నారు |
| జ్ఞానీచ | = | జ్ఞానియును | | | |

**అర్జునా! పుణ్యాత్ములు నాలుగు విధాలుగా ఉంటారు. వాళ్ళు నన్నే ఆరాధిస్తుంటారు. వారే ఆర్తులు, జిజ్ఞాసువులు, అర్థార్థులు, జ్ఞానులు.**

**వ్యాఖ్య**

అనేక జన్మలలో దురాచారాలకు, దుష్కృత్యాలకు పాల్పడి, భగవంతుని పొందలేక, మాయను దాటలేక అన్యాయమై పోయిన దుష్కృతాత్ములను గూర్చి పూర్వ శ్లోకంలో చూశాం. అలాగే, జన్మాంతరాలలో ఆచరించిన పుణ్యకర్మల వల్ల పుణ్యమూర్తు లైన సుకృతాత్ములు పరమేశ్వరుని సేవించే పవిత్ర కార్యాల లోనే నిమగ్న మవుతారు. ఆ విధంగా పరమాత్మను పొంది, మాయను దాటేస్తారు. పుణ్యశీలు రైన అట్టి పుణ్య కర్ములను గురించి ఈ శ్లోకంలో చెబుతూ, ఈ విషయాన్నే అనేక దృక్కోణాల నుండి అధ్యాయాంతం వరకు వివరిస్తాడు.

సుకృతులు అంటే పుణ్యకర్మలు ఆచరించే వారు ***(సుకృతినః పుణ్య కర్మాణః)***. పుణ్యాత్ములు. వారు నాలుగు విధాలుగా ఉంటారు ***(చతుర్విధాః)***. వారు పరమేశ్వరుని సేవ లోనే ఉంటారు ***(మాం భజన్తే సేవన్తే)***. ఆ నలుగురే ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని.

అందరూ పరమేశ్వరుని భక్తి చేస్తూనే ఉన్నారు. కాకపోతే, ఏ ఉద్దేశ్యంతో చేస్తున్నారు? దేని నభిలషించి చేస్తున్నారు? అనే దానిని బట్టే వారి లోని తారతమ్యాలు. భక్తిలో తేడా లేదు. ఫలాకాంక్ష లోనే భేదం. ఫలమే దైనా, భగవంతుని ఆశ్రయించడం చేత వారందరూ భక్తు లయ్యారు. వారిలో మొదటి వాడు ఆర్తుడు.

**(1) ఆర్తుడు**

ఆర్తి అంటే ఆపద. ఆపదలో ఉన్నవాడు ఆర్తుడు. ఆపన్నుడు. ఆపదలలో సంభవించే దుఃఖాన్ని భరించ లేక, ఆర్తిని పోగొట్టే మరొకరు ప్రపంచంలో లేరు అనే భావము స్థిరమై నపుడు, ***నీవే తప్ప నితః పరం బెరుగ*** అంటూ భగవంతుని నైపు తిరిగి భక్తి చేసే వాడు ఆర్తుడు. ఆర్తులను రక్షించే వాడు అయినందున భగవంతుడు ఆర్తత్రాణ పరాయణుడు. ఆర్తులు ఆశ్రయించ దగిన వాడు. ఆర్త శరణ్యుడు.





ప్రపంచము దుఃఖమయం. సంసారం శోకగ్రస్తం. దానికి తోడు ప్రారబ్ధం భయంకరం. లోకంలో వ్యాధు లున్నాయి. చోరు లున్నారు. సర్ప వృశ్చిక వ్యాఘ్రాదు లున్నాయి. చావులు కూడా ఇక్కడే ఉన్నాయి. ఏ ఆపదైనా రావచ్చు. ఎప్పుడైనా రావచ్చు. ఏ దుఃఖమైనా కలుగ వచ్చు.

దుఃఖ మొస్తే ఎవరైనా బాధ పడతారు. మరీ ఎక్కువైతే విలపిస్తారు. దుఃఖ మొస్తే మనుషులు ఏడవ గలరే గాని వేడుకోగలరా? సంస్కారం తోడైతేనే వేడుకో గలరు. బాధ లొచ్చినంత మాత్రాన మనసు పరమేశ్వరుని నైపు తిరుగుతుందా? దుఃఖ కారణాలను అన్వేషిస్తూ, ఆలోచిస్తూ అలసి పోతుందే గాని, దుఃఖాన్ని నివారించే అచ్యుతుని ఆరాధించాలని ఎందుకు భావిస్తుంది? అలా భావించడం, క్షణాలలో నిముషాలలో జరిగే పని కాదు. జన్మ జన్మల పుణ్యఫల విశేషం ఉంటేనే బుద్ధి భగవంతుని నైపు తిరుగుతుంది. పుణ్యం కలవారే సుకృతాత్ములు. ఆర్తిలో కూడా భగవంతుని సేవించే శక్తి గల పుణ్యవంతులు.

ఆపదలు ఆవేదనకు గురి చేస్తాయి. అట్టి ఆపదలు పరమేశ్వరుని స్మృతికి తీసుకొని రాగలిగితే, అవి ఆపదలు కావు. సంపద లనే చెప్పుకోవాలి. ఏ సంపదైనా భగవంతుని తరువాతే కదా!

అత్తమ్మా! ఎప్పుడూ కృష్ణా! కృష్ణా! అని స్మరిస్తూ ఉంటావు. ఇదిగో వచ్చేశాను! ఏమి కావాలో కోరుకో! నువ్వు కోరింది వెంటనే అనుగ్రహిస్తాను! అన్నాడు శ్రీకృష్ణ పరమాత్మ. ఏది అడిగినా ఇవ్వగల సమర్థుణ్ణి ముందు పెట్టుకొని కుంతీదేవి ఏమడిగిందో తెలుసా?

**విపదః సంతు న శ్శశ్వత్ యాసు సంకీర్త్యతే హరిః**

కృష్ణా! నిన్ను సదా కీర్తించే అవకాశా న్నిచ్చే ఆపదలు మాకు నిరంతరము కలిగేలా చూడు అన్నది పుణ్యశీల కుంతీదేవి.

పుణ్యశీలురు భక్తి చేయడానికి ఆపదలే ఉండాలి అని దాని అర్థం కాదు. ఆపదలు ఉన్నా పుణ్యం లేని వారు భక్తి చేయలేరు. పుణ్యాత్ములు ఎప్పుడూ భక్తి చేస్తారు. జీవితంలో ఆపదలు ఎప్పుడైనా తప్పవు కదా! అలా ఆపదలు వచ్చి నపుడు అగ్నికి ఆజ్యం తోడైనట్లు, ఆర్తులలో భక్తి అధిక మవుతుంది.

ఆపదలలో చిక్కుకొని ఆవేదన చెందే వారు దుఃఖభాగులు. ఆపదలలో కూడా బుద్ధి భగవంతుని స్మరించేందుకు సిద్ధ పడితే అది సుకృతం. పవిత్రం. ఔషధం లేని వారినే వ్యాధి బాధిస్తుంది. వ్యాధి ఉండినా దానిని నిర్మూలించే ఔషధ మున్నప్పుడు ఇక ఆపద ఎక్కడుంది? ప్రపంచంలో ఒక వ్యాధికి ఒకే ఔషధ ముంటుంది. కాని, భగవంతుడు అలా కాదు. అన్ని ఆపదలకు తానే ఏకైక భేషజం. సాధారణ మైన ఆపదలకే కాదు భవ రోగానికి కూడా తానే ఔషధము. ఈ కారణం చేత విష్ణుసహస్రనామం పరమేశ్వరుణ్ణి **భేషజం** అని కీర్తించింది.

***భేషజం, సంసార రోగస్య ఔషధం భేషజమ్*** - సంసార మనే రోగానికి మందు భగవంతుడే. అందుచేత, ఆయన ***భేషజ*** నామధేయుడు. భగవంతుని ఆశ్రయిస్తే సర్వ దుఃఖాలు తీరి పోతాయి. సమస్త ఆపదలు పారి పోతాయి. ఆపదలు తొలగుతూ ఉంటే, బుద్ధి తేలిక పడుతూ ఉంటుంది. తేలిపోతూ ఉంటుంది. పై పైకి అలవోకగా తేలిపోతూ ఉంటుంది. అదే తిరుమల యాత్ర.

***ఆపద మొక్కుల వాడా! గోవిందా! గోవిందా!*** అంటూ బాలాజీ దర్శనానికి భక్తులు కొండెక్కుతూ ఉంటారు. ఆపదలు లేకుండా, అలసట తెలియకుండా భగవంతుని సన్నిధికి చేరడానికి అలా పరమేశ్వరుణ్ణి నోరారా పిలుస్తూ ఎక్కుతుంటారు. మొదటిసారి గోవిందా! అనగానే భగవంతుడు ఆ పిలుపు నందుకొని భక్తుల్ని రక్షిస్తాడు.

ఆపదల్ని దూరం చేస్తాడు. రెండవసారి, గోవిందా! అనగానే దూరమైన ఆపదలను తిరిగి రాకుండా భగవంతుడు నివారిస్తాడు.

పల్లవి: గోవిందా! గోవిందా! జన్మ లన్నీ గోవింద!
జన్మ లన్నీ గోవింద! కర్మము లన్నీ గోవింద! ॥ గోవిందా ॥
అనుపల్లవి: శరణన్న వారికి గోవింద! గోవింద!
మరణము గోవింద! జననము గోవింద!
చరణము: కేశవ నామంతో ఆశలు గోవింద!
మాధవ స్మరణతో మమతలు గోవింద!
బాధలు గోవింద! బరువులు గోవింద!
కష్టాలు నష్టాలు గోవింద! గోవింద! ॥ గోవిందా ॥

అని ఆర్తత్రాణ పరాయణుని వైభవాన్ని బరువైన తేలిక పదాలతో కీర్తించింది చైతన్య హృదయం.

### గోవర్ధన గిరిధారి

వర్ష ఋతువు గడచి పోయినా, శరదృతువు సంభవించినా, యుక్తాయుక్తము లను విస్మరించి, గోకులంలో జడివానను కుండపోతగా వర్షింప చేశాడు ఇంద్రుడు. ఆ వడగండ్ల వానకు గోవులు, గోపికలు, గోపబాలురు – గోకుల మంతా దిక్కు తోచని దైంది. దిగ్భ్రాంతి చెందింది.

*కృష్ణ కృష్ణ మహాభాగ త్వన్నాథం గోకులం ప్రభో*
*త్రాతు మర్హసి దేవాన్నః కుపితా ద్భక్త వత్సల ॥*

కృష్ణా! గోకులనాథా! కోపించిన దేవేంద్రుడు సృష్టించిన ఈ ఆపద నుండి నువ్వే మమ్మల్ని రక్షించాలి! అని గో గోప గోపీ గణం పరమేశ్వరుని పాదాలను ఆర్తితో ఆశ్రయించింది. అంతే. ఆర్తుల ఆర్తనాదాన్ని ఆలకించిన ఆర్తత్రాణ పరాయణుడు ఒక్క చేతితో *(ఏక హస్తేన)* గోవర్ధన పర్వతాన్ని *(గోవర్ధనా చలమ్)* పుట్టగొడుగు వలె *(ఛత్రాకం ఇవ)* సునాయాసంగా ఎత్తి నిలిపాడు *(లీలయా దధార).*

పండుగ వాతావరణంలో పిడుగులతో కూడిన వర్షం శరదృతువులో పడుతుందని గోకులవాసులు ఊహించారా? ఆపద లెప్పుడూ చెప్పి రావు. ఆనందంగా జీవించే సమయాలలో కూడా వ్యక్తులు ఆర్తులు కావచ్చు. ప్రమాద భరితమైన జీవితంలో ఎప్పుడు ఏది ముంచు కొస్తుందో ఎవరికి తెలుసు? తెలియకుండా ఊడిపడే ఆపదల్ని గూర్చి ఆలోచిస్తూ ఆందోళన చెందడం కన్నా, ఆర్తత్రాణ పరాయణు డైన అచ్యుతుని ఆశ్రయించి, ఆరాధనా భావంతో సేవిస్తూ జీవించ గలిగితే, ఆపద లన్నీ నీటి మీద వ్రాత ల్లాగా తేలి పోతాయి. గోకులవాసులు అదే చేశారు. కొండదేవుని అండ దొరికింది. ఆర్తి దూరమైంది. ఆనందం హృదయంలో చేరి పోయింది. ఇలాంటి అనుగ్రహం గోకుల వాసులకే కాదు. అందరికీ కలగాలి. మనందరికీ కలగాలి. అలా కలగాలి అంటే, మనం కూడా ఆర్తితో పరమేశ్వరుని ఆశ్రయించి సేవించాలి. ఈ గోవర్ధన గిరిధారి సన్నివేశాన్ని పులకరించిన హృదయంతో పరవశించి గానం చేసింది చైతన్య గాత్రం.

పల్లవి: జలచర మృగ భూసుర నర రూపా!
గోప గోపికా జన పావన రూపా! ॥ జలచర ॥
చరణము: గోవర్ధనో ద్ధారక! గోపీజన పాలక!
గోకుల సంపోషకా! గోధన సంరక్షకా!





ఉరుముల మెరుపుల జడి వానలతో
బాధించెను సురపతి
పుట్టగొడుగు వలె గోవర్ధనమును
పై కెత్తితివి శ్రీపతి
గాలికి పోయెను గర్వములు
దిక్కై నిలిచెను చరణములు
నీ కరము సోకిన ఆ కొండదే భాగ్యము ॥ జలచర ॥

### దుఃఖ సాగరంలో ద్రౌపది

అది కౌరవ సభ. కాదు, క్రౌర్యానికి, నీచానికి ప్రతిరూపంగా నిలిచిన సభ. ద్రౌపది చీరను అంది పుచ్చుకున్నాడు దుశ్శాసనుడు. గాలి లేని చోట వృక్షా ల్లాగా నిశ్చేష్టు లయ్యారు పాండవులు. ఎవరూ నోరు మెదపడం లేదు. ద్రౌపది ఆక్రందన మంతా అరణ్య రోదనమే అయింది.

ఎవరూ పట్టించుకోని దుర్భర పరిస్థితులలో పుణ్యం ఉంటే, భగవంతుడు ఆదుకుంటాడు. ఆపదలలో పుణ్య కర్మలే పరిరక్షిస్తాయి.

బాల్యంలో తమ ఇంటికి వచ్చిన వసిష్ఠుల వారిని సేవించింది ద్రౌపది. ఆమె సేవలతో తృప్తి చెందిన మహర్షి, బిడ్డా! ఇలారా! **మహత్యాపది సంప్రాప్తే స్మర్తవ్యో భగవాన్ హరిః** – ఎప్పుడు ఆపద లొచ్చినా భగవంతుణ్ణి వెంటనే స్మరించడం మరచిపోకు! అని ఉపదేశించాడు. మహర్షుల వాక్కులు మహా ఆపదల నుండి మనలను రక్షిస్తాయి. వెంటనే ద్రౌపది ఆపదను విస్మరించింది. ఆర్తితో శ్రీకృష్ణుని స్మరించింది, పిలిచింది.

గోవిందా! కృష్ణా! భయంకర మైన ఆపదలో చిక్కుకున్నాను. నాకు అభయాన్ని ప్రసాదించు! **(అత్యభయదం కృష్ణం).** ఆర్తిహరా! అచ్యుతా! కౌరవ సముద్రంలో పడి మునిగి పోతున్న నన్ను రక్షించు! **(ఆర్తి నాశనా! కౌరవార్ణవ మగ్నాం మా ముద్ధరస్వ జనార్దన!)** అని ప్రార్థించింది ద్రౌపది. ఆమె ఆర్తి పరమాత్మ హృదిని కదిలించింది. అంతే, అక్షయంగా వస్త్ర ప్రదానం చేసి ఆమెను ఆదుకున్నాడు ఆర్తత్రాణ పరాయణుడు. ఈ సన్నివేశాన్ని రాళ్ళను సైతం కరిగించే రీతిలో గానం చేశాడు సంత్ సూరదాస్.

పల్లవి: సునేరీ మైనే నిర్బలకే బల్ రామ్! ॥ సునేరీ ॥
అనుపల్లవి: పిఛలే సాఖ్ భరో సంతన్ కీ
అదే సంవారో కామ్ ॥ సునేరీ ॥
చరణము: ద్రుపద్ సుతా నిర్బల్ భయి తాదిన్
గహలాయే నిజధామ్
దుశ్శాసన్ కీ భుజా థకిత్ భయి
వసన్ రూప్ భయె శ్యామ్ ॥ సునేరీ ॥

పల్లవి : నేను విన్నాను. బలహీనులకు బలము రాముడే అని విన్నాను!
అనుపల్లవి : సాధువుల కార్యాలను నెరవేర్చి, వారి అవసరాలకు తెర దించిన ఋజువులు గతంలో ఎన్నో ఉన్నాయి.
చరణము : ఆనాడు కౌరవ సభలో ద్రౌపది దీనురాలై నీవే దిక్కు అని ప్రార్థించి నపుడు, దుశ్శాసనుని బాహుబలము అంతా ఏమైంది? నిర్వీర్యమై పోయింది. అహో! వస్త్ర మంతా వాసుదేవుడే వ్యాపించాడు కదా!

అందుకే అందరూ సుకృతాత్ములు కావాలి. చేసిన పుణ్యాలు వృధా కావు. భగవత్సేవలు వృథాగా పోవు. ద్రౌపది అలాగే రక్షింప బడింది. ఈ శ్లోకం నుండి అంతా సుకృతాత్ముల ప్రకరణమే. ప్రస్తుత శ్లోకంపై శ్రీధర స్వామి తమ 'సుబోధినీ' గీతా భాష్యంలో **పూర్వ జన్మసు యే కృతపుణ్యా జనాః** - పూర్వ జన్మలలో చేసిన పుణ్య కర్మల ప్రభావము చేతనే సుకృతాత్ములు పరమేశ్వరుని కృపకు పాత్రు లవుతారు అన్నాడు.

ఆత్మబంధువులారా! గత జన్మల పుణ్యం మనకు ఉందో, లేదో అనే మీమాంసలో పడకండి! తెలియని విషయానికి సంతసించినా, సంతాపం చెందినా ఫలితం శూన్యం. మన చేతిలో నేడు ఉంది. చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ!

**గజేంద్ర మోక్షము**

ద్రౌపది లాగా గజేంద్రుడు కూడా ఆర్త భక్తుడు. దప్పిక తీర్చుకొని స్నానం చెయ్యాలని కొలనులో దిగాడు గజేంద్రుడు. మొసలి పట్టుకుంటుందని ఊహించాడా? బంధుగణ మంతా విడిచిపెట్టి వెళ్ళింది. శక్తి ఉన్నంత వరకు గజేంద్రుడు మకరితో పోరాడాడు. కరిమకరుల సంగ్రామం భయంకరంగా సాగింది. గజేంద్రుని శక్తి సన్నగిల్లింది. సహాయం చేసే దిక్కు లేకుండా పోయింది. అన్ని ద్వారాలు మూత పడ్డాయి. ఒకే ఒక ఆశ్రయ స్థానం మిగిలింది. అదే భగవంతుడు. తన ఆర్తిని తీర్చి రక్షించ మని శ్రీహరిని ప్రార్థించాడు గజేంద్రుడు.

భగవంతా! మహా వేగంతో వచ్చి పైబడ నున్న యముడనే సర్పాన్ని చూచి ***(బలినః ప్రచండ వేగాత్ అభిధావతః అంతక + ఉరగాత్)*** భీతి చెంది నిన్ను శరణు వేడిన వారిని రక్షించే ప్రభువు నీవే ***(భీతమ్ ప్రపన్నమ్ యః పరిపాతి).*** అంతే కాదు. నీ భయం చేత ***(త్వద్భయాత్)*** మృత్యువు పరుగులు తీస్తూ నిష్క్రమిస్తుంది ***(మృత్యుః ప్రధావతి).*** పరమేశ్వరా! నాకు నీవే శరణ్యము. నిన్నే ఆశ్రయించు కున్నాను. నన్ను రక్షించు ***(తం శరణ్యమ్ శరణమ్ ఈమహే).*** గజేంద్రుని మొర నాలకించిన శ్రీహరి మకరి నోటి నుండి గజేంద్రుని విడిపించి ఆశీర్వదించాడు. ఈ గజేంద్ర మోక్షమును ప్రస్తావిస్తూ (***సునేరి మైనే*** అనే కీర్తన లోనే) ఆర్త భక్తురాలైన ద్రౌపదిని ఉద్ధరించినట్లే, ఆర్త భక్తు డైన గజేంద్రుని కాపాడిన సన్నివేశాన్ని మరొక చరణంలో గానం చేశాడు సూరదాసు మహాత్ముడు.

***చరణము : జబ్ లగ్ గజ్ బల్ అపనో భరత్యో నేక సర్యో నహిం కామ్ ।***

***నిర్బలహై బలరామ్ పుకారో ఆయే అధే నామ్ ॥ సునేరి ॥***

చరణము : తన బలాన్ని నమ్ముకొని కొలనులో గజేంద్రుడు పోరాడినంత వరకు కార్యాన్ని సాధించలేక పోయాడు. నేను బలహీనుణ్ణి, నాకు బలము నీవే అని ఆర్తితో గజేంద్రుడు పిలువగానే, పిలుపు పూర్తి కాక ముందే రాముడు అరుదెంచాడు. ఆశీర్వదించాడు.

ఈ విధంగా ఆర్తులైన ఎందరో భక్తులు పరమేశ్వరుని దివ్యానుగ్రహాన్ని పొంది తరించారు. ఆర్తుని విషయంలో ప్రధానంగా ఒక్క సత్యాన్ని అర్థం చేసుకోవాలి. ఆర్తుడు ఏమి ఆశించి ప్రార్థిస్తున్నాడు అనేది అప్రస్తుతం. ఎవరిని ప్రార్థిస్తున్నాడు అనేదే ప్రధానం. ఏదో ఒక కారణంగా, అది ఏదైనా కావచ్చు, భగవంతుడు ఒక్కసారి హృదయంలో ప్రవేశిస్తే చాలు. ఆ తరువాత జీవితంలో ఏదో జరిగి పోతుంది.

**(2) జిజ్ఞాసువు**

చతుర్విధ భక్తులలో రెండవ వాడు జిజ్ఞాసువు. పరమేశ్వరుని గూర్చి తెలుసుకోవాలనే ఇచ్ఛ గల వాడు. జ్ఞానాభిలాష గల వాడు ***(జిజ్ఞాసుః భగవత్తత్త్వం జ్ఞాతుమ్ ఇచ్ఛతి యః).*** జిజ్ఞాస భక్తులు చాలా అరుదుగా ఉంటారు.

భగవంతుడు కావాలి - మోక్షాన్ని పొందాలి అని ఆశించే వారే అందరూ. భగవంతుడు జ్ఞాన రూపంలో





ఉన్నాడని, జ్ఞానాన్ని పొందడం చేతనే పరమేశ్వరుని పొందడం సాధ్య మవుతుందని, జ్ఞాన సముపార్జనకు శాస్త్రమే ప్రమాణ మని తెలిసి, సంప్రదాయ మార్గంలో జ్ఞానాభ్యాసం చేసే వాడు జిజ్ఞాసువు. జనక, ఉద్ధవ, యాజ్ఞవల్క్యాది మహాత్ములు జిజ్ఞాస భక్తులు. ఆర్త భక్తుల లాగా కేవలం ఆపదలు ఆసన్న మైనప్పుడే కాకుండా, ఏ ఆపద లేకపోయినా, బ్రతుకే ఆపదలో ఉంది అనే నగ్న సత్యాన్ని ఆకళింపు చేసుకొని, ప్రపంచంపై విరక్తిని పెంచుకొని, సదా పరమాత్మ జ్ఞాన సముపార్జనలో జీవించే వారు జిజ్ఞాసువులు. గొప్ప సుకృతాత్ములు.

**(3) అర్థార్థి**

ధనాన్ని ఆశించి పరమేశ్వరుని ఆరాధించే వాడు అర్థార్థి ***(అర్థార్థీ ధనకామః).*** సంపదలను, ఐశ్వర్యాన్ని సంగ్రహించుకొనే కార్యంలో నిమగ్నమై ఉండే అర్థార్థి, ఆ కార్యము భగవంతుని అనుగ్రహం చేతనే సాధ్య మౌతుందని గ్రహించి, తత్కార్య సిద్ధికి భగవంతుణ్ణి ఆశ్రయించుకొని ఆరాధిస్తూ ఉంటాడు. సుగ్రీవుడు, ధ్రువుడు, కుచేలుడు లాంటి భక్తులు అర్థార్థులే అని చెప్పుకోవాలి. అర్థార్థులలో, ఆర్తి కలిగి అర్థార్థి భక్తులుగా మారే వారు కొందరైతే, ఆర్తి లేకపోయినా, ధనం యొక్క అవసరం లేకపోయినా, సహజ స్వభావం చేత, పరిగ్రహ బుద్ధి చేత ప్రేరేపితులై సంపదల నాశిస్తూ సర్వేశ్వరుని ఆశ్రయించే వారు కొందరు. వస్తు వాహనాదుల నాశించి భగవంతుని ప్రార్థించినా, ఏదో విధంగా భగవంతుని స్మరించడం జరిగింది కనుక, అర్థార్థులు కూడా సుకృతాత్ములే. కొందరు అర్థార్థి భక్తులు మొదట ఐశ్వర్యాలను అభిలషించి భక్తు లైనా, క్రమేపి పరివర్తన చెంది నిజ భక్తు లౌతారు. పురందరదాసు లాంటి భక్తులు ఆ కోవ లోని వారే.

ఈ సందర్భంలో విస్మయాన్ని కలిగించే విశ్లేషణ ఒకటి ఉంది. అర్థార్థి భక్తుణ్ణి గూర్చి ఇంతవరకు మనం చూచిన సర్వ సాధారణమైన, సర్వులకు ఆమోద యోగ్యమైన అర్థం కన్నా అది విలక్షణ మైనది. చాలా అరుదైనది, అందమైనది కూడా.

చతుర్విధ భక్తులలో అర్థార్థి మూడవ వాడు. నలుగురిలో సర్వోత్తము డైన జ్ఞాని నాల్గవ వాడు. జ్ఞాని నలుగురిలో శ్రేష్ఠుడు. మరి, మొదటి వాడైన ఆర్తుని కన్నా, జిజ్ఞాసువు శ్రేష్ఠుడని ఇప్పటికే మనం తెలుసు కున్నాం. ప్రాధాన్యతల్ని పరిశీలిస్తే మూడవ వాడైన అర్థార్థి మొదటి వాడైన ఆర్తుని కన్నా, రెండవ వాడైన జిజ్ఞాసువు కన్నా శ్రేష్ఠుడై ఉండాలి. కాని, సంపదల్ని కోరే అర్థార్థి జ్ఞానాన్ని అభిలషించే జిజ్ఞాసువు కన్నా అధికుడు ఎలా అవుతాడు? దీనిని ఎలా అర్థం చేసుకోవాలి అనేది మీమాంస.

అర్థం అంటే ధనం అని కాకుండా పురుషార్థం అని గ్రహిస్తే, పరమ పురుషార్థ మైన మోక్షాన్ని అభిలషించే ముముక్షువు అర్థార్థి అవుతాడు. జ్ఞానాభిలాషి జిజ్ఞాసువు. కొందరు జిజ్ఞాసువులు, జ్ఞానం మోక్షం కొరకే అనే భావనతో ప్రారంభమైనా, మధ్యలో శాస్త్ర వాసనలో కూరుకు పోయి, మోక్షాన్నే విస్మరిస్తారు. అలా కాకుండా, మోక్షాన్నే సదా స్మృతిలో ఉంచుకొని, జ్ఞాన మార్గంలో చరించే అర్థార్థి భక్తుడు ఆర్తుని కన్నా, జిజ్ఞాసువు కన్నా ఉన్నతుడుగా తెలుస్తాడు. తనను మించిన జ్ఞాని నాల్గవ వాడుగా ఎలాగూ ఉండనే ఉన్నాడు కదా!

ఆత్మబంధువులారా! అర్థార్థి అంటే సంపదలను ఆశించేవా డనేదే అర్థం. శ్రీ శంకరుల వారి భాష్యం కూడా అదే. ప్రస్తుతం మనం చూచిన విశ్లేషణ మీలో చాలా మందికి తెలియనిది కావచ్చు. బాగుంది అనిపిస్తే గ్రహించండి. లేదా, ధనం ఉండనే ఉంది. వైరుధ్యం లేని విషయం కనుక, చర్చనీయాంశము కాదని భావించి ప్రస్తావించాను. అంతే.

**(4) జ్ఞాని**

జ్ఞానం కలవాడు జ్ఞాని. పరమేశ్వర తత్త్వాన్ని తెలిసిన వాడు ***(జ్ఞానీ విష్ణోః తత్త్వవిత్).*** ఇతడు ఆత్మజ్ఞాని.

మొదటి ముగ్గురు భక్తులు సకామ భక్తులు. ఇతడు అకామ భక్తుడు. భగవంతుని ద్వారా ఇతనికి ఏమీ జరుగ నవసరం లేదు. భగవంతుని నుండి దేనినీ కోరడు. ఇతనికి జ్ఞానమూ అవసరం లేదు. మోక్షమూ అవసరం లేదు. ఇతడు ఆత్మవిదుడు. ఆప్తకాముడు. సర్వ కామనలు ఈడేరిన వాడు. వ్యాస, శుక, శంకర, రమణ లాంటి వారు ఈ నాల్గవ కోవకు చెందిన వారు.

*జ్ఞాని యైన మహితాత్ముని వైభవము, శ్రేష్ఠత్వము తరువాత శ్లోకంలో వర్ణింప బడుతోంది.*

**తేషాం జ్ఞానీ నిత్యయుక్త: ఏకభక్తి ర్విశిష్యతే ।**
**ప్రియో హి జ్ఞాని నోఽత్యర్థ మహం స చ మమ ప్రియః ॥ 17**

***తేషాం-జ్ఞానీ-నిత్యయుక్తః-ఏకభక్తిః-విశిష్యతే***
***ప్రియః-హి-జ్ఞానినః-అత్యర్థం-అహం-సః-చ-మమ-ప్రియః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| తేషాం | = | వారిలో | అహం | = | నేను |
| నిత్యయుక్తః | = | నిత్యయోగియు | అత్యర్థం | = | మిక్కిలి |
| ఏకభక్తిః | = | ఏకాంత భక్తి కలిగిన | ప్రియః | = | ప్రియుడను |
| జ్ఞానీ | = | జ్ఞాని యైన భక్తుడు | సః చ | = | అతడు కూడా |
| విశిష్యతే | = | శ్రేష్ఠుడుగా ఉన్నాడు | మమ | = | నాకు |
| జ్ఞానినః | = | ఆత్మజ్ఞానికి | ప్రియః హి | = | ప్రియమైన వాడు గదా |

**అర్జునా! నాలుగు రకాలైన భక్తులలో జ్ఞాని శ్రేష్ఠుడు. అతడు నిత్యయోగి. ఏకాంత భక్తుడు. అతడికి నేను అత్యంత ప్రియుణ్ణి. నాకూ అతడు చాలా ప్రియమైన వాడు.**

### వ్యాఖ్య

భక్తి చేసే వాడు భక్తుడు. భక్తి దేని కొరకు చేసినా, తాను చేసే భక్తిలో భగవంతుడు ఉన్నందున, అతడు భక్తుడు. నాలుగు విధాలుగా భక్తి చేస్తున్నా, నలుగురూ భక్తులే. కనుకనే నలుగురిని సుకృతాత్ములుగా, పుణ్యాత్ములుగా తెలుసుకున్నాం. నలుగురూ భక్తులే అయినా మొదటి ముగ్గురిది సాధనా భక్తి. నాల్గవ వాడైన జ్ఞానిది సాధ్య భక్తి. సాధనా భక్తి సకామ భక్తి. సాధ్య భక్తి అకామ భక్తి.

నాలుగు విధాలుగా భక్తి చేసే ఈ పుణ్యాత్ములలో *(తేషాం చతుర్ణాం మధ్యే)* జ్ఞాని *(తత్త్వవిత్)* విశిష్టమైన వాడు *(విశిష్యతే)*. అరుదైన వాడు కనుక శ్రేష్ఠుడు. సకామ భక్తులైన ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి అనే ముగ్గురి కన్నా విశిష్ట మైన రెండు లక్షణాలు జ్ఞానిలో గోచరిస్తూ ఉన్నందున జ్ఞాని విశిష్టుడు. జ్ఞాని లోని ఆ రెండు విశిష్ట విషయాలు ఏమిటంటే, (1) నిత్య యుక్తత్వము (2) ఏకభక్తి. ఈ రెండు విశిష్ట గుణాలే సాధ్య భక్తి లోని ప్రత్యేకతలు. సాధ్య భక్తి అమృత స్వరూపము, పరమ ప్రేమ స్వరూపము అని నారద భక్తి సూత్ర ప్రబోధము *(సా త్వస్మిన్ పరమ ప్రేమ రూపా, అమృత స్వరూపా చ)*. ఈ విధమైన సాధ్యభక్తిని సిద్ధింప చేసుకున్న వాడు జ్ఞాని. అర్జునా! దేనిని తెలుసుకున్న తరువాత ఇక్కడ తెలియ దగినది అంటూ శ్రేష్ఠ మైనది మరొకటి ఉండదో, అట్టి విజ్ఞాన సహితమైన జ్ఞానమును నీకు సంపూర్ణముగా చెబుతాను *(7 - 2)* అని ఈ ఏడవ అధ్యాయం ఆరంభం లోనే పరమేశ్వరుడు చెప్పిన జ్ఞానము ఈ సాధ్య భక్తియే. శ్రేష్ఠు డైన జ్ఞాని యొక్క భక్తి వైశిష్ట్యమే.

**నిత్యయోగి**

విశిష్ట మైన జ్ఞాని తత్త్వవిదుడు అని చెప్పుకున్నాం. తత్త్వవిదుడు కనుక జ్ఞాని నిత్యయుక్తుడు *(తత్త్వవిత్త్వాత్ నిత్యయుక్తః భవతి)*. జ్ఞాని మనస్సు సదా పరమాత్మ యందే సమాహితమై ఉంటుంది. అఖండ మైన పరమేశ్వర





తత్త్వమే సదా తన బుద్ధికి సాక్షాత్కరింప బడుతూ ఉంటుంది. అందుచేత తాను నిత్యయుక్తుడు. నిత్యయోగి. జ్ఞానికి నిరంతరం భగవ త్సంబంధమే గాని సకామ భక్తుల లాగా వియోగము ఉండదు.

నాలుగు విధాలుగా భక్తి చేసే నలుగురు భక్తులకు భగవంతుడు కావాలి. ఆపదలు దుఃఖానికి కారణము కనుక, దుఃఖాలు పోవడానికి ఆపదలను నిర్మూలించ మని ఆర్తుడు పరమేశ్వరుని భక్తి చేస్తాడు. ఆపదలు తీరిపోతే ఆర్తుడు మరచి పోవచ్చు. ఆర్తునికి చాలా చాలా కావాలి. కాని, ఆపద లొచ్చి నపుడు మాత్రమే వాటిని తీర్చడానికి భగవంతుడు కావాలి. మరి, ఏ ఆపద తీరాలని ఆర్తుడు పరమేశ్వరుని ఆశ్రయిస్తున్నాడో, ఆ ఆపదను లోకంలో మరొకరు తీర్చ గలిగితే, అప్పుడు కూడా ఆర్తునికి భగవంతుని అవసరం ఉంటుందా? ఆలోచించండి.

అర్థార్థి భక్తి చేస్తాడు. ధనాసక్తి అర్థార్థి భక్తిలో ప్రధానంగా ఉంటుంది. కనుక, అర్థార్థికి భగవంతుడు అవసరమా? లేక, ధనం కొరకు భగవంతుడు అవసరమా? ధనం అవసరమై నపుడే అర్థార్థికి భగవంతునితో భక్తి సంబంధం ఉంటుంది. నిత్య సంబంధం ఉండే అవకాశం మాత్రం లేదు.

దుఃఖం పోవాలని ఆర్తుడు, ధనం కావాలని అర్థార్థి భక్తి చేసినట్లే, జ్ఞానం రావాలని జిజ్ఞాసువు భక్తి చేస్తాడు. జ్ఞానాసక్తితో స్వాధ్యాయము నందు నిమగ్నమై ఉండే జిజ్ఞాసువు నిత్యయోగిగా ఉండలేడు. నిత్యయుక్తత్వము సాధ్యం కాదు.

జ్ఞాని కూడా భక్తుడే. కాని, భగవంతుని నుండి గాని, భగవంతుని ద్వారా గాని మరొక దానిని ఆశించి జ్ఞాని భక్తి చేయడం లేదు. అతడికి భగవంతుడే కావాలి. మరేదీ అవసరం లేదు. ప్రకాశము సూర్యునికి ఎలా సహజమో, వెన్నెల చంద్రునికి ఎలా సహజమో, పరాభక్తి జ్ఞానికి అలా సహజము. సహజ మైన అకామ భక్తిని కలిగిన నిత్యయుక్తుడు ఏకాంత భక్తుడు. అతడిలో ఏక భక్తి అద్వితీయంగా అలరారుతూ ఉంటుంది.

**ఏకాంత భక్తుడు**

సేవించ వలసింది, భక్తి చేయవలసింది రెండవది లేదని తెలిసి పరమాత్మ యందే భక్తి కలవాడు ఏక భక్తి అనే రెండవ విశిష్ట లక్షణం గలవాడు *(ఏక భక్తిః అన్యస్య భజనీయస్య అదర్శనాత్)*.

ఏదో ఒక దానిని మనస్సు కోరుతూనే ఉంటుంది. అలాంటి మనస్సే సకామ భక్తు లైన ముగ్గురి లోనూ ఉంది. దేనినీ కోరకుండా, ఏ అవసరాన్ని భావించకుండా నిశ్చింతగా ఉండే మనస్సును ఊహించలేము. అలాంటి మనస్సు జ్ఞాని ఒక్కడికే ఉంది. అందుచేత, సకామ భక్తుల కన్నా, జ్ఞాని విలక్షణంగా కనిపిస్తాడు. అతని మనస్సు దేనినీ వాంఛించదు. భగవంతుడే ఆ మనస్సుకు కావాలి. అందుచేత సకామ భక్తుల లాగా ఏదో ఆశించి, మరేదో పొందాలని, లేదా పోగొట్టు కోవాలని జ్ఞాని మనస్సు భావించదు కనుక అతని భక్తికి రెండవది తెలియదు. అదే ఏక భక్తి.

**మయ్యేవ భక్తిః న అన్యత్ర భక్తిః సః ఏక భక్తిః ఉచ్యతే**

భగవంతుని యందే భక్తి కలిగి అన్యత్ర ఏ విధమైన భక్తి లేని వాడు ఏక భక్తి అని చెప్పబడినాడు అని పురాణ వచనము. అట్టి ఏక భక్తి కలవాడై నందున చతుర్విధ భక్తులలో జ్ఞాని విశిష్ట మైన వాడే గాక భగవంతునికి అత్యంత ప్రియుడు కూడా అయ్యాడు.

**నిత్య ప్రియులు**

భగవంతుడు జ్ఞానికి అత్యంత ప్రియుడు. అలాగే జ్ఞాని భగవంతునికి కూడా అత్యంత ప్రియుడు. సిరి

ప్రియత్వం సకామ ప్రియత్వం కాదు. ఆత్మ ప్రియత్వం కనుక, వీరు పరస్పరం అత్యంత ప్రియులు. ఆత్మ నిత్యము కనుక, వీరు నిత్య ప్రియులు.

***అహం ఆత్మా జ్ఞానినః అతః తస్య అహం అత్యర్థం ప్రియః*** - నేను జ్ఞాని యొక్క ఆత్మను. అందుచేత అతనికి నేను అత్యంత ప్రియుణ్ణి. ఎవరికి ఏది ప్రియమైనా, అది ఆత్మార్థమే కదా? ***ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి*** అని కదా బృహదారణ్యక శ్రుతి! ఆత్మయే బ్రహ్మము అనే జ్ఞానం పూర్ణంగా జ్ఞానికి ఉన్నందున అతనికి నేనే మిక్కిలి ప్రియుణ్ణి అంటున్నాడు భగవంతుడు. ఇదే ఏక భక్తి. విభక్తం కాని భక్తి. వియోగం లేని భక్తి. విభక్తులు ఏడు ఉండటము వ్యాకరణానికి శోభ. భక్తి ఏకమై ఉండటము వ్యక్తికి శోభ. అదే ఏకభక్తి విశిష్టత.

జ్ఞానికి పరమేశ్వరుడు ఆత్మ కనుక, పరమాత్మ జ్ఞానికి అత్యంత ప్రియుడు. అలాగే జ్ఞాని పరమాత్మకు ఆత్మ కనుక, ఏక భక్తి జ్ఞాని పరమేశ్వరునికి అత్యంత ప్రియుడు ***(జ్ఞానీ మమ వాసుదేవస్య ఆత్మా ఏవ ఇతి మమ అత్యర్థం ప్రియః).*** ఆత్మ ఒక్కటే గాని రెండు కాదు కనుక, ఒకరికి మరొకరు ఆత్మగా తెలియుచున్న జ్ఞాని, మరియు వాసుదేవుడు పరస్పరం అభిన్నులే, కనుక పరస్పరం అత్యంత ప్రియులై ఉన్నారు. వీరిరువురి ప్రేమలలో, ప్రియత్వంలో భేదం లేనందున **అత్యర్థం**, అంటే మిక్కిలి ప్రియత్వము అనే పదము ఇద్దరికీ వర్తిస్తుంది.

*అయితే, సకామ భక్తులైన ఆర్తాదులు వాసుదేవునికి ఇష్టులు కారా? అలా కాదు. మరెలా? చెబుతున్నాడు.*

**ఉదారాః సర్వ ఏ వైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।**
**ఆస్థితః స హి యుక్తాత్మా మా మే వానుత్తమాం గతిమ్ ॥ 18**

*ఉదారాః-సర్వే-ఏవ-ఏతే-జ్ఞానీ-తు-ఆత్మా-ఏవ-మే-మతం*
*ఆస్థితః-సః-హి-యుక్తాత్మా-మాం-ఏవ-అనుత్తమాం-గతిం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏతే | = | ఈ | సః | = | వాడు |
| సర్వే | = | అందరును | యుక్తాత్మా | = | ఆత్మ యోగపరుడై |
| ఉదారాః ఏవ | = | గొప్ప వారే | మాం ఏవ | = | నన్నే |
| జ్ఞానీ తు | = | జ్ఞాని మాత్రము | అనుత్తమాం | = | అత్యుత్తమమైన |
| ఆత్మా ఏవ | = | నేనే యని | గతిం | = | గమ్య స్థానమును |
| మే | = | నా యొక్క | ఆస్థితః హి | = | పొంది ఉంటాడు |
| మతం | = | అభిప్రాయము | | | |

**అర్జునా! వీళ్ళందరూ ఉదారులే. జ్ఞాని మాత్రం నా ఆత్మే అని నా అభిప్రాయము. ఎందుకంటే, నేనే శ్రేష్ఠ మైన గమ్యంగా భావించి జ్ఞాని యుక్తాత్ముడై ఉన్నాడు.**

**వ్యాఖ్య**

ఆర్తాదు లైన నలుగురు భక్తులలో నిత్యయుక్తుడు, ఏకభక్తుడు అయిన జ్ఞానియే తనకు అత్యంత ప్రియుడని పూర్వ శ్లోకంలో పరమేశ్వరుడు ప్రవచించి నపుడు, అయితే సకామ భక్తు లైన ఆర్తాదులు ముగ్గురు ప్రియులు కారా, అప్రియులా? అనే సందేహం స్ఫురించే అవకాశం లేకపోలేదు. ఈ సందేహాన్ని పరిహరిస్తూ జ్ఞాని ఎలా ప్రియతముడో ప్రస్తుత శ్లోకంలో వివరిస్తున్నాడు.

అర్జునా! భక్తు లందరూ నాకు ప్రియులే. అందరూ ఉదారులే. కాని, జ్ఞాని నాకు అత్యంత ప్రియతముడు అంటున్నాడు భగవానుడు. ఇదే శ్లోకం పూర్వార్థ విశేషం.





ఆలయాలలో, మందిరాలలో భక్తులు భగవంతుని స్తుతించడం మనం చూస్తూ ఉంటాం. ఇక్కడే, ఒక్క గీతా మందిరం లోనే భగవంతుడు భక్తుల్ని స్తుతించడం వింటున్నాం. అపార కరుణాపారావార ప్రేమమూర్తి అనంత కృపకు జోహార్లు.

**భక్తు లందరూ ప్రియులే**

భక్తు లందరూ ఉదారులే అంటున్నాడు భగవంతుడు. ఉదారులు అంటే ఉత్కృష్టులు అని అర్థము ***(ఉదారాః ఉత్కృష్టాః).*** నికృష్టాన్ని కోరే వారు నికృష్టులు. ఉత్కృష్ట మైన దానిని వాంఛించే వారు ఉత్కృష్టులు. భగవంతుని కన్నా ఉత్కృష్ట మైనది మరొకటి లేనందున భగవంతుని ఆశించి భక్తి చేసే వారందరూ ఉత్కృష్టులే. ఉత్కృష్ట మైన భక్తులే.

జ్ఞాని తనకు ప్రియుడు అని చెప్పినంత మాత్రాన, మిగిలిన ఆర్తాది భక్తులు ప్రియులు కారని భావించ కూడదు. ఆర్తాది ముగ్గురు భక్తులు కూడా ప్రియులే ***(త్రయః అపి మమ ప్రియః ఏవ ఇత్యర్థః).*** తనను గూర్చి భక్తి చేసే వారు తనకు అప్రియు లైతే, ఇక వారు ఎవరికి ప్రియు లవుతారు? తన భక్తు డైన వాడు, అతడు ఎలాంటి భక్తు డైనా, తనకు మాత్రం ఎప్పుడూ అప్రియుడు మాత్రం కాడు అనేది భగవంతుని అభిమతం ***(న హి కశ్చిత్ మద్భక్తః మమ వాసుదేవస్య అప్రియః భవతి).***

పుణ్యం లేకపోతే ఎవ్వరూ భక్తి చేయలేరు. సుకృతాత్ములే భక్తి చేస్తారు. భగవంతుని భక్తి చేస్తారు. కనుక వారందరూ భగవత్ప్రియులే. కాకపోతే, జ్ఞాని అత్యంత ప్రియతముడు. అదే విశేషము ***(జ్ఞానీ తు అత్యర్థం ప్రియః భవతి ఇతి విశేషః).***

**జ్ఞాని ప్రియతముడు**

ఆర్తాదుల భక్తికి, జ్ఞాని భక్తికి తారతమ్యం ఉంది. అదే జ్ఞాని విశిష్టతకు కారణ మైంది. ఆర్తాదులది భేద భక్తి. జ్ఞానిది అభేద భక్తి. ఆర్తాదుల భక్తిలో ద్వైత ముంది. జ్ఞాని భక్తిలో అద్వైత సౌరభము గుబాళిస్తోంది. అదే తేడా. ఆర్తాదుల భక్తి నిత్యభక్తి లాగా అఖండం కాదు. జ్ఞాని భక్తి నిత్య సంబంధంతో అలరారే అద్వైత భక్తి.

భక్తునికి భగవంతునితో సంబంధాన్ని కుదిర్చేదే భక్తి. ఒకటి మరొక దానితో సంబంధం కలిగి ఉంది అంటే, అవి పరస్పరము వేరుగా ఉన్నాయి అని అర్థము. భక్తుడు భగవంతుని కన్నా అన్యంగా ఉండటం చేత భక్తి సాధన ద్వారా భగవంతునితో సంబంధాన్ని కుదుర్చు కుంటున్నాడు.

భగవంతుడు అన్యంగా ఉన్నాడు అంటే పరోక్షంగా ఉన్నాడు అని అర్థము. ప్రత్యక్షంగా లేడని భావము. పరోక్షంగా ఉన్న భగవంతుడితో సంబంధాన్ని పెట్టుకోవాలి అంటే, అది పూజ ద్వారా అయినా కావచ్చు. ధ్యానమైనా కావచ్చు. సంకీర్తన కావచ్చు. స్మరణం కావచ్చు. మంత్రం కావచ్చు. స్వాధ్యాయం కావచ్చు. ఇవన్నీ భక్తి సాధనలే. భగవంతుని కొరకు భక్తుడు అభ్యసించే పవిత్ర సాధనలే. ఆ విషయంలో రెండవ భావానికి అవకాశం లేదు.

కాకపోతే, ఆర్తాదులు పరమేశ్వరుని భక్తి చేస్తున్నారే గాని, భగవంతుని స్వరూపాన్ని గ్రహించలేక పోతున్నారు. పరమేశ్వరుడు తమకు పరోక్షంగా ఉన్నాడు అనే భావన లోనే ఉన్నారు. కాని, జ్ఞాని అలా కాదు. తన ఆత్మయే పరమేశ్వరుడు అని జ్ఞానికి తెలును. భగవంతుడు తమకు పరోక్షంగా ఉన్నాడని భావించి భక్తి చేసే ఆర్తాది భక్తులు సాగించే భక్తి సాధనలు దేశకాలాదులకు పరిమితంగా ఉంటాయి. అందుచేత వారిలో నిత్యభక్తి, లేదా పరమేశ్వరునితో నిత్య సంబంధం గోచరించదు. జ్ఞానికి భగవంతుడు తన ఆత్మే అని తెలియడం చేత, నిత్య సంబంధం కొనసాగుతూనే ఉంటుంది. నిత్యము తన తోనే ఉన్నందున, తనను అప్పుడప్పుడు సేవించే

ప్రియ భక్తుల కన్నా, సదా తన యందే ఉండే ప్రియతము డైన జ్ఞాని విశిష్ట మైన వాడుగా భగవంతుడిచే శ్లాఘించ బడ్డాడు. పైగా ఆర్తాది భక్తులు ఫలకాములు. జ్ఞాని తన స్వరూపమే కనుక, నిత్యభక్తి అతనిలో నిర్హేతుకంగా సాగుతూ ఉంటుంది. పరమాత్మ తన ఆత్మే అనే సత్యాన్ని *(అయమాత్మా బ్రహ్మ)* గ్రహించిన జ్ఞాని, పరమేశ్వరుని తన స్వరూపంగా తెలుసుకున్న జ్ఞాని, మరొక కారణం లేకుండా, పరమేశ్వరుని తన ఆత్మగా ప్రేమిస్తాడు. పరమాత్మ కన్నా ఉత్తమ మైన గమ్యము మరొకటి లేనందున సమాహిత చిత్తుడై సదా పరమాత్మనే పొంది ఉంటాడు *(స యుక్తాత్మా మామ్ ఏవ అనుత్తమాం గతిమ్ ఆస్థితః హి).*

కనుక భక్తు లందరూ ప్రియులే అయినా, జ్ఞాని ప్రియాతి ప్రియుడు అని చెప్పడం ఆర్తులను అప్రియంగా చూడటం కాదు. ద్వైత భావనతో సాగే భక్తి సాధనలు అద్వైత భావనతో జ్ఞానాభ్యాసంగా మారాలని తెలియ జేయడమే ముఖ్యోద్దేశము.

భక్తి ఉంది కనుకనే ఆర్తాదులు భగవంతున్ని భక్తి చేస్తున్నారు. ముఖ్యంగా జిజ్ఞాసువు భక్తి కారణం గానే భగవంతుని తెలుసుకోవాలి అనుకుంటున్నాడు. మరి తెలుసుకున్న తరువాత, అంటే భగవంతుడు తన ఆత్మయే అనే జ్ఞానం కలిగిన తరువాత ఏమౌతుంది? భక్తి జ్ఞానంలో విలీన మవుతుంది. ద్వైతం అద్వైతంలో లీన మౌతుంది. కనుక భక్తి జ్ఞానానికి మార్గము. జ్ఞానము మోక్షానికి ద్వారము. అట్టి జ్ఞానంతో విరాజిల్లు తున్నందున, పరమావధిని పొందియున్న జ్ఞాని ఆర్తాదుల కంటే శ్రేష్ఠు డని చెప్పబడ్డాడు.

*చతుర్విధా మమ జనా భక్తా ఏవం హి మే శ్రుతం,*
*తేషాం ఏకాంతినః శ్రేష్ఠా యే చైవ నాన్య దేవతాః ॥*

నాలుగు విధాలుగా భక్తి చేసే నా భక్తులలో ఫలాకాంక్షతో, భిన్న మార్గాలలో చరించే వారి కన్నా, ఏకాంత భక్తు డైన జ్ఞానియే శ్రేష్ఠు డని చెప్పబడింది అని మహాభారతం - శాంతి పర్వంలో భగవంతుడే స్వయంగా తెలియ చేశాడు.

*జ్ఞాని అలా శ్రేష్ఠుడు కనుకనే తరువాత శ్లోకంలో కూడా స్తుతి చేయడం జరుగుతోంది.*

బహూనాం జన్మనా మన్తే జ్ఞానవా న్మాం ప్రపద్యతే ।
వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ 19

**బహూనాం-జన్మనాం-అంతే-జ్ఞానవాన్-మాం-ప్రపద్యతే**
**వాసుదేవః-సర్వం-ఇతి-సః-మహాత్మా-సుదుర్లభః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| బహూనాం | = | అనేకములైన | మాం | = | నన్ను |
| జన్మనాం | = | జన్మల యొక్క | ప్రపద్యతే | = | భజిస్తున్నాడు |
| అంతే | = | చివర | సః | = | అట్టి |
| జ్ఞానవాన్ | = | జ్ఞానవంతుడు | మహాత్మా | = | మహాత్ముడు |
| సర్వం | = | అంతయును | సుదుర్లభః | = | మిక్కిలి అరుదు |
| వాసుదేవః ఇతి | = | వాసుదేవుడే అని | | | |

**అర్జునా! అనేక జన్మల ఫలంగా, చివరగా అంతా వాసుదేవుడే అనే జ్ఞానాన్ని పొంది జ్ఞాని అయ్యాడు. అలాంటి మహాత్ముడు చాలా అరుదుగా ఉంటాడు.**

**వ్యాఖ్య**

మోక్షము అనేది సులభ సాధ్యము అని ఇంత వరకు ఎవ్వరూ చెప్పలేదు. దీనికి ప్రధాన కారణం మోక్ష





మంటే ఏమిటో తెలియక పోవడమే. తెలియని దానిని పొందడమే కష్టం. ఇక సులభంగా పొందడం అనే ప్రసక్తి ఎక్కడుంది?

అందరికీ మోక్షం కావాలి. మోక్ష మార్గంలో తీవ్రంగా శ్రమించే వాళ్ళు ఎందరో ఉన్నారు. అందరివీ ప్రయత్నాలే. మోక్షానికి సంబంధించిన అవగాహన స్పష్టంగా లేకపోవడం చేత, అందరికీ మోక్షము దుర్లభమే అవుతుంది. సర్వులకు దుర్లభ మైన మోక్షం నూటికో కోటికో ఒక్కడికి లభిస్తే, దుర్లభ మైన మోక్షాన్ని పొందిన వ్యక్తి కూడా దుర్లభం గానే ఉంటాడు. అందుచేత మోక్ష స్వరూపుడైన జ్ఞాని దుర్లభుడే కాదు. సుదుర్లభుడు అంటున్నాడు భగవంతుడు.

**సు దుర్లభః - సుతరాం దుర్లభః సుదుర్లభః -** అంటే మిక్కిలి దుర్లభమైన వాడు అని అర్థము. అట్టి మహా వ్యక్తిని ఈ శ్లోకంలో దర్శింప చేస్తూ, అతడికి మహాత్ముడు అనే బిరుదుమ ప్రదానం చేస్తున్నాడు భగవంతుడు. మరి, సులభ సాధ్యం కాని ముక్తిని ఇత డెలా పొందాడు? మహాత్ముడెలా అయ్యాడు? ఎప్పుడయ్యాడు?

**జన్మ జన్మల ఫలం**

అర్జునా! అనేక జన్మల తరువాత, సర్వము వాసుదేవుడే అనే జ్ఞానమును పొంది జ్ఞాని నన్ను చేరుతున్నాడు అంటున్నాడు భగవంతుడు *(బహూనాం జన్మనాం అంతే పురుష వాసుదేవ సర్వమితి జ్ఞానవాన్ సన్ మాం ప్రపద్యతే).*

***జనీ ప్రాదుర్భావే -*** జనించడము, లేదా పుట్టడమే జన్మ. ఉత్పత్తి, లేదా ఉద్భవము అని అర్థము. ఇక్కడ జన్మించడమే జన్మ అయినపుడు, జన్మించింది ఎవరు? అనే ప్రశ్న పుడుతుంది. ***శరీర సంబంధస్య ఏవ జన్మ శబ్దార్థత్వాత్ -*** జన్మ శబ్దానికి శరీర సంబంధమే అర్థము. పుట్టింది శరీరమే. అంటే ఒక్క జన్మకు ఒక్క శరీరమే అని అర్థము. ***బహూనాం జన్మనాం -*** అనేక జన్మలు అని ప్రస్తావించి నపుడు, అనేక శరీరాలలో పుట్టడం అని స్పష్టం. అనేక జన్మల చివర, ఇప్పుడు, అంటే ఈ జన్మలో జ్ఞానము ద్వారా మోక్షాన్ని పొందడం జరుగుతూ ఉంది అంటే, ఇది చివరి జన్మ అని అర్థము. మోక్ష ప్రాప్తిలో జన్మరాహిత్యం జరుగుతూ ఉంది అనేది భావం. జ్ఞానికి ఇది అంతిమ జన్మ.

అనేక జన్మ లెత్తిన తరువాత జ్ఞానం కలిగింది. అనేక జన్మలు అంటే జీవుడు ఎత్తిన జన్మ లన్నీ లెక్కకు వస్తాయని కాదు. జీవుడు పశుపక్ష్యాది ఉపాధులలో కూడా జీవించి ఉంటాడు. ఆ మాట కొస్తే మానవ జన్మలలో కూడా మోక్షాపేక్ష కలిగిన తరువాత కలిగిన జన్మలనే లెక్కించు కోవాలి. ***జ్ఞానార్థ సంస్కార ఆశ్రయణామ్ అన్తే -*** జ్ఞానాన్ని పొందడానికి ఉపకరించే చిత్తశుద్ధిని తయారు చేసుకోవడానికి అనువైన అనేక జన్మల తరువాత, జ్ఞాన పరిపాకం చెంది, చివరి దైన ఈ జన్మలో జ్ఞాని అయ్యాడు. ముముక్షుత్వం కలిగిన తరువాత, అనేక జన్మలలో తయారు చేసుకున్న పుణ్య సంచయము ఈ జన్మలో జ్ఞానానికి కారణ మైంది.

పద్దెనిమిది మెట్లు ఎక్కిన తరువాత ఆలయంలో దైవ దర్శన మైనట్లు, మోక్షాన్ని పొందడానికి ఇన్ని జన్మ లెత్తాలి అనే నియమ మేమీ లేదు. అదంతా ముముక్షుత్వం లోని తీవ్రతమ బట్టి ఉంటుంది. ఇక్కడ అనేక జన్మలలో జ్ఞానప్రాప్తి సాధనాలను ప్రోగు చేసుకున్న తరువాత అని అర్థమే గాని ఇన్ని జన్మలు ఎత్తాలి అని అర్థం కాదు.

పుణ్యం అంటే ఏదో కాదు. ఈశ్వరానుగ్రహమే పుణ్యం. ఈ పుణ్యం కారణం గానే అద్వైత వాసన ఏర్పడుతుంది *(ఈశ్వరానుగ్రహాత్ ఏవ పుంసాం అద్వైత వాసనా).* ఆ తరువాత జ్ఞానం కలుగుతుంది. ఏ జ్ఞానము? సమస్తము వాసుదేవుడే అనే జ్ఞానం.

## సర్వం వాసుదేవ మయం

ఉన్నదంతా వాసుదేవుడే అనే జ్ఞానమే మోక్షము. ఉన్నదంతా అంటే దృగ్దృశ్యాలు రెండూ వాసుదేవుడే అని అర్థం. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు - ఈ మూడూ వాసుదేవుడే అన్న అఖండ జ్ఞానం. త్రిపుటిగా తెలుస్తున్నా, వాస్తవానికి అవన్నీ వాసుదేవుడే అనే సర్వ జ్ఞానము.

జ్ఞేయములుగా తెలిసే వన్నీ జ్ఞానం కన్నా వేరుగా లేవు. అన్నీ జ్ఞాన విశిష్టాలే. విశిష్టాలే కనుక అవేవీ సత్యం కావు. జ్ఞేయములు జ్ఞానం కన్నా వేరు కావు. మరి, జ్ఞానం జ్ఞాని కన్నా వేరుగా ఉందా? లేదు. కనుక, జ్ఞానియే సత్యము. అంటే జ్ఞానమే సత్యం. దానికి విశిష్టంగా గోచరించే దంతా మిథ్య. ఈ దృశ్యమాన జగత్తు అంతా మిథ్య.

ప్రపంచం ఉంది. కాని, పరమాత్మ కన్నా వేరుగా లేదు. ప్రపంచం పరమాత్మపై ఆధారపడి ఉందే గాని స్వతంత్రంగా లేదు. అందుకే ప్రపంచం మిథ్య. ప్రపంచానికి ప్రత్యేక మనుగడ లేదు. పరమాత్మ కంటే వేరుగా దానికి సత్తా లేదు. స్ఫురణ అసలే లేదు.

నామ రూపాత్మక మైన జగత్తుకు పరమాత్మ కన్నా భిన్నమైన సత్తా లేదు. కుండకు మృత్తు కంటే వేరుగా సత్తా లేదు. కుండ కన్నా విలక్షణంగా మట్టి ఎలా ఉందో, జగ ద్విలక్షణంగా పరమేశ్వరుడు ఉన్నాడు. ఒక్క మట్టిని తెలుసుకుంటే, మట్టి పాత్రలలో ఉన్నదంతా మట్టే నని తెలిసినట్లు ***(యథా ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్)*** పరబ్రహ్మమును తెలుసుకుంటే జగత్తులో ఉన్నదంతా బ్రహ్మమే అని అవగత మవుతుంది. అదే ***సర్వం వాసుదేవ మయం*** అనే అఖండ జ్ఞానము. ఇదే ముక్తికి ఏకైక కారణము.

***అహమేవ పరంబ్రహ్మ వాసుదేవాఖ్య మవ్యయమ్ ।***
***ఇతి స్యా న్నిశ్చితో ముక్తో బద్ధ ఏవాన్యథా భవేత్ ॥***

వాసుదేవుడు అనే పేరు గల అవ్యయ బ్రహ్మస్వరూపము నేనే అనే నిశ్చయ జ్ఞానము కల వాడు ముక్తు డవుతున్నాడు. అట్టి జ్ఞానము లేని వాడే బద్ధుడు.

వాసుదేవుడు అనే నామంలో వాసువు, దేవుడు అనే రెండు పదా లున్నాయి ***(వాసుశ్చ అసౌ దేవశ్చ వాసుదేవః).*** మట్టి పాత్రలలో మట్టే ఉన్నట్లు, ప్రపంచం అంతా తానే వ్యాపించి ఉన్నందున ఆయన వాసువు ***(వసతి, వాసయతి ఆచ్ఛాదయతి వా సర్వం ఇతి వాసుః).*** అలాగే ప్రపంచానికి విలక్షణంగా ప్రకాశిస్తూ ఉన్నాడు ***(దీవ్యతి)*** కనుక వాసువైన వాడు దేవుడై శోభిస్తున్నాడు ***(దీవ్యతి, ద్యోతతే, వ్యవహరతీతి వా దేవః).*** ఇదే సర్వాత్మ జ్ఞానం. ఇట్టి గొప్ప జ్ఞానమును పొందిన వాడు మహాత్ముడు. ***వాసుదేవ స్సర్వమితి*** అనే జ్ఞానం గల మహాత్ముడు వాసుదేవుని కన్నా వేరైన వాడు కాడు. కనుక, జ్ఞాని సాక్షాత్తు వాసుదేవుడే. ***ద్విబాహుః అపరో హరిః*** - రెండు భుజాలతో గోచరిస్తున్న విష్ణుదేవుడు. అతని దర్శనము విష్ణుదర్శనమే. అతని మాట వేదవచనమే. అతడొక కదిలే దేవాలయం. అందుచేతనే దుర్లభుడు.

*మరి, సర్వమూ వాసుదేవుడే అనే సత్యము ఇంత విస్పష్టంగా తెలుస్తూ ఉన్నా ఈ సత్యాన్ని అందరూ ఎందుకని గ్రహించలేక పోతున్నారు? చెబుతున్నాడు.*

కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్య న్తేఽన్యదేవతాః ।
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా ॥ 20

***కామైః-తైః-తైః-హృతజ్ఞానాః-ప్రపద్యంతే-అన్యదేవతాః***
***తం-తం-నియమం-ఆస్థాయ-ప్రకృత్యా-నియతాః-స్వయా***





| | | | |
|---|---|---|---|
| స్వయా | = తమదైన | తం తం నియమం | = ఆయా కోరికలకు తగిన నియమమును |
| ప్రకృత్యా | = ప్రకృతి చేత | ఆస్థాయ | = ఆశ్రయించి |
| నియతాః | = నియమింప బడినవారు | అన్యదేవతాః | = ఇతర దేవతలను |
| తైః తైః కామైః | = ఆయా విషయ వాంఛల చేత | ప్రపద్యంతే | = సేవిస్తున్నారు |
| హృతజ్ఞానాః | = పోయిన వివేకము గలవారై | | |

**పార్థా! కొందరు కోరికలకు వశపడి వివేకాన్ని కోల్పోతారు. దానికి కారణం వారి స్వభావమే. అలాంటి వివేక శూన్యులు అన్య దేవతలను ఉపాసిస్తూ, ఆయా విధులను అనుసరిస్తూ ఉంటారు.**

**వ్యాఖ్య**

సర్వమూ వాసుదేవుడే అని గ్రహించిన వారు జ్ఞానులు. అలా గ్రహించలేని వారు జ్ఞానము లేని వారు. అనేక జన్మలలో ఆర్జించిన పుణ్య ఫల విశేషం చేత జ్ఞానులకు వాసుదేవుని కన్నా అన్యమైనది లేదు అనే జ్ఞానం కలిగింది. జ్ఞానం కలిగింది అంటే అజ్ఞానము అంతరించింది అని భావం. అజ్ఞానము అంతరించడం చేత, సుఖించడానికి ఏవో ఏవో కావాలి అనే కోరికలు కూడా నశించాయి. అంటే, వాసుదేవ పరబ్రహ్మ అఖండ జ్ఞానాన్ని పొందడం చేత సర్వ కామనలు తీరిన వాడయ్యాడు అని అర్థము ***(సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితేతి*** - తైత్తిరీయ శ్రుతి).

## వాంఛల ఉంఛ వృత్తి

జన్మాంతరాలలో జ్ఞానాసక్తి కల వారు పుణ్య సంచయాన్ని ప్రోగు చేసుకొని జ్ఞాను లైతే, జ్ఞానాసక్తి లేక తాత్కాలిక సుఖాలలో రమించాలనే కామంతో ఉన్న వారు కోరికలను తీర్చుకొనే ప్రయత్నంలో నిమగ్నులై, ఆ కోరికలను తీర్చుకోవడానికి ఆయా కోరికలకు సంబంధించిన దేవతలను ఉపాసిస్తూ వచ్చారు. అదే వారి స్వభావ మైంది. స్వభావాన్ని అనుసరించే కర్మ లుంటాయి. స్వభావము కోరికలతో నిండి పోయింది కనుక, ఈ జన్మలో కూడా కోరికల్ని తీర్చుకొనే ప్రయత్నంలో ఉంటారే గాని వాసుదేవ పరమాత్మను ధ్యానించి తరించాలని భావించరు. ఎవరిని ఉపాసించాలి, ఎందుకు ఉపాసించాలి అనే వివేకం వారిలో సంపూర్ణంగా లోపించింది. ఏమైంది వారి వివేక జ్ఞానము? అపహరించ బడింది ***(హృత జ్ఞానాః అపహృత వివేక జ్ఞానాః).*** ఎవరి చేత అపహరించ బడింది? ఆయా కామాల చేత ***(తైః తైః కామైః).*** ఆయా కామాల చేత అంటే ఎవరెవరికి ఏయే కోరికలు ఉన్నవో, వాటి వాటి చేత వారి వారి వివేక జ్ఞానము అపహరించ బడింది అని అర్థము. ఎవరి కోరికలు వారివే కనుక, ఎవరెవరి కోరికల చేత వారి వారి వివేకమే అపహరింప బడింది. అందుచేత ***కామైః*** అని బహువచనం ప్రయోగింప బడింది.

## ఆఖ్యాయిక

ఒకనాడు మధ్యాహ్నం భోంచేసి మంచం మీద పడుకొని తమ భవిష్యత్తును గూర్చి కబుర్లు చెప్పుకుంటున్నారు నూతన దంపతులు.

'నాకు ఈ రోజు చాలా సంతోషంగా ఉంది. మనకు రత్నాల వంటి ఇద్దరు మగపిల్లలు పుడుతారని ఒక ప్రముఖ జ్యోతిష్కుడు చెప్పాడు' అన్నాడు భర్త.

'అలాగాండీ! అయితే మన పిల్లల అవసరాలను గురించి ఇప్పట్నుంచే మనం ఆలోచించాలి. వాళ్ళను ఏ కొరత లేకుండా పెంచుకోవాలి.

ఏమండీ! ఈ మంచం చాలా చిన్నది. మనకైతే పరిపోతుంది గాని, అబ్బాయి పుడితే పరిపోదు. అందుకని పెద్ద మంచ మొకటి ఇప్పుడే సిద్ధం చేసి పెట్టుకుందా మండీ' అంది భార్య.

'రెండవ మంచ మెందుకు? ఇది సరి పోతుందిలే! మనిద్దరి మధ్యన బాబు పడుకుంటాడు. చూడు, ఎంత స్థలం ఉందో!' అని తాను కొంచెం ప్రక్కకు జరిగి వారిద్దరి మధ్య కొంత చోటును చూపించాడు లుబ్ధుడైన భర్త.

'మరి చిన్నబాబు పుడితే ఎట్లామ్మా?' అంది భార్య మురిసిపోతూ. 'ఏముంది? వాడు కూడా మన మధ్యనే పడుకుంటాడు. చూడు, సరిపోతుందో లేదో! అంటూ మంచం చివరకు మరి కొంత జరిగాడు. అంతే. మంచం మీద నుండి జారి దబ్బున క్రింద పడ్డాడు. చెయ్యి విరిగింది.

నొప్పి భరించలేక బిగ్గరగా ఏడ్చాడు. అదే సమయానికి భిక్షానికి ఆ ఇంటి ముందు కొచ్చిన సాధువు ఏడుపు విని లోనికి వచ్చాడు. యజమాని రోదిస్తున్నాడు. భార్య ఓదార్చుతూ ఉంది.

'ఏం జరిగింది నాయనా, ఏడుస్తున్నావు?' అని ప్రశ్నించాడు సాధువు. 'స్వామీ! పుట్టబోయే మా చిన్నోడి విషయం చర్చించుకుంటూ మంచం మీద నుండి జారి క్రింద పడ్డాను. చెయ్యి విరిగింది' అన్నాడు యజమాని ఏడుస్తూనే.

'అయ్యో పాపం! ఎంత బాధగా ఉందో! కాస్త జాగ్రత్త నాయనా! పుట్టక ముందే చెయ్యి విరిచేశాడు. పుట్టిన తరువాత చిత్తాన్నే పేల్చేస్తాడేమో!' అంటూ సాధువు తన దారిన తాను పోయాడు.

కోరికల మూటను నెత్తి కెత్తుకొని, గాలిమేడలలో విహరించే అవివేకానికి ముగింపు పలికి, వివేకాన్ని వృద్ధి చేసుకొని పరమేశ్వరుణ్ణి ఆశ్రయించి తరించాలి.

**విధి విధానము తెలియని అధమ జన్మ**
**భక్తి శ్రద్ధలు లేని దద్దమ్మ బ్రతుకు**
**మునిగి పోవుచుంటి సంసార మడుగు లోన**
**నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!**

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

**అన్య దేవతోపాసన**

కోరికల చేత వివేకము అపహరింప బడింది. ఇంతకీ ఏమిటి ఆ కోరికలు? పరమేశ్వరునికి సంబంధించినవి మాత్రము కానే కావు. పుత్ర, కళత్ర, ధన, కీర్తిప్రతిష్ఠలకు సంబంధించిన కోరికలు (***పుత్రపశు స్వర్గాది విషయాః*** - శ్రీ శంకర). ఇలాంటి కోరికల్ని తీర్చుకొనే ప్రయత్నంలో అవివేకులు తల మునకలై ఉంటారు. వారి వాంఛా ఫలసిద్ధికై అన్య దేవతలను ఆశ్రయించి ఆరాధిస్తూ అనేకము లైన పూజలు, పురస్కారాలు, యజ్ఞ యాగాదులు, వ్రత దానాదులు చేస్తూ ఉంటారు. ఆయా కార్యాలకు సంబంధించిన దేవతలను అర్చిస్తూ ఉంటారు. వీరే అన్య దేవతలు. అంటే వాసుదేవ పరబ్రహ్మమునకు అన్యమైన దేవతలు (***వాసుదేవాత్ అన్యాః అన్యాః దేవతాః***).

జగత్తును పరమేశ్వర స్వరూపంగా భావించి, సర్వం వాసుదేవ మయంగా దర్శించే మహాత్ములైన జ్ఞానులు, పూర్ణ రూపులు కనుక వారిలో కోరికలు మొలకెత్తవు. వివేకమును కోల్పోయిన జ్ఞానరహితులు కోరికలను తీర్చుకొనే యత్నం లోనే ఉంటారు. కర్మలు చేసినా అదే తంతు. ఉపాసనలు కొనసాగించినా అదే పంతు.





జ్ఞానం కావాలనే ఆసక్తి కల వారందరు ఒక్క వాసుదేవుణ్ణే ఆశ్రయిస్తారు. కాని, కోరికలు తీర్చుకోవాలనే పిపాస గల అవివేకు లందరూ ఒక దేవతను ఆశ్రయించరు. ఎందుకని? ఎవరి కోర్కెలు ఏవో, వాటిని తీర్చుకొన డానికి ఏ దేవతను ఉపాసించాలో ఆ దేవతనే ఉపాసిస్తారు. ఈ విధమైన కామ్య కర్మలకు సంబంధించిన విధు లన్నీ వేదం లోని కర్మకాండలో ఉన్నాయి.

**అనిత్య ఫలాలు**

***జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత*** - స్వర్గమును కోరే వాడు జ్యోతిష్టోమము అనే యాగాన్ని చేయాలి. ఇది విధి వాక్యం. ***యావజ్జీవం అగ్నిహోత్రం జుహోతి*** - బ్రతికి ఉన్నంత కాలము అగ్ని హోత్రము చేయాలి. ఇది కూడా కామ్యకర్మే. సంతానం కావాలి అని కోరుకొనే వారు పుత్ర కామేష్టి యాగం చేస్తారు. వర్షాలు పడాలని కోరుకొనే వారు మేఘ మథనాన్ని కాంక్షిస్తూ వరుణ యాగం చేస్తారు. పుత్ర కామేష్టికి వర్షాలు పడవు. వరుణ యాగం చేస్తే పిల్లలు పుట్టరు. దేని ఫలితం దానిదే. అలాగే ఆయా కర్మల్ని ఆచరించడానికి నిర్దేశింప బడిన నియమాలను అనుసరించాలి. ఆయా కర్మలకు సంబంధించిన దేవతలను తృప్తి పరచే ఆరాధనలూ సాగించాలి. ఎవరు దేనిని ఆశిస్తూ కర్మకాండను సాగిస్తున్నారో, ఆ కర్మకాండకు సంబంధించిన జప హోమ దానాదులను అవశ్యం నిర్వహించాలి. ఎవరు ఏ కర్మకాండను చేస్తారు? ఏ దేవతను ఆశ్రయిస్తారు? అనే దానిని నిర్ణయించేది మాత్రం వారి వారి స్వభావమే. అదే ప్రకృతి. స్వీయప్రకృతి. స్వకీయ పూర్వాభ్యాస వాసన చేత ఏర్పడిన స్వభావమే ప్రకృతి (***ప్రకృత్యా నియతాః స్వయా***).

కర్మలు ఏవైనా, వాటిని ఆచరిస్తే ఫలితాలు రాక పోవు. వస్తాయి. అలాగే పోతాయి. వచ్చిపోయే ఫలితాలు మనస్సును గ్రుచ్చే సూదులే గాని, హృదయానికి ఊరట నిచ్చే శాంతి కుసుమాలు మాత్రం కావు. ధర్మార్థ కామాలనే త్రివర్గాలకు సంబంధించిన అనిత్య ఫలాలే గాని, పరమ పురుషార్థ మైన మోక్షమనే అమృత ఫలం మాత్రం కాదు.

*ఎవరిలో ఏ కోరిక లున్నా, ఎవరు ఏ దేవతలను ఆరాధించినా, ఫలితం మాత్రం పరమేశ్వరుణ్ణి నుండే రావాలి. కర్మఫల ప్రదాత పరమేశ్వరుడే గాని, దేవతలు కారు. చదవండి.*

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధ యార్చితు మిచ్ఛతి । 21
తస్య త స్యాచలాం శ్రద్ధాం తా మేవ విదధా మ్యహమ్ ॥

*యః-యః-యాం-యాం-తనుం-భక్తః-శ్రద్ధయా-అర్చితుం-ఇచ్ఛతి*
*తస్య-తస్య-అచలాం-శ్రద్ధాం-తాం-ఏవ-విదధామి-అహం*

| | | | |
|---|---|---|---|
| యః యః | = ఏయే | తస్య తస్య | = వాని వానికి |
| భక్తః | = భక్తుడు | అహం | = నేను |
| యాం యాం తనుం | = ఏయే దేవతా రూపమును | తాం అచలాం | = చలనము లేని |
| శ్రద్ధయా | = శ్రద్ధతో | శ్రద్ధాం ఏవ | = శ్రద్ధారూపమునే |
| అర్చితుం | = ఆరాధించుటకు | విదధామి | = కలిగిస్తాను |
| ఇచ్ఛతి | = కోరుచున్నాడో | | |

**అర్జునా! ఎవడు ఏ దేవత నైనా భక్తితో ఆరాధించనీ. అతడు విశ్వాసంతో చేసే ఆ పూజకు కావలసిన అచంచల మైన శ్రద్ధను నేనే కలిగిస్తాను.**

### వ్యాఖ్య

## దైవ ప్రేమ

నీడ ఏదైనా, అది ఏదో ఒక నిజాన్నే ప్రతిబింబిస్తూ ఉంటుంది. నీడలో ఉండేది ప్రతిరూపమే, ప్రతిబింబమే. కాని, అది ఒక రూపానికి ప్రతిరూపము. ఒక బింబానికి ప్రతిబింబము.

అందరికీ నిజాలే చేజిక్కవు. అలాంటి వారు నీడల్ని ఆశ్రయించడం తప్పు కాదు. వారి శక్తి నీడల వెంట పడటానికే సరిపోతుంది. నిజం ముందు నిలబడే శక్తి ఉంటే, నీడల్ని ఎందుకు అనుసరిస్తారు? అందరూ ప్రపంచంలో శక్తిమంతులు కారు. యుక్తిమంతులు కారు. అలాగని, వారందరూ కాని వారు కారు. కావాలని కోరుకునే వారే. సాధించాలనే తపన ఉన్న వారే. కాకపోతే, తీరు తెలియని వారు. జాడ ఎరుగని వారు. అలాంటి వారు సానుభూతికి అర్హులు.

జ్ఞానం కలిగే వరకు మనుషుల మనస్సులలో నమ్మకాలే ఉంటాయి. ఎవరి నమ్మకం వారిది. నమ్మకాలు మనస్సులలో అలా ఉండటం వెనుక ఎంతో నేపథ్యం ఉంది. నియతి ఉంది. ఎవరి నమ్మకాన్ని కూడా చెడగొట్ట కూడదు. ఎవరి నమ్మకంలో వారిని కొనసాగ నివ్వాలి. చేయూత నిచ్చి ముందుకు నడపాలే గాని, మార్గానికి అడ్డు నిలిచి వెనుకకు మరలించ కూడదు. అలా చేస్తే వెను దిరిగిన వాళ్ళు తమపై తామే నమ్మకాన్ని పోగొట్టు కుంటారు. అదే జరిగితే, లేనిది లేకపోగా ఉన్నది కూడా ఊడిన ట్లవుతుంది. నేను బోధించేది సత్యమే కదా అని నువ్వు అనుకోవచ్చు. కాని, ఆ సత్యాన్ని జీర్ణించుకునే శక్తి ప్రక్క వారికి ఉందా, లేదా? అనేది కూడా చూసుకోవాలి. అదే జ్ఞాని లక్షణం.

**న బుద్ధి భేదం జనయేత్ అజ్ఞానాం కర్మ సంగినామ్**

అర్జునా! జ్ఞాని ఎప్పుడు కూడా కర్మల యందు ఆసక్తి గల అజ్ఞానుల బుద్ధిని కలత పెట్టకూడదు అని మూడవ అధ్యాయం లోనే భగవంతుడు చెప్పాడు. ఆయన విశాల ప్రేమ హృదయానికి ఈ వాక్యం అద్దం పడుతుంది. బ్రహ్మాండాన్ని బొజ్జలో నింపుకున్న వాడు బుజ్జి బుజ్జి మాటలు పలకడానికి వెనుకాడ లేదు. గీత పలికిన వాడే గోకులంలో గోల చేసిన గోపాలుడు. పారం తెలియని ఆ ప్రేమసాగరాన్ని ఔపోసనం పట్టడం ఎవరికి సాధ్యం? ఏమంటున్నాడో చూడండి!

అర్జునా! ఏ భక్తుడు ***(యః భక్తః)*** ఏ దేవతారూపాన్ని ***(దేవతా తనుం)*** శ్రద్ధావంతుడై ***(శ్రద్ధయా సంయుక్తః)*** పూజించాలని కాంక్షిస్తాడో ***(అర్చితుం పూజయితుమ్ ఇచ్ఛతి)*** అట్టి కామికి ***(తస్య కామినః)*** నిశ్చల మైన శ్రద్ధను ***(అచలాం స్థిరాం శ్రద్ధాం)*** అనుగ్రహిస్తాను ***(విదధామి).***

## మూర్తి ఏదైనా శక్తి తనదే

భక్తి ఏదైనా ప్రగతి సూచకమే గాని పతన హేతువు కాదు. ప్రస్తుత శ్లోకంలో భక్తుడు సకామ భక్తుడు. శ్రద్ధ కల వాడు కనుక భక్తు డయ్యాడు. శ్రద్ధ లేకుండా కోరే వాడు కామి అవుతాడే గాని భక్తుడు కాలేడు.

ఇక్కడ తనువు అంటే దేవతా రూపం. భక్తులు దేవతా మూర్తుల్ని ఆరాధిస్తారు. అదే దేవతా రూపం. దేవతా శరీరము. దేవత లెవరు కూడా వాసుదేవుని కన్నా వేరుగా లేరు. వర్షాన్ని వరుణుడు ప్రసాదించ వచ్చు. కానీ, వరుణుని లోని శక్తి వాసుదేవునిదే.

స్వభావ ప్రేరణ చేత సకామ భక్తులు దేవతా రూపాలను ఆరాధించినా, ఆ ఆరాధనకు కావలసిన శ్రద్ధను తానే స్థిరీకరింప చేస్తున్నాడు భగవంతుడు. దేవతల్ని విడిచి పెట్టి దేవుడ నైన నన్ను ఆరాధించు అనలేదు.





అనడు. ***వాసుదేవః సర్వ మితి*** అనే జ్ఞానానికి సిద్ధంగా లేని వారిని కలవర పెట్టడు పరమేశ్వరుడు.

సకామ భక్తుడే అయినా, అతనికి శ్రద్ధ ఉంది. భక్తి ఉంది. నేడు కాకపోయినా, ఏదో ఓనాడు ఆ భక్తి శ్రద్ధలు పరమాత్మ వైపు తిరుగుతాయి. కామిగా నేడు కనిపించే వాడు రేపు మోక్షకామి కావచ్చు. అవకాశం ఇవ్వడమే అనుగ్రహము.

ఎవరిలో ఏది ఉంటే, దానికి ప్రోత్సాహ మివ్వడమే దైవ గుణం. నిరుత్సాహ పరచడం అసుర లక్షణం.

విత్తు వేప అయినా, చింత అయినా, మిరప అయినా, మామిడి అయినా, అది పెరగడానికి శక్తి నిచ్చేది మాత్రం జలమే. జలం శక్తి నిస్తుంది. విత్తనంలో ఏదుంటే అదే మొలకెత్తుతుంది. పెంచే శక్తి మాత్రం జలానిదే.

ఎవరు ఏ దేవతను ఆరాధించినా, అలా ఆరాధించడానికి అనువైన శ్రద్ధ పరమేశ్వరుని ప్రసాదమే. శ్రద్ధను తానే స్థిర పరుస్తాను అంటున్నాడు భగవంతుడు ***(విదధామి స్థిరీ కరోమి).*** శ్రద్ధను స్థిరపరచడ మంటే ఏమిటి? ఆరాధనా ఫలాలను అనుగ్రహించడమే. ఏ భక్తి శ్రద్ధలతో భక్తుడు దేవతారాధన చేశాడో, ఆ అర్చన ఫలం అంది నప్పుడు అతని భక్తి శ్రద్ధలు కూడా ఇనుమడిస్తాయి. అలా వృద్ధి చెందే భక్తి శ్రద్ధలు ఒక దశలో వివేకాన్ని సంతరించుకొని వాసుదేవుని వైపు తిరుగుతాయి.

*కర్మలు ఫలితాలను చూడకపోవు. ఆరాధనలు కూడా కర్మలే కనుక అవశ్యం ఫలితాలను చూస్తాయి. అదే తరువాత శ్లోకం.*

**స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే ।**
**లభతే చ తతః కామా న్మయైవ విహితాన్హి తాన్ ॥** 22

***స-తయా-శ్రద్ధయా-యుక్తః-తస్య-ఆరాధనం-ఈహతే***
***లభతే-చ-తతః-కామాన్-మయా-ఏవ-విహితాన్-హి-తాన్***

| | | | | | |
|---|---|---|---|---|---|
| సః | = | వాడు | తతః చ | = | అనంతరము |
| తయా | = | అట్టి | మయా ఏవ | = | నా చేతనే |
| శ్రద్ధయా | = | శ్రద్ధతో | విహితాన్ | = | నిర్ణయింపబడిన |
| యుక్తః | = | కూడినవాడై | తాన్ | = | ఆ |
| తస్య | = | ఆ దేవత యొక్క | కామాన్ | = | కోరికలను |
| ఆరాధనం | = | పూజను | లభతే హి | = | పొందుతాడు |
| ఈహతే | = | చేయా లనుకుంటాడు | | | |

**అర్జునా! శ్రద్ధావంతు డైన కామ్య భక్తుడు దేవతా మూర్తిని అర్చిస్తాడు. ఆరాధనా ఫలాన్ని ఆ దేవత నుండే పొందుతాడు. వాస్తవానికి ఆ ఫలితా న్నిచ్చేది నేనే.**

### వ్యాఖ్య

## కర్మఫల ప్రదాత పరమేశ్వరుడే

జన్మాంతర సంస్కారము చేత ఏర్పడిన స్వభావాన్ని అనుసరించి, ఈశ్వరానుగ్రహము చేత ప్రాప్తించిన శ్రద్ధతో కామ్య భక్తులు దేవతా మూర్తులను ఆరాధిస్తారు. ఏయే కోరికల చేత భక్తులు ఆరాధించడం జరిగిందో, వారి ఆరాధనతో తృప్తి చెందిన దేవతలు ఆయా ఫలాలను అనుగ్రహించడం జరుగుతుంది. ఫలితాలను అందించేది దేవతలే అయినా, ఇచ్చేది మాత్రం పరమేశ్వరుడే.

ప్రభుత్వ కార్యాలయంలో ఉద్యోగుల వేతనాలను బట్వాడా చేసేది కార్యాలయ అధికారే అయినా, జీతం ఇచ్చేది మాత్రం ప్రభుత్వమే. కార్యాలయం లోని ఉద్యోగు లందరికీ నెలసరి జీతాలు తానే ఇచ్చే శక్తి అధికారికి ఎలా వస్తుంది? ప్రభుత్వం ఇచ్చిందే అధికారి ద్వారా అందుతుంది.

కర్మఫలాలను సర్వులకు అందించాలి అంటే, ఈశ్వరత్వం ఉండాలి. సర్వజ్ఞత్వం ఉండాలి. స్వతంత్ర శక్తి ఉండాలి. సర్వ శక్తిమత్వం ఉండాలి. ఇవన్నీ దేవతలకు ఎలా వస్తాయి? దేవతలకు ఆత్మత్వం లేదు. ఈశ్వరత్వం లేదు. సర్వజ్ఞత్వం లేదు. కనుక, సర్వజ్ఞుడు, సర్వ శక్తిమంతు డైన పరమేశ్వరుని నుండే ఏ ఫలాలైనా అందాలి *(మయైవ పరమేశ్వరేణ సర్వజ్ఞేన విహితాన్).* కర్మఫలాలు అందరికీ అందాలి అంటే, అనుగ్రహించే వానికి అఖండ జ్ఞానం ఉండాలి. అఖండ జ్ఞానము అనేది ఒక్కడికి ఉంటుందే గాని పది మందికి, లేదా దేవత లందరికీ ఉండే అవకాశం లేదు. అందుకే ***ఏకో బహూనాం యో విదధాతి కామాన్*** - అందరి కోర్కెలను తీర్చేవాడు అద్వయుడు అన్నది ఉపనిషత్తు.

అందుచేత కామ్య భక్తులు ఏ దేవతా మూర్తిని అర్చించినా, ఆ అర్చన పరమేశ్వరునికే అందుతుంది. అందుకున్నది పరమేశ్వరుడే కనుక, తిరిగి ఫలితాన్ని ఇచ్చేది కూడా ఆ మహితాత్ముడే. దేవతారాధనలో దేవతలే ప్రధానంగా కనిపిస్తూ ఉండినా, పరమేశ్వరుని సన్నిధి మాత్రం చేతనే అదంతా సాధ్యపడుతూ ఉంది.

***సర్వా అపి దేవతా మమైవ మూర్తయః, తదారాధన మపి వస్తుతః మమ ఆరాధనమ్ ఏవ, తత్తత్ ఫలదా తాపి చాహ మేవ,*** దేవత లందరూ భగవంతుని వివిధ రూపాలే. దేవతలను ఆరాధించడము వాస్తవానికి పరమేశ్వరుని ఆరాధించడమే. ఆయా కర్మలకు ఫలాలను ప్రసాదించేది కూడా పరమేశ్వరుడే అని శ్రీధర వ్యాఖ్య.

ఫలితం దేవతల ద్వారా అందినట్లు అనిపించినా, వాస్తవానికి దేవతాంతర్యామి అయిన పరమేశ్వరుని నుండే ఫలితం అందుతుంది. ఈ సత్యం అర్థం గాక, కామ్యభక్తులు పరమేశ్వరుని ఆరాధించకుండా అన్య దేవతలను అర్చిస్తూ ఉంటారు. పరమేశ్వరుని ఆరాధించక పోయినా, దేవతా మూర్తులు తన కన్నా అన్యంగా లేనందున పరమేశ్వరుడే కర్మఫలాలను అనుగ్రహిస్తూ ఉన్నాడు. వీరిలో శ్రద్ధ ఉండటమే అట్టి అనుగ్రహానికి కారణము.

పాపాత్ములు, బుద్ధిహీనులు అయిన నీచ మానవులు వివేక శూన్యులై పరమేశ్వరుని ఆరాధించరు అని ఈ అధ్యాయం లోనే పదహైదవ శ్లోకంలో భగవంతుడు పేర్కొనిన వారికి, ప్రస్తుత శ్లోకంలో కనిపిస్తున్న కామ్య భక్తులకు ఎంతో తేడా ఉంది. ఈ కామ్య భక్తులు శ్రద్ధ కలిగిన వారు. కాని వారు అలా కాదు. నాస్తికులు. మాయ చేతిలో కీలుబొమ్మలు. పరమేశ్వరుని ఆశ్రయించక పోవడము అనేది ఇరువురిలో కనిపిస్తూ ఉండినా, శ్రద్ధ అనే ఒకే ఒక్క ప్రత్యేక లక్షణం చేత కామ్య భక్తులు పరమేశ్వర అనుగ్రహానికి పాత్రు లయ్యారు. శాస్త్రముపై విశ్వాసమే శ్రద్ధ. అన్య దేవతారాధనకు సంబంధించిన కర్మకాండ అంతా వేదం లోనే ఉంది. దానిని విశ్వసించే వారు శ్రద్ధ కలిగిన వారు కనుక దేవతల నారాధిస్తున్నారు.

ఈ శ్లోకంలో చివర ***విహితాన్ హితాన్*** అని కొందరు గ్రహిస్తే, ***విహితాన్ హి తాన్*** అని మరి కొందరు గ్రహించారు. ***విహితాన్ హి తాన్*** అనే పదచ్ఛేదాన్ని అనుసరించి మనం విశ్లేషించుకొని వ్యాఖ్యానించాం. అలా కాకుండా, ***విహితాన్ హితాన్*** అని గ్రహిస్తే, హితము లైన కామాలు, అంటే ఇష్టమైన భోగ్య వస్తువులు అని అర్థం వస్తుంది. అయిష్ట మైన భోగ్య వస్తువులను ఎవ్వరూ వాంఛించరు కదా! కామాల యందు హితత్వాన్ని ఆరోపించడం అసమంజసం. కామాలు వాస్తవానికి ఎవ్వరికీ హితాలు కావు *(న హి కామాః హితాః కస్యచిత్).*





కోరిక ఏదీ హితం కాదు. తీరినా హితం కాదు. తీరక పోయినా హితం కాదు. తీరని కోరిక దుఃఖాన్ని పంచుతుంది. తీరిన కోరిక తీరి గతించి పోతుంది. గతించేవి, గగ్గోలు పెట్టించేవి హితా లవుతాయా?

*దీనిని బట్టి మనకు ఏమి అర్థమైంది? దేవతల నారాధించి కోర్కెలను తీర్చుకొని, అనిత్య ఫలాలను పొంది సాధించే దేమీ ఉండదు. పరమేశ్వరుని ఆరాధించిన వారికే మోక్ష మనే నిత్యఫలం సిద్ధిస్తుంది. చదవండి.*

**అన్తవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్ ।**
**దేవా న్దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి ॥** 23

***అంతవత్-తు-ఫలం-తేషాం-తత్-భవతి-అల్పమేధసాం***
***దేవాన్-దేవయజః-యాంతి-మద్భక్తాః-యాంతి-మాం-అపి***

| | | | |
|---|---|---|---|
| దేవయజః | = దేవతలను పూజించు వారు | అంతవత్ తు | = అంతము గలది |
| దేవాన్ | = దేవతలను | భవతి | = అవుతుంది |
| యాంతి | = పొందుచున్నారు | మద్భక్తాః అపి | = నా భక్తులైతే |
| అల్పమేధసాం | = స్వల్పబుద్ధి గల | మాం | = నన్ను |
| తేషాం | = వారి యొక్క | యాంతి | = పొందుచున్నారు |
| తత్ ఫలం | = లభించెడి ఆ ఫలము | | |

**పార్థా! అల్ప బుద్ధి కల వాళ్ళు అనిత్య ఫలాన్నే పొందుతారు. దేవతల్ని అర్చించే వాళ్ళు దేవతల్నే పొందుతారు. నా భక్తులు నన్నే పొందుతారు.**

**వ్యాఖ్య**

కప్ప ఎగురుతుంది. చేప ఎగురుతుంది. నెమలి ఎగురుతుంది. పక్షి ఎగురుతుంది. అన్నీ ఎగురుతాయి. ఎంత ఎత్తుకు ఎగురుతాయి అనేది ఎగిరే వాటి శక్తిని బట్టి ఉంటుంది.

పరమేశ్వరుని ఆరాధించే శక్తి అందరికీ ఉండదు. పరమేశ్వరుని ఆరాధించడం ఉత్కృష్ట మైనదే కావచ్చు. కాని, శక్తి లేనపుడు ఉత్కృష్ట మైనా ఉద్ధరించ లేదు. అందుకుంటేనే ఆనందం. అందనపుడు అందిన అన్య మార్గాలే శరణ్యం. అనంత ఫలాన్ని అనుగ్రహించే పరమేశ్వరుని అర్చించే అర్హత లేనపుడు, అంతవంతాలే అయినా, అన్య దేవతలనే భక్తులు ఆరాధిస్తారు. ఆరాధనా ఫలాలను పొందుతారు. అలా వారు పొందే ఫలా లన్నీ అంతం కలిగినవిగా ఉంటాయి. స్వల్ప కాలం ఉంటాయి. అల్పంగా ఉంటాయి. అట్టి అల్ప ఫలాల వెంటబడి పోయే వారు అల్పబుద్ధులు.

**అల్ప బుద్ధులు**

ఎవరి బుద్ధి అల్పంగా ఉంటుందో వారు అల్ప మేధసులు. అల్ప బుద్ధి గల వారు అల్పాన్ని కోరుతారే గాని అనంతాన్ని కోరుతారా? అల్పాన్ని కోరే అల్ప మేధసులు అల్పమైన ఫలాలనే పొందుతారు. అల్పమైన ఫలాలు ఏవైనా, స్వల్పకాలం ఉంటాయే గాని స్థిరంగా ఎప్పటికీ ఉండవు. అందుచేతనే అల్ప బుద్ధులు పొందే ఫలాలు అంతవంతాలు అంటున్నాడు *(అంతవత్ వినాశి).*

అల్పబుద్ధులై, అంతవంతము లైన ఫలాలను గ్రహించే భక్తులు అన్య దేవతారాధకులు. దేవతలను ఆరాధించే ఈ కామ్య భక్తులు, దేవతలు అనుగ్రహించే ఫలాలనే పొందుతారు. ఆరాధనా ఫలంగా దేవతల్ని పొందుతారు.

**అల్ప ఫలాలు**

దేవతలు అల్పమైన పరిధి గల వారు. వరుణుడికి సూర్యలోకం పై పట్టు లేదు. సూర్యుడికి వరుణ లోకంపై పట్టు లేదు. ఎవరి పరిధి వారిది. అలాగే ఎవరి శక్తి వారిది. మానవుల కన్నా దేవతలు శక్తివంతులు కావచ్చు. దేవతలలో కూడా తరతమ భేదాలు ఉన్నందున, వారు కూడా అల్ప శక్తివంతులే గాని అనంత శక్తివంతులు కారు. పైగా సర్వాధికారము లేని వారు. అలాంటి వారిని నమ్ముకొని ఆరాధిస్తే, అల్పశక్తివంతు లైన ఆ దేవతలు అల్ప ఫలాలను, అంటే నశించే ఫలాలను *(అన్తవత్ ఫలం)* ఇవ్వగలరే గాని అనంత ఫలాన్ని ఇవ్వలేరు.

దేవతలు అనుగ్రహించే ఫలాలు ఏవైనా, అవి కాలంలో అంది కాలంలో కనుమరు గవుతాయి కనుక అవి అనిత్యాలు. పరిమిత ఫలాలే కనుక, పరిమితంగా ఉండి నశించి పోతాయి. దేవతలు దేశ పరిచ్ఛేదానికి లోబడిన వారు. ఇంద్రుడు చంద్ర లోకంలో లేడు. చంద్రుడు ఇంద్ర లోకంలో లేడు. వీళ్ళిద్దరూ బ్రహ్మ లోకంలో లేరు.

ఆయా దేవతల్ని ఉపాసిస్తూ యజ్ఞ యాగాది కర్మలను అనుష్ఠిస్తే, తద్వారా స్వర్గాది లోకాలు ప్రాప్తించ వచ్చు. లోక మేదైనా పరిమిత మైనదే కనుక, దేవతోపాసనా ఫలంగా పర లోకాలు సిద్ధించినా, పుణ్యం క్షీణించ గానే ఆయా లోకాలను వీడి మర్త్య లోకానికి తిరిగి రావలసి ఉంటుంది. కనుక, పరలోక ఫలాలు కూడా నశించేవే.

***స యో హైతా నన్తవత ఉపాస్తే అన్తవన్తం స లోకం జయతి । అథ యోహైతా ననన్తా నుపాస్తే అనంతం స లోకం జయతి*** - అంతవంతు లైన దేవతలను ఉపాసించే వారు అంతవంతము లైన లోకాలనే పొందుతారు. అనంతు డైన వానిని ఉపాసించే వారు అనంతమైన లోకాన్నే పొందుతారు అన్నది వేదం. అనంత లోకం అనేది ఉండదు. అవగాహన కొరకు వ్యావహారికంగా అలా చెప్పడం జరిగింది.

**అనంత ఫలం**

అల్పశక్తి గల దేవతా మూర్తులను ఉపాసించే వారు అల్ప మేధసు లైన కామ్య భక్తులు. పరమేశ్వరుని ఆరాధించే వారు నిత్యభక్తులు. అల్పబుద్ధు లైన కామ్యభక్తులు అంతం కలిగిన ఫలితాలను పొందితే, పరమేశ్వరుని ఆశ్రయించిన వారు అనంత ఫలాన్ని అందుకుంటారు.

దృశ్య వస్తువులను కోరే వారు దేవతోపాసకులు. దృగ్విషయాన్ని అభిలషించే వారు భగవద్భక్తులు. ***దృక్ బ్రహ్మ - దృశ్యం మాయ.*** దృశ్యాలు మాయా రూపాలు. కనుక, నశించి పోతాయి. **దృక్** బ్రహ్మ స్వరూపము కనుక అవినాశి.

దృశ్య ప్రపంచాన్ని ఆశించే వారు అసత్తును త్యాగం చెయ్యలేరు. సత్తును గ్రహించనూ లేరు. మాయను వదల్లేరు. మహిమను పట్టుకోలేరు. రెండిటికి సమర్థం కాని బుద్ధి వారిది. అందుకే వారు అల్ప బుద్ధులు. అల్ప ఫలాలను, అంతం కలిగిన ఫలాలను పొందుతారు. సేవ అల్పదృష్టితో ఉన్నందున వారు అల్ప ఫలాలనే పొందుతారు.

ఈశ్వర భక్తులు అకామ భక్తులు. వారి సేవ మహత్తర మైంది. సేవ మహత్తర మైనపుడు ఫలం కూడా మహత్తరం గానే ఉంటుంది. ***మహత్సేవాం ద్వారమాహు ర్విముక్తేః*** - మహత్తర మైన సేవ ముక్తికి ద్వారము అన్నది శాస్త్రం. ముక్తియే అనంత ఫలం. ఈ విధంగా దేవతల నారాధించే వారు దేవతలను పొందుతూ ఉంటే, భగవద్భక్తులు భగవంతుణ్ణే పొందుతున్నారు.





*మరి, అల్పబుద్ధులు పరమేశ్వరుణ్ణి ఎందుకు ఆశ్రయించడం లేదు? చెబుతున్నాడు.*

**అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మా మబుద్ధయః ।**
**పరం భావ మజానన్తో మ మావ్యయ మనుత్తమమ్ ॥** 24

*అవ్యక్తం-వ్యక్తిం-ఆపన్నం-మన్యంతే-మాం-అబుద్ధయః*
*పరం-భావం-అజానంతః-మమ-అవ్యయం-అనుత్తమం*

| | | | |
|---|---|---|---|
| అవ్యయం | = అవ్యయ మైనది | అబుద్ధయః | = అవివేకులు |
| అనుత్తమం | = సర్వోత్తమ మైనది | అవ్యక్తం | = అవ్యక్తమైన |
| పరం | = పరమై నది | మాం | = నన్ను |
| మమ | = నా యొక్క | వ్యక్తిం | = వ్యక్తి గాను |
| భావం | = స్వభావమును | ఆపన్నం | = ఆపదను బొందిన వానిని గను |
| అజానంతః | = ఎరుగని | మన్యంతే | = తలుస్తున్నారు |

**పార్థా! నా స్వరూపము నశించనిది. మహోన్నత మైంది. ఉత్కృష్టమైంది. ఇది తెలియని బుద్ధిహీనులు నేను అవ్యక్తంగా ఉండి వ్యక్త మయ్యానని భావిస్తారు.**

**వ్యాఖ్య**

**రూపము - స్వరూపము**

మన కళ్ళకు కనిపించేవి, చెవులకు వినిపించేవి, మనస్సుకు అనిపించేవి మాత్రమే వాస్తవాలని మనం భావిస్తాము. అంతకు మించి దేనిని విశ్వసించాలన్నా సందేహిస్తూనే ఉంటాం. ఈ కారణం గానే ఎన్నో అద్భుత మైన సత్యాలు వ్యక్తుల బుద్ధులలో ఇమడలేక దూరమౌతూ ఉంటాయి.

భగవంతుణ్ణి కూడా మన అనుభవాలలో నుండి అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాం. మానవ సంబంధాల కోణం నుండి భగవ త్సంబంధాన్ని అర్థం చేసుకోవడం కష్టం.

మనకు దేహ ముంది. దీని నెవ్వరూ కాదనడం లేదు, కానీ మనం అలా అనుకోవడం లేదు. నాకు దేహం ఉంది అని భావించడం లేదు. నేనే దేహము అని భావిస్తున్నాం. దేహం నాకు ఉంది, నాదిగా ఉన్న దేహం చరించడానికి ఆత్మ నైన నేను ఆధారంగా ఉన్నాను అనే జ్ఞానం మనకు లేదు.

మనిషి తాను దేహము అని భావిస్తున్నాడు కనుక భగవంతునికి కూడా దేహ ముంది అని భావిస్తాడు. తాను పుట్టినట్లు చెబుతున్నాడు కనుక భగవంతుడు కూడా పుట్టినట్లు భావిస్తాడు. ఈ విధంగా తన బుద్ధికి అందిన అవగాహన తోనే సరిపెట్టుకొని సత్య నిర్దేశం చేయడానికి ప్రయత్నించడం సత్యానికి దూరంగా పోవడమే అవుతుంది.

భగవంతుడు రూపంతో కనిపించ వచ్చు. కాని, రూపానికి అతీతంగా ఉండే స్వరూపమ్ము కూడా తానే. రూపం కనిపిస్తుంది. స్వరూపం కనిపించదు. కనుక, తెలిసి రాదు. పరమేశ్వరుణ్ణి రూపం నుండి వేరు చేయలేము. అలాగని రూపానికే పరిమితం చేయలేము. కనిపించే వన్నీ తానే. కనిపించనిది కూడా తానే. ఈ అపూర్వ సమ్మేళనం బుద్ధికి అందదు. కనుకనే, భగవంతుని యొక్క అర్థం కేవలం రూపం లోనే గాక దానికి ఆధార మైన, సమస్తానికి సారభూతమైన చైతన్యము లోనే ఉంది. ఇది అర్థం కాని వారు బుద్ధిశూన్యులు అంటే, వివేకము లేని వారు. అవివేకులు. బుద్ధి లేని వారు అంటే అసలే బుద్ధి లేని *(అబుద్ధయః అవివేకినః)*.

వారు అని కాదు, బుద్ధిలో వివేకము లోపించిన వారు అని అర్థము. అతడు తల లేని వాడు అంటూ ఉంటారు. దాని అర్థం అతనికి తల లేదు అని కాదు. అది సరిగా పని చేయడం లేదు అని అర్థం.

**దైవం తెలియకనే దేవతోపాసన**

మనిషి తాను దేహము అని భావించడం చేత, తాను ఆత్మ అని ఎలాగైతే గ్రహించలేక పోతున్నాడో, అలాగే శ్రీకృష్ణుని కూడా వ్యక్త రూపంగా భావిస్తున్నందున అతడు సత్య జ్ఞానానంద స్వరూపు డైన పరబ్రహ్మము అని గ్రహించలేక పోతున్నాడు. మానవ దేహంలో గోచరిస్తున్నందున తమ కోర్కెలు తీర్చే శక్తి లేని వాడని భావించి, లోకాధిపతు లైన దేవతల్ని వాంఛా ఫలసిద్ధికి ఆశ్రయిస్తూ ఉన్నారు. ఇది అవివేకము.

వివేకము లేని వారు ***(అబుద్ధయః)*** పరమేశ్వరుడు ఏదో లోకంలో అవ్యక్తంగా, పరోక్షంగా ఉండి, భక్తులను ఉద్ధరించడానికి ప్రత్యక్షంగా వ్యక్త మైనట్లు భావిస్తారు ***(అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే)***. కారణం, వారికి పరమేశ్వరుని యొక్క అద్వితీయ స్వరూపము తెలియక పోవడమే ***(పరం భావం ఆత్మ స్వరూపమ్ అజానన్తః)***. ఆత్మయే పరమాత్మ అనే బ్రహ్మాత్మ జ్ఞానము లేని కారణంగా, లోకాంతర వాసుడు మానవ లోకంలో వ్యక్త మైనట్లు భావిస్తున్నారు.

పరమేశ్వరుని యొక్క అఖండాత్మ స్వరూపం అర్థమైతే, దుర్యోధనుడు పరమేశ్వరుణ్ణి సభలో బంధించే ప్రయత్నం చేస్తాడా? బాలకృష్ణుణ్ణి వధించి రమ్మని కంస భూపతి రాక్షసుల్ని పంపుతాడా? కృష్ణుని కార్యాన్ని భగ్నం చేయాలని ఇంద్రుడు వడగళ్ళ వాన కురిపిస్తాడా? పరమేశ్వరుని స్వరూప వైభవం తెలిస్తే, కామ్య భక్తులు అన్య దేవతోపాసన చేస్తారా? పరమేశ్వరుని అవతార వైభవం తెలియని మూర్ఖులు, తనను దేహధారిగా భావిస్తారు అని తొమ్మిదవ అధ్యాయంలో కూడా పరమాత్మ చెబుతాడు ***(అవజానన్తి మాం మూఢాః మానుషీం తను మాశ్రితమ్)***. తెలియక పోవడం వల్లనే ఇదంతా జరుగుతూ ఉంది కనుక, వివేకవంతులు తెలుసుకొనే ప్రయత్నం చేయాలి. పరమేశ్వరుని ఏ స్వరూపమును తెలియక కామ్య భక్తులు అన్య దేవతోపాసన చేస్తున్నారు? ఈ అవివేకం నుండి బయట పడాలి అంటే, పరమేశ్వరుని స్వరూపమును ఏమని తెలుసుకోవాలి?

**తెలియదు - తెలుసుకోవాలి**

పరమేశ్వరుడు అవ్యయుడు. అంటే వ్యయం కాని వాడు ***(మమ భావం స్వరూపం అవ్యయం వ్యయ రహితం)***. వినాశము లేని వాడు. వికారము తెలియని వాడు. కనుక అవ్యయుడు. ఒక కాలంలో ఏదైతే ఆకారం కలిగి ఉంటుందో, అదే వికారం చెందుతుంది. వికార స్వభావం కలది నశించి పోతుంది. రూపం లేనిది మార్పు చెందదు. కుండ రూపంతో ఉంది. కుండ నశిస్తుంది. కాని మట్టి నశించదు. కుండ ఉండటానికి కారణ మైన మట్టి కుండ పగిలిన తరువాత కూడా ఉంది. అవ్యయంగా ఉంది. పరమేశ్వరుని స్వరూపాన్ని కూడా అలాగే అర్థం చేసుకోవాలి.

అవ్యయు డైన పరమాత్మ అనుత్తముడు. సర్వోత్తమ మైన వాడు. తనకు మించిన ఉత్తముడు మరొకడు లేని వాడు ***(అనుత్తమమ్, అవిద్యమానః ఉత్తమో యస్మాత్ సః అనుత్తమః)***. తనకు సమానుడే లేడు. ఇక తనను మించిన వాడు ఎలా ఉంటాడు? అని గీతాచార్యుడే పదకొండవ అధ్యాయంలో చెబుతాడు. ఇలా పరమేశ్వరుని స్వరూప వైభవాన్ని తెలుసుకున్న వారు అన్య దేవతారాధనలు మాని, బ్రహ్మమునే తెలుసుకొని బ్రహ్మమై శోభిస్తారు.

*ఇలా పరమేశ్వరుని తెలుసుకోక పోవడం అనే అజ్ఞానానికి కారణ మేమిటి? దానినే చెబుతోంది తరువాత శ్లోకం.*





**నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః ।**
**మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్ ॥** 25

*న-అహం-ప్రకాశః-సర్వస్య-యోగమాయా సమావృతః*
*మూఢః-అయం-న-అభిజానాతి-లోకః-మాం-అజం-అవ్యయం*

| | | | |
|---|---|---|---|
| అహం | = నేను | లోకః | = లోకము |
| యోగమాయా సమావృతః | = యోగమాయచే ఆవరించబడి | మాం | = నన్ను |
| సర్వస్య | = అందరికి | అజం | = పుట్టుక లేని వానినిగ |
| ప్రకాశః న | = కనపడే వాణ్ణి కాను | అవ్యయం | = అవ్యయునిగ |
| మూఢః | = వివేకశూన్య మైన | న అభిజానాతి | = ఎరుగడు |
| అయం | = ఈ | | |

**అర్జునా! నేను ఎవ్వరికీ కనిపించను. యోగమాయ బుద్ధిని కప్పేసుంది. నేను పుట్టుక లేని వాణ్ణి. నశించని వాణ్ణి. ఈ తెలివితక్కువ లోకం నన్ను తెలుసుకోలేదు.**

**వ్యాఖ్య**

**అయోమయం**

పరమేశ్వరుడు ఎక్కడున్నాడు? ఈ దశలో ఈ ప్రశ్నకు మీరే సమాధానం చెప్పగలరు. భగవంతుడు అంటూ ఉంటే, అతడు అంతటా ఉండే వాడై ఉండాలి. మరి, అంతటా ఉండేవాడు ఎందుకని తెలిసి రాడు? అనేది ప్రశ్న.

భగవంతుడు తెలియడం లేదు అంటే, భగవంతుడు లేకపోవడం చేత తెలియడం లేదు అని కాదు. ప్రపంచములో ఉన్న వాడే అయినా, అర్థం కాకపోవడం చేత తెలియడం లేదు. ఎవరికి? అర్థం గాని వారందరికీ. ఎవరో జ్ఞానులకు తప్ప మిగిలిన వారెవ్వరికీ భగవంతుడు అర్థం కావడం లేదు ***(న అహం ప్రకాశః సర్వస్య లోకస్య)***.

సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. గ్రుడ్డి వాళ్ళకు సూర్యుడు ఉన్నా లేనట్లే. అంధులు సూర్యుని చూడలేనట్లే, తెలివి తక్కువ లోకం పరమేశ్వరుని తెలుసుకోలేక పోతూ ఉంది ***(మూఢః లోకః అయం న అభిజానాతి)***. కళ్ళున్న వారు సూర్యుని చూడగలిగినట్లే, జ్ఞాను లైన భక్తులు పరమేశ్వరుని తెలుసుకుంటారు అని ఈ సందర్భంలో శ్రీ శంకరులు వ్యాఖ్యానించారు ***(కేషాం చిదేవ మద్భక్తానాం ప్రకాశః అహమ్ ఇత్యభిప్రాయః)***. దృష్టి లోపం వల్ల అంధులు సూర్యుని ఎలా చూడలేరో, వివేకం లోపించడం చేత మూఢులు పరమేశ్వరుని గ్రహించ లేరు. కారణం, వారందరిని మాయ కప్పేసింది. అదే యోగమాయ.

**మాయా మయం**

యోగమాయ ఎవరిని కప్పింది? ఎవరి నైనా కప్పుతుంది. యోగము అంటే గుణాల సంయోగము. అదే యోగమాయ ***(యోగః గుణానాం యుక్తిః న ఏవ మాయా యోగమాయా)***. అది తన మాయే నని పరమేశ్వరుడే చెప్పాడు కదా ***(మమ మాయా)***.

బుద్ధిలో త్రిగుణాలు నిండి ఉన్నందున, మాయా రూపాలైన త్రిగుణాలు బుద్ధిని కప్పేస్తూ ఉన్నాయి. అందువల్ల పరమాత్మ దర్శనం నిరోధింప బడుతూ ఉంది. అంధత్వము ఎలాగైతే గ్రుడ్డి వానికి సూర్య దర్శనాన్ని నివారిస్తూ ఉందో, అలాగే త్రిగుణమిళిత మైన మాయ సర్వేశ్వర దర్శనానికి అడ్డుపడుతూ ఉంది.

అంతేకాదు, మాయను తన అధీనంలో ఉంచుకున్న మాయావి ఈశ్వరుడు కూడా ఎవ్వరికీ కనిపించకుండా మాయా ముసుగును కప్పుకున్నాడు. తాను అందరినీ చూస్తూ తానెవ్వరికీ కనిపించకుండా ఉన్నాడు.

ఇదొక మహామాయ. ఈశ్వరమాయ. పరమేశ్వరుని గారడి. గారడి చేసే వాడు ఎలాగైతే మనల్ని భ్రాంతికి గురి చేస్తాడో, ఈశ్వరుడు కూడా ప్రపంచ గారడిలో మనల్ని మాయకు గురి చేస్తాడు. సృష్టిలో ఏది కాదు గారడి? ఉన్నది ఒకటైతే, మరొకటి కనిపించడం, కనిపించిన దానిని గూర్చి విచారించ గానే అది లేనిది కావడం గారడి లోని ప్రత్యేకత. అదే మాయ.

విశ్వంలో కాల ముంది. కాల మేమిటి? అని ప్రశ్నిస్తే కాలం ఉండదు. ఆభరణం కనిపిస్తుంది. అదేమిటి? అని విచారిస్తే, ఆభరణం ఉండదు. స్వర్ణమే ఉంటుంది. ఇదే మాయ. యోగమాయ. ఈ మాయను అడ్డు పెట్టుకొని పరమేశ్వరుడు అయోగ్యులకు అగుపించడు. ఈ మాయలో పడి అవివేకులు పరమేశ్వరుని దర్శించలేక పోతారు.

*జీవేశ్వరు లిరువురిని మాయ ఆవరించినా, దాని ప్రభావం జీవుల మీద ఉందే గాని, ఈశ్వరునిపై లేదు. చదవండి.*

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ 26

*వేద-అహం-సమతీతాని-వర్తమానాని-చ-అర్జున*
*భవిష్యాణి-చ-భూతాని-మాం-తు-వేద-న-కశ్చన*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = అర్జునా! | | | | |
| అహం | = నేను | వేద | = | ఎరుగుదును |
| సమతీతాని | = నశించినవి | మాం తు | = | మరి నన్ను |
| వర్తమానాని చ | = ప్రస్తుతము ఉన్నవి | కశ్చన | = | ఒక్కడును |
| భవిష్యాణిచ | = ఇక రాబోవునవి | న వేద | = | ఎరుగడు |
| భూతాని | = జీవులను | | | |

**అర్జునా! గతంలో ఉన్న వాళ్ళు నాకు తెలుసు. ప్రస్తుతం ఉన్నవాళ్ళూ తెలుసు. భవిష్యత్తులో ఉండబోయే వాళ్ళు కూడా నాకు తెలుసు. నన్ను మాత్రం ఎవ్వరూ తెలుసుకో లేరు.**

**వ్యాఖ్య**

**సర్వ జ్ఞానము**

మనం దేనిని తెలుసుకున్నా, ఉన్నప్పుడే తెలుసుకుంటాం. ఏది ఉన్నప్పుడు? తెలియబడేది ఉన్నప్పుడు. అంతే కాదు, తెలుసుకొనేది కూడా ఉండాలి. అప్పుడే తెలుసుకోవడం జరుగుతుంది. అంతటితో సరిపోదు. తెలియబడేది తెలుసుకొనే దానికి అందుబాటులో ఉండాలి. అప్పుడే తెలియడం, తెలుసుకోవడం జరుగుతాయి. ప్రస్తుతం తెలియబడేది ఏదో, ఏమిటో తెలియడం లేదు గాని, తెలుసుకొనేది మాత్రం మనస్సే అని తెలుస్తూ ఉంది. దేని నైనా మనం మనస్సు తోనే తెలుసుకుంటాం. మనస్సు లేనపుడు తెలుసుకోవడం జరగదు. మనస్సు ఉండినా, ఉండ వలసిన విధంగా ఉండ నపుడు కూడా తెలుసుకోలేము. ఈ కారణం చేత పరిమితంగా గోచరిస్తున్న మనస్సుకు ఏది తెలిసినా, పరిమితం గానే ఉంటుంది అని తెలిసి పోయింది.





పరమేశ్వరుడు కూడా, నాకు తెలుసు అంటున్నాడు. ఏమి తెలుసు అంటే, అన్నీ తెలుసు అంటున్నాడు. అన్నీ అంటే ఉన్న వన్నీ అని అర్థము. ఉన్న వన్నీ అంటే ఎప్పుడున్నవి? ఎక్కడున్నవి? అనే ప్రశ్నలు పడతాయి. భూత భవిష్య ద్వర్తమానాలలో ఉన్న వన్నీ తెలుసు అంటున్నాడు. అన్ని చోట్ల ఉన్నవీ తెలుసు అంటున్నాడు. గతంలో ఉండినవి **(సమతీతాని)**, ఇప్పుడు ఉన్నవి **(వర్తమానాని)**, ఇక రాబోయేవి **(భవిష్యాణి)** అన్నీ తెలుసు అంటున్నాడు. ఇంతకీ ఏమిటవి? భూతాలు **(భూతాని)**. భూత భవిష్య ద్వర్తమానాలలో ఉన్న వన్నీ తనకు తెలుసు. గతంలో ఉన్న వారు నేడు లేరు. నేడున్న వారు భవిష్యత్తులో ఉండబోరు. భవిష్యత్తులో ఉండబోయే వారు వర్తమానంలో లేరు. అయినా అందరూ తనకు తెలుసు అంటే, అన్ని కాలాలలో తాను ఉండాలి. అంతే కాదు, సమస్తాన్ని సర్వ కాలాలలో తెలుసుకొనే శక్తిని కలిగి ఉండాలి. ఇట్టి సర్వజ్ఞానాన్ని మన లాగా పరిమితా లైన ఇంద్రియ మనస్సులతో తెలుసుకొనే అవకాశం లేదు కనుక, సర్వమును తెలుసుకొనే పరమేశ్వరుడు జ్ఞానరూపుడై ఉండాలి. సర్వజ్ఞుడై ఉండాలి. తన సహజ స్వరూప జ్ఞానం చేత తెలుసుకో గలగాలి **(స్వాభావిక బోధేన)**. అన్నిటిలో ఉండి, అన్ని కాలాలలో ఉండే వాడై ఉండాలి. కాలరూపుడై ఉండాలి. కాలాతీతుడై ఉండాలి.

కాలము చైతన్యము కన్నా వేరుగా లేదు. కాలము విచిత్ర మైంది. అన్నీ కాలం లోనే ఉంటాయి. కాలము చైతన్యము నాశ్రయించుకొని ఉంటుంది. కాలము లేకపోయినా చైతన్యము ఉంటుంది. అదే చైతన్యము యొక్క కాలాతీత స్థితి. అదే పరమాత్మ. చైతన్యాత్మ.

కనుక, భూతాలన్నీ కాలంలో ఉంటాయి. కాలంలో పోతాయి. భూతా లన్నీ ఏ కాలంలో అయితే కదుల్తూ ఉంటాయో, ఆ కాలం కూడా కరిగి పోతుంది. కాని, కాలాధిష్ఠాన చైతన్యము కాలం లోను, కాలాతీతం గాను కళకళ లాడుతూనే ఉంటుంది. కనుక, సర్వజ్ఞుడైన సర్వేశ్వరునికి అన్నీ తెలుసు **(సర్వం జానాతీతి సర్వజ్ఞః)**.

**మాయ - మాయావి**

ప్రపంచం పరమేశ్వరునిపై ఆధారపడి ఉంది కనుక అది మిథ్య. మాయా స్వరూపం. యోగ మాయచే బద్ధు లైన వారు జీవులు. మాయను తన అధీనంలో ఉంచుకున్న మాయావి పరమేశ్వరుడు.

మాయలో చిక్కుకున్న వారు మాయను ఏమి తెలుసుకుంటారు? మాయనే తెలుసుకోలేని వారు, మాయకు ఆధారభూతు డైన మాయావిని ఎలా తెలుసుకుంటారు? అర్జునా! నన్ను ఎవ్వడు కూడా తెలుసుకో లేడు అని అర్థము. ఇక్కడ లేడు **(మాం తు వేద న కశ్చన)**. ఎంత గొప్ప పాండిత్యము కల వాడైనా తెలుసుకో లేడు అని అర్థము. ఇక్కడ ఆచార్యుల వారు భాష్యంలో, **మాం తు వేద తు న కశ్చన, మద్భక్తం మచ్ఛరణం ఏకం ముక్త్వా** - నేనే ఏకైక శరణ్యంగా కలిగిన నా భక్తుడు తప్ప మరెవ్వరూ నన్ను తెలుసుకో లేరు అని వ్యాఖ్యానించారు.

కొలనులో కమలం దగ్గరే ఉన్నా, కమలం లోని మకరందాన్ని కప్ప ఎలా జుర్రుకో లేదో, అలాగే సర్వత్ర పరమేశ్వరుని చైతన్యమే వ్యాపించి యున్నా, మాయలో చిక్కుకున్న వారు గ్రహించ లేరు.

పరమేశ్వరుడు తాను అందరినీ, అన్ని కాలాలలో ఉన్న వారిని తెలుసుకుంటాడు. కాని, తనను మాత్రము ఏకాంత భక్తులు తప్ప మరెవ్వరూ తెలుసుకో లేరు. అంతఃపురం లోని మహారాణి అందరినీ చూస్తూ ఉంటుంది. ఆమె మాత్రం ఎవ్వరికీ కనిపించదు. అలాగే పరమేశ్వరుడు కూడా.

**అహం విజానామి వివిక్త రూపో న చాస్తి వేత్తా మమ చిత్సదాఽహం**

నేను ఏకన్నై సమస్తాన్ని తెలుసుకుంటాను. నన్ను తెలుసుకొనే వాడు లేడు. నేను సదా జ్ఞానస్వరూపుణ్ణి అని ఉపనిషత్తు.

మాయా మోహితులకు సర్వగతు డైన పరమేశ్వరుడు అగుపించడు. అగుపించినా అర్థం కాదు. నేటి ప్రపంచంలో, ముఖ్యంగా రాజకీయ రంగంలో ముఖ్య నాయకుడు మండలి సమావేశాల్లో నల్ల కళ్ళజోడు పెట్టుకొని కూర్చుంటాడు. సభ్యులను అతను చూస్తూనే ఉంటాడు. అతడు కూడా సభ్యులకు కనిపిస్తాడు. కాని, అర్థం కాదు. అతడు ఎటు దృష్టిని సారిస్తున్నాడో, ఎవరిని చూస్తున్నాడో అసలే అర్థం కాదు. అదొక మాయా విలాసము. సులభంగా అర్థం కావడానికి దృష్టాంతంగా చెప్పాను. అంతే. మాయగాళ్ళను మాయావితో పోల్చానని భ్రమించకండి. దృష్టాంతము ఏకదేశీయమే అనేది మీకు తెలియంది కాదు.

*యోగమాయ లోని ఏ ప్రతిబంధకాలు పరమేశ్వర జ్ఞానానికి అడ్డు తగుల్తున్నాయి? చెబుతున్నాడు.*

ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వన్ద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప ॥ 27

**ఇఛ్ఛాద్వేష సముత్థేన-ద్వంద్వమోహేన-భారత**
**సర్వభూతాని-సమ్మోహం-సర్గే-యాంతి-పరంతప**

| | | | |
|---|---|---|---|
| భారత | = అర్జునా! | సర్వభూతాని | = సర్వప్రాణులను |
| సర్గే | = పుట్టుక యందు | సమ్మోహం | = సమ్మోహమును |
| ఇచ్ఛాద్వేష సముత్థేన | = ఇష్టానిష్టముల వలన బుట్టిన | యాంతి | = పొందుచున్నవి |
| ద్వంద్వమోహేన | = సుఖదుఃఖ స్వరూపమయిన ద్వంద్వమోహముల చేత | పరంతప | = అర్జునా! |

**పరంతపా! పుట్టుక తోనే సర్వ ప్రాణులు సుఖదుఃఖాదుల మోహంలో కూరుకు పోతున్నాయి. భారతా! ఈ మోహానికి రాగద్వేషాలే కారణము.**

### వ్యాఖ్య

పరమేశ్వర స్వరూపాన్ని గ్రహించలేక పోవడానికి ప్రతిబంధకా లేమిటి? అనే విషయాన్ని ఈ శ్లోకంలో స్పృశిస్తున్నాడు.

సర్వభూతాలు *(సర్వ భూతాని)* పుట్టినప్పుడే *(సర్గే)* మోహములో కూరుకు పోయాయి *(సంమోహం యాన్తి).* ఈ మోహ మేమిటి? అదెలా కలిగింది? ఈ మోహము ద్వంద్వముల వలన కలిగింది *(ద్వంద్వ మోహేన).* శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, జయాపజయాలు, మానావమానాలు - ఇవే ద్వంద్వములు. ద్వంద్వముల కారణంగా గల మోహం ద్వంద్వ మోహం *(ద్వంద్వ నిమిత్తః మోహః ద్వంద్వ మోహః).* సుఖదుఃఖాలు, వాటి హేతువుల యందు విపరీత బుద్ధిని కలిగి ఉండటమే మోహము. ఈ విధమైన మోహం కలగటానికి ఇచ్ఛాద్వేషాలే కారణము. ఇచ్ఛాద్వేషాలే రాగద్వేషాలు. సుఖదుఃఖాలు, వాటి కారణాలు సంభవించి నపుడు రాగద్వేషాలు పుడుతాయి. అలా జనించిన రాగద్వేషాలు ప్రాణుల వివేకాన్ని హరించి, పరమేశ్వరుని స్వరూపాన్ని గ్రహించడానికి ప్రతిబంధకాలుగా నిలుస్తాయి. జ్ఞాన ప్రతిబంధానికి రాగద్వేషాలు భయంకర హేతువులు. ఆచార్యుల వారు భాష్యంలో ఒక చక్కని వాక్యాన్ని అందిస్తారు.

***న హి ఇఛ్ఛాద్వేష వశీకృత చిత్తస్య యథా భూతార్థ విషయ జ్ఞానమ్ ఉత్పద్యతే బహిః అపి?*** - రాగద్వేషాలు నిండిన మనస్సు గల వారికి బాహ్యంలో ఉండే లౌకిక విషయాలకు సంబంధించిన జ్ఞానమే ఉన్నదున్నట్లు కలుగదు కదా! అలాంటప్పుడు ఆత్మజ్ఞాన విషయంలో రాగద్వేషాల కారణంగా యదార్థ జ్ఞానము కలగదు అని ప్రత్యేకంగా చెప్పాలా? అన్నారు. ఇది అక్షరాలా సత్యం.





### రాగద్వేషాలు

ఏ మనసైనా, ఎవరి మనసైనా రాగద్వేషాలు కొట్టే సమ్మెట పోట్లతో ముక్కలై ఉంటుంది. జీవితం ఊహించని విధంగా అనేక మలుపులు తిరగటానికి రాగద్వేషాలే ప్రధాన కారణాలుగా ఉంటాయి. బ్రతుకును భయంకరంగా మార్చేవి కూడా రాగద్వేషాలే. నీరు గుంటలో నిలిచినట్లు రాగద్వేషాలు మనస్సులో నిలిచి ఉంటాయి.

రాగద్వేషాలు ఏవో కావు. ఇష్టాయిష్టాలే రాగద్వేషాలు. మనకు ఏది ఇష్టమో దానిని పొందాలను కుంటాము. ఎవరంటే మనకు ప్రియమో వారితో కలిసి ఉండాలని అభిలషిస్తాము. ఇదే రాగము.

ఏదంటే మనకు అయిష్టమో దానిని దూరం చేసుకుంటాము. ఎవరంటే మనకు అప్రియమో వారికి దూరంగా ఉంటాము. ఇదే ద్వేషము.

దగ్గరై సుఖాన్ని పంచిన రాగము దూరమై దుఃఖాన్ని కలిగిస్తుంది. దగ్గరుండి దుఃఖాన్ని కలిగించిన ద్వేషం దూరమై సుఖ పెడుతుంది. రాగద్వేషా లనే ఈ ద్వంద్వమే జ్ఞాన మార్గంలో ప్రతిబంధకము. ద్వంద్వమే వాస్తవానికి బంధము.

రాగద్వేషాల కారణం గానే సుఖదుఃఖాలు కలుగుతున్నాయి. మనకు సుఖదుఃఖాలను పంచే శక్తి ప్రపంచానికి లేదు. మన లోని రాగద్వేషాలే ప్రపంచం లోని విషయాలను ప్రియాలుగా, అప్రియాలుగా చూపిస్తున్నాయి.

### అఖ్యాయిక

'అయ్యా! అయ్యా! మీ కుక్క మా కుక్కను కరిచింది' అని బాధ పడుతూ ఇరుగింటి ధనికుడితో మొర పెట్టుకున్నాడు పొరుగింటి సామాన్య వ్యక్తి.

అది విని, 'ఏంటయ్యా, మరీ విడ్డూరంగా మాట్లాడుతావు! కుక్కను కుక్క కాకపోతే మనిషి కరుస్తా డటయ్యా? దానికి మళ్ళీ ఫిర్యాదు చెయ్యాలా? పైగా మాది జాతి కుక్క. మీది ఊరి కుక్క. మీ కుక్క ఏమీ చెయ్యకుండానే, మా కుక్క కరిచి ఉంటుందా?' అన్నాడు ఆ ధనికుడు.

ఈ లోగా ఫిర్యాదు చేస్తున్న వ్యక్తి తమ్ముడు వచ్చి, 'అన్నయ్యా! నువ్వు విన్నది నిజం కాదు. చెప్పిన వాడు గాబరాలో ఒకటి చెప్పబోయి మరొకటి చెప్పాడు. కరిచింది అయ్యగారి కుక్క కాదు. మన కుక్కే అయ్యగారి కుక్కను కరిచింది' అన్నాడు.

అంతే. ధనికుడు వారిపై విరుచుకు పడ్డాడు. 'నా కుక్కను కరిచిందా? ఖరీదైన నా కుక్కను ఒక ఊరి కుక్క కరిచిందా? ఏం మనుష లయ్యా మీరు? ఆ మాత్రం బుద్ధి ఉండక్కర్లేదా! కుక్కను అదుపు చేసుకో లేని వాళ్ళు దానిని పెంచుకోవడ మెందుకు?' అంటూ తెగ రెచ్చి పోయాడు. పోలీసులకు ఫిర్యాదు చేస్తా నంటూ బెదిరించాడు.

రాగద్వేషాల ఊబిలో కూరుకు పోయిన వ్యక్తికి కళ్ళు చూస్తున్నా మనస్సు మూసుకు పోయి ఉంటుంది. మనస్సు పని చేసినా బుద్ధి పని చేయదు. తూర్పు పడమరలకు తేడా తెలియదు. బ్రతుకులు బాధల పాలు కావడానికి రాగద్వేషాలే ప్రబల కారణాలు.

ప్రపంచంలో వ్యక్తులు, వస్తువులు ఉన్నాయి గాని అవి సుఖాలుగా, దుఃఖాలుగా లేవు. మన రాగద్వేషాలే వస్తువుల్ని ప్రియాలుగా అప్రియాలుగా మార్చుతున్నాయి. మనుషుల్ని ఇష్టులుగా అయిష్టులుగా నిర్ణయిస్తున్నాయి.

ఈ నిర్ణయా లన్నీ రాగద్వేషాలకు సంబంధించినవే గాని విషయాలకు సంబంధించినవి కావు. విషయాలకు సంబంధించినవే అయితే, ఒకరికి ఇష్టమైన వ్యక్తి అందరికీ ఇష్టుడు కావాలి. ఒకరు మెచ్చిన విషయాన్ని అందరూ మెచ్చుకోవాలి. కాని, మన అనుభవం ఇందుకు భిన్నంగా ఉంది. ఒకరు మెచ్చుకుంటూ ఉంటే మరొకరు నొచ్చుకుంటూ ఉన్నారు. ఒకరు ఇష్టపడింది మరొకరికి కష్టంగా ఉంది. ఈ మాత్రం విశ్లేషణతో రాగద్వేషా లనేవి వ్యక్తిగత మైనవి అని ఖచ్చితంగా చెప్పవచ్చు.

ఎవరు ఏది చూచినా రాగద్వేషాల కళ్ళజోడు నుంచే చూస్తారు. అందుచేత, ఎవరి మనస్సులో ఏది ఉందో దానినే ప్రపంచంలో చూస్తారు గాని, ప్రపంచాన్ని ఉన్నదున్నట్లుగా చూడరు. ఇక మనిషికి ప్రపంచం ఏమి అర్థ మవుతుంది? అర్థం గాని ప్రపంచం దుఃఖ పెట్టే దేముంటుంది? సుఖపెట్టే దేముంటుంది? ఎవరి సుఖాని కైనా, లేదా ఎవరి దుఃఖాని కైనా బాహ్య ప్రపంచం కారణం కానే కాదు. వ్యక్తి ఆంతర్యంలో తయారు చేసుకున్న రాగద్వేషాల ప్రపంచమే కారణము. ఇదే మోహం. ప్రత్యేకంగా ఇప్పుడు మనం తయారు చేసుకున్నది కాదు. పుట్టుక తోనే వచ్చింది *(సర్గే సమోహం యాన్తి).*

పూర్వ కర్మానుసారంగా శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వాలలో రాగద్వేషాలు సంభవిస్తున్నాయి. కొందరికి పుట్టుక తోనే చన్నీళ్ళ స్నానం ఇష్టం. కొందరికి వేడినీళ్ళ స్నానమే ఇష్టం. ఇవే జన్మాంతర సంస్కారాలు. అందుచేత, సర్వ ప్రాణులు జన్మ లోనే మోహంలో కూరుకు పోతున్నాయి అంటున్నాడు భగవంతుడు.

రాగద్వేషాల వలన ఏర్పడిన మోహము జ్ఞానానికి ప్రతిబంధకం. రాగద్వేషాల వల్లనే ప్రపంచానికి సంబంధించిన వాస్తవ జ్ఞానం కలగడం లేదు. రాగము ఆవేదనకు, ఆందోళనకు కారణ మైతే, భయ హేతువుగా ద్వేషం చెలరేగి పోతోంది. రజ్జువులో సర్పాన్ని చూచి భయపడటానికి కారణం మోహమే. వాస్తవ జ్ఞానం కలగకుండా రాగద్వేషాలే ప్రతిబంధకాలుగా నిలుస్తున్నాయి. ఆచార్యుల వారు చెప్పినట్లు, ప్రపంచం విషయం లోనే ఇంతగా అవరోధాలను సృష్టించే రాగద్వేషాలు, పరమేశ్వర జ్ఞానాన్ని పొందటానికి ప్రతిబంధకాలు కాకుండా ఉంటాయా? ఈ విషయంలో సందేహమే అవసరం లేదు. రాగద్వేషాల కారణంగా శాస్త్ర ప్రమాణం కూడా కొందరి విషయంలో ఫలించకుండా పోతూ ఉంది.

శాస్త్రము ప్రామాణికంగా అద్వైతాన్ని ప్రతిపాదిస్తున్నా, కొందరికి అద్వైతమే గిట్టదు. కొందరికి కర్మ ముచ్చటే గాని జ్ఞానం పట్టదు. కొందరు అశాస్త్రీయ వాదనలు వినిపిస్తూ ఉంటారు. వీరందరి వెనుక ఉన్నవి రాగద్వేషాలే. ఇలాంటి వారికి శాస్త్రము ప్రతిపాదించే జ్ఞానామృతం కన్నా, రాగద్వేషాలు పంచే అజ్ఞాన విషమే రుచిగా ఉంటుంది. ఈ రుచులు, అభిరుచులు ఒక స్థాయిలో శాస్త్రాన్నే నిరాకరించే స్థితికి చేరుస్తాయి. అలాంటి వారికి జ్ఞాన మెలా కలుగుతుంది? ఈ ప్రతిబంధకం రాగద్వేషాల ప్రభావం కాదా?

**దృశ్యన్తే హి పురుషాః రాగాది గౌరవాత్ శాస్త్రం అతిక్రామన్తః**

రాగద్వేషాలకు ప్రాధాన్యత నిచ్చి కొందరు శాస్త్రాన్నే ధిక్కరిస్తూ ఉంటారు అన్నారు బృహదారణ్యకోపనిషత్ భాష్యంలో శ్రీ శంకరులు.

జ్వర పీడితునికి పాయసం కూడా వేపరసం లాగే ఉంటుంది. ఎంత మధుర పదార్థ మైనా రోగికి ఎలా రుచించదో, రాగద్వేషాలతో నిండిన బుద్ధికి జ్ఞానం రుచించదు. ఈ విధంగా రాగద్వేషాలు మోహాన్ని సృష్టించి మోక్షానికి ప్రతిబంధకాలుగా నిలుస్తున్నాయి.

ఈ శ్లోకంలో పరమాత్మ అర్జునుణ్ణి రెండు సార్లు పేరు పెట్టి పిలిచాడు. భారతా! అని శ్లోకం పూర్వార్థంలో సంబోధించి, ఉత్తరార్థంలో పరంతపా! అని పిలిచాడు. రాగద్వేషాల విషయంలో కలత చెందకు అనే ఓదార్పు





ఇలా రెండు నామాలతో సంబోధించడం వెనుక పరమేశ్వరుని అభిమతంగా తెలుస్తూ ఉంది.

అర్జునా! నువ్వు భరత వంశంలో పుట్టిన వాడివి. భరత వంశం జ్ఞానంలో ప్రకాశించేది. **భా దీప్తౌ** - 'భా' అంటే ప్రకాశించేది. అదే జ్ఞాన ప్రకాశము. అట్టి జ్ఞాన ప్రకాశంలో నువ్వు రతుడవు, అంటే ప్రకాశించే వాడివి. నిన్ను ఈ రాగద్వేషాలు అడ్డుకోగలవా? భయపడకు.

అర్జునా! నువ్వు పరంతపుడివి. **తప సంతాపే** - 'తప' అంటే తపింప చేసేది. శత్రువులను తపింప చేసే వాడివి కనుక నువ్వు పరంతపుడివి. అర్జునా! నీ రెండు పేర్లు ఇలా ఉన్నాయి. రాగద్వేషా లనే ద్వంద్వాన్ని నిర్మూలించి, నిరంజన రూపుడనై భాసించు అని నీ రెండు నామాలే నీకు చెబుతున్నాయి అనేది పరమాత్మ హృదయం.

పుట్టుక చూస్తే భరతవంశము. పౌరుషం చూస్తే పరంతపుడవు. శత్రువులను తపింప చేసి పరంతపుడ వయ్యావు కదా! ఇక అంతశ్శత్రువు లైన ఈ రాగద్వేషాలను కూడా అంత మొందించి సార్థక నామధేయుడవు కా! భరత వంశమున ఆవిర్భవించిన ఓ భారతా! పరంతపుడవై చెయ్యవలసింది చెయ్యి! ఆ తరువాత భారతుడవై **వాసుదేవ స్సర్వమితి** అనే వైభవాన్ని దర్శించు.

*అజ్ఞాన జనిత మైన ఈ మోహ జాడ్యం నుండి విముక్తిని పొందే వారిని గూర్చి చెబుతున్నాడు.*

**యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।**
**తే ద్వన్ద్వమోహ నిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥** 28

*యేషాం-తు-అంతగతం-పాపం-జనానాం-పుణ్యకర్మణాం*
*తే-ద్వంద్వమోహ నిర్ముక్తాః-భజంతే-మాం-దృఢవ్రతాః*

| | | | |
|---|---|---|---|
| పుణ్యకర్మణాం | = సత్కర్మలను జేయు | ద్వంద్వ మోహనిర్ముక్తాః | = ద్వంద్వ మోహము చేత విడువబడినవారై |
| యేషాం | = ఏ | దృఢవ్రతాః | = దృఢవ్రతులై |
| జనానాం | = జనుల యొక్క | మాం | = నన్ను |
| పాపం తు | = పాపము | భజంతే | = సేవిస్తారు |
| అంతగతం | = పరిహరింప బడిందో | | |
| తే | = వారు | | |

**అర్జునా! పుణ్య కార్యాలు చేసే వాళ్ళు పాపాలను పోగొట్టుకుంటారు. స్థిరమైన జ్ఞానాన్ని పొందుతారు. రాగద్వేషాల మోహం నుండి విడిపడి నన్నే సేవిస్తారు.**

**వ్యాఖ్య**

ద్వంద్వ మోహానికి వశ పడకుండా, పరమేశ్వర స్వరూపాన్ని తెలుసుకొని, పరమేశ్వరుని సేవించే వారెవరు? ఈ సందేహాన్ని నివారిస్తూ ప్రస్తుత శ్లోకం సాగుతోంది. మనస్సు లోని పాపాలను పూర్ణంగా పోగొట్టుకున్న వారు, ద్వంద్వ మోహం నుండి విడిపడ్డ వారు, దృఢవ్రతులై పరమాత్మనే భజిస్తారు అని శ్రీ భగవానువాచ.

**దురితక్షయము**

రోగం నయమై నపుడే మనిషి ఆరోగ్యవంతుడై, కార్యోన్ముఖు డవుతాడు. మనిషి హృదయంలో పాపం తొలగి నపుడే మనిషి సుకృతాత్ముడై పరమేశ్వరుని ఆరాధనలో చరిస్తాడు. పాపాన్ని లోపలే ఉంచుకొని ఎంతగా సాధన చేసినా, మోక్ష మార్గంలో సాధన సాగకుండా పాపమే అడ్డు తగుల్తూ ఉంటుంది. జ్ఞానానికి పాపం ప్రతిబంధకమై కూర్చుంటుంది.

**జ్ఞానం నోత్పద్యతే పుంసాం పాపోపహత చేతసామ్!**

పాపం చేత ఉపహత మైన చిత్తం కల వారికి జ్ఞానము కలగదు అని స్మృతి వాక్యము. 'ఉపహతం' అంటే కొట్టబడింది, లేదా నశించింది అని అర్థము. పాపి పాపిగా ఉంటూ మోహం నుండి విడిపడ లేడు. ద్వంద్వ మోహ విముక్తి కలగాలి అంటే, పాపం ప్రక్షాళనం కావాలి. పాపం పుణ్య కర్మల ద్వారా క్షీణిస్తుంది. జ్ఞానం చేత నశిస్తుంది. పుణ్య కర్మలు చేస్తే పాపము అంతమౌతుంది *(అన్తగతం సమాప్త ప్రాయం).*

*అంతగతం* అంటే సమాప్త ప్రాయం అని శ్రీ శంకర భాష్యము. సమాప్త ప్రాయం అంటే పాపక్షయం అని అర్థము *(సమాప్త ప్రాయం క్షీణ పాపం).* సమాప్తం అంటే పూర్తి అయింది అని అర్థము. సమాప్త ప్రాయం అంటే పూర్తి కావచ్చింది అని భావం. ఈ రెండిటి యొక్క తేడాను బాగా అర్థం చేసుకోవాలి. జ్ఞానం తోనే పాపం సమూలంగా సమాప్తం అవుతుంది. ప్రస్తుతము వీరు జ్ఞానాన్ని పొంది ముక్తులు కాలేదు. ఇంకా జ్ఞానాభ్యాసం లోనే ఉన్నారు. కనుక పాపం అంతమైంది. సమాప్తం అనకుండా పాపం అంతగత మైంది, సమాప్త ప్రాయమైంది అనడం జరిగింది.

పాపం ఎలా అంతగత మౌతుంది? ఎలా క్షీణిస్తుంది? పుణ్య కర్మల ద్వారానే పాపం క్షయిస్తుంది. ***యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ -*** యజ్ఞము, దానము, తపస్సు మొదలైన పుణ్య కర్మలు బుద్ధిమంతుల్ని పవిత్రం చేస్తాయి అని గీతాచార్యుడే పద్దెనిమిదవ అధ్యాయంలో చెబుతాడు.

దానధర్మాలు, జప ధ్యానాలు, పరోపకారాది సేవలు - ఇవన్నీ పుణ్యాన్ని కలిగిస్తాయి. కాయ పెరుగుతూ ఉంటే పూల రేకులు రాలిపోయినట్లు, పుణ్యము పెరుగుతూ ఉంటే, పాపం క్షీణిస్తూ ఉంటుంది. ***ధర్మేణ పాప మపనుదతి -*** ధర్మ జీవనము పాప క్షయానికి తోడ్పడుతుంది అని ధర్మ శాస్త్రము. పుణ్య కర్మాచరణం చేత పూర్వ జన్మ సంస్కార జనిత పాపాలు క్షీణిస్తూ ఉంటాయి. ప్రస్తుతం ధర్మ జీవనంలో కొనసాగుతూ ఉన్నందున, నూతనంగా పాపం తయారు కాదు. ఇలా పుణ్య కర్మల మధ్య సాధకుడు శీఘ్రంగా పవిత్రతను పొందుతాడు. అందుచేత, పూజ, జప, ధ్యాన, సంకీర్తన, స్వాధ్యాయాది అలౌకిక కర్మలను నిర్విరామంగా కొనసాగిస్తే, పాపనాశను డైన పరమేశ్వరుని దయ చేత పాపం క్షయ మవుతుంది.

**కీర్తితః పూజితో ధ్యాతః స్మృతః పాపరాశిం నాశయన్ పాప నాశనః**

భగవంతునికి పాప నాశనుడు అనే పేరు కూడా ఉంది. అది ఎలా వచ్చిందంటే, మన చేత కీర్తింపబడి, అర్చింపబడి, ధ్యానింపబడి, స్మరింపబడి - ఈ అలౌకిక కర్మలకు ఫలంగా తన దయను వర్షింప చేసి, ఆ పవిత్ర జ్ఞాన జలాల చేత పాప పంకిలాన్ని లేకుండా చేసే వాడు కనుక ఆయన పాపనాశనుడు.

ఈ విధంగా దురితక్షయం జరుగుతుంది. ద్వంద్వ మోహ విముక్తి కలుగుతుంది *(ద్వంద్వ మోహ నిర్ముక్తాః).*

**దృఢ వ్రతము**

దురితక్షయం జరిగి పోయింది కనుక, పవిత్ర హృదయం గల భగవద్భక్తులు దృఢవ్రతులై పరమాత్మను సేవిస్తారు *(భజన్తే మాం దృఢవ్రతాః).* దృఢవ్రతుడు అంటే శాస్త్ర జ్ఞానం నిశ్చయంగా కల వాడు అని భావము.

**ఏక మేవ పరమార్థ తత్త్వం న అన్యథా ఇత్యేవం నిశ్చిత విజ్ఞానాః దృఢవ్రతాః ఉచ్యన్తే।**

పరమార్థ తత్త్వము ఇలాగే గాని మరో విధంగా కాదు అనే సునిశ్చిత మైన జ్ఞానం కల వారు దృఢవ్రతు





లని శ్రీ శంకర భాష్యము. అంటే, బ్రహ్మాత్మ జ్ఞానం దృఢం కావడం. పూర్వ శ్లోకాలలో మనం చూచినట్లు సర్వమూ వాసుదేవుడే అనే అఖండ జ్ఞానము నిశ్చయింప బడటమే దృఢవ్రతము.

ఇది సాధనలో ఒక అందమైన దశ. అవరోధాలు అడ్డగించని, ప్రతిబంధకాలు ప్రతిఘటించని, పాపాలు ప్రయాణాన్ని విరోధించని అద్భుతమైన దశ. పూర్వ పాపం సమాప్తప్రాయం. ప్రస్తుతం పాపాచరణకు ప్రవృత్తి శూన్యం. ఇక లేని పాపం ఏం చేస్తుంది? ***నైనం పాప్మా తపతి -*** పాపం ఇక వారిని బాధించదు అని వేదమాతే అభయ ప్రదానం చేసింది.

*బాగుంది. మరి వాళ్ళు భగవంతుని ఎందుకు భజిస్తారు? భజించి ఏమి పొందుతారు? ఈ విషయాల్ని చివరి రెండు శ్లోకాలలో చర్చించి, అధ్యాయాన్ని సమాప్తి చేస్తున్నాడు.*

**జరామరణ మోక్షాయ మా మాశ్రిత్య యతన్తి యే।**
**తే బ్రహ్మ త ద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్॥** 29

*జరామరణ మోక్షాయ-మాం-ఆశ్రిత్య-యతంతి-యే*
*తే-బ్రహ్మ-తత్-విదుః-కృత్స్నం-అధ్యాత్మం-కర్మ-చ-అఖిలం*

| | | | |
|---|---|---|---|
| యే | = ఎవరు | తత్ బ్రహ్మ | = ఆ పరబ్రహ్మమును |
| మాం | = నన్ను | కృత్స్నం | = సమస్తమయిన |
| ఆశ్రిత్య | = ఆశ్రయించి | అధ్యాత్మం | = ప్రత్యగాత్మను |
| జరామరణ మోక్షాయ | = జరామరణములు పోగొట్టుకొనుటకు | అఖిలం | = సమస్తమయిన |
| యతంతి | = యత్నించుచున్నారో | కర్మ చ | = కర్మమును |
| తే | = వారు | విదుః | = ఎరుగుదురు |

**అర్జునా! జరామరణాలు లేకుండా చేసుకోవాలని భక్తులు నన్నాశ్రయించుకొని భక్తి చేస్తారు. వాళ్ళు బ్రహ్మమును, ప్రత్యగాత్మను, సమస్త మైన కర్మను తెలుసుకుంటారు.**

**వ్యాఖ్య**

వాస్తవాలను విడిచిపెట్టి ఊహల ప్రపంచంలో ఇంతవరకు ఊరేగినాము. అలాగే ఊడిగము చేశాము. ఎంత శోకాన్ని అనుభవించామో, ఎన్ని కన్నీళ్ళు కురిపించామో! శోకాగ్ని చేత కమిలి, కుమిలి గుండె ఎండి పోతోంది. కన్నీ రంతా కారిపోయి కంటిలో తడి ఆరి పోతోంది. ఇంకా ఎంత కాలం ఈ దుఃఖాన్ని అనుభవిస్తాము? దీనికి సమాప్తం ఎప్పుడు? అరువు తెచ్చుకున్న అజ్ఞానం బ్రతుకులో ఇంత దుర్భర మైన కరువును సృష్టించిందా?

చాలు. ఇక చాలు. జరిగిందేదో జరిగి పోయింది. దుఃఖాన్ని భరించే శక్తి ఇక లేదు. శోకాన్ని సెనవేసుకొని ఇక బ్రతక లేము. బాధల నుండి, భయాల నుండి విముక్తి కావాలి. జన్మ జన్మలుగా పోరాడుతూ ఓడి పోయాము. ఓడిపోతూ పోరాడాము. ఇక పోరాడే శక్తి క్షీణించింది. ఓడిపోయే ఓపిక నశించింది. అంతా దుర్భర మైంది. దుర్బల మైంది. దుర్లభం దుర్లభం అంటూ కాలాన్ని దొర్లించుకుంటూ పోతే ఇక లాభం లేదు. పోగొట్టుకున్న సామ్రాజ్యాన్ని తిరిగి రాబట్టుకోవాలి. ఓటమి ఎవరిది అనేది అప్రస్తుతం. విజయం మాత్రం మనదే కావాలి. ఆధారాన్ని చేజిక్కించు కోవాలి. ఏది ఆశ్రయ స్థానమో తెలిసి, మన స్థానాన్ని మనం పదిలం చేసుకోవాలి. దానికి ఏం చేయాలి? అది తెలిసి ఉంటే, ఈ మాయా నాటకానికి ఎప్పుడో తెరపడి పోయేది కదా! తెలియనిది తెలుసు అనుకొంటూ బ్రతుకును అన్యాయం చేసుకోవడం కన్నా, అపార మైన ప్రేమతో దరి చేర్చుకొని, అజ్ఞాన పొరను తొలగించి, జరామరణాల చెర నుండి విడిపించే దయామయుణ్ణి, పరమార్థాన్ని

విప్పి చెప్పి, పరమ పదానికి నడిపించి తరింప చేసే ప్రేమమూర్తిని భక్తితో తనివితీరా దర్శించి, ఐదు పది చేసి, ***కరోతు మే అదభ్రదయో విమోక్షణమ్*** అని ప్రార్థించాలి. ***అదభ్రదయః*** = అపార దయామయుడు, ***మే*** =నాకు, ***విమోక్షణమ్*** = బంధ విముక్తిని, ***కరోతు*** =కలిగించు గాక! అని గజేంద్రుని వలె మనమూ మన మనస్సు లోని మాటను తక్షణమే విజయసారథికి వినిపించాలి. వినిపించారా? చాలు. ఇక అమృతమయ మైన సందేశమును వినిపిస్తాడు. వినండి. అదే విజయ రహస్యం.

అర్జునా! పరమేశ్వరుడ నైన నన్ను ఆశ్రయించి ***(మాం పరమేశ్వరం ఆశ్రిత్య)*** జరామరణాల నుండి విముక్తి కొరకు ప్రయత్నించే వారు ***(జరామరణ మోక్షార్థం యే యతన్తి)*** ఆ బ్రహ్మమును ***(తద్బ్రహ్మ)***, సమస్త మైన ప్రత్యగాత్మను ***(కృత్స్నం అధ్యాత్మం)***, సమస్త కర్మమును కూడా ***(కర్మ చాఖిలమ్)*** తెలుసుకుంటారు ***(విదుః)***.

ఎవరిని ఆశ్రయించాలి? దేని కొరకు ఆశ్రయించాలి? ఆశ్రయించి ఏమి చేయాలి? వీటన్నిటి ఫలితంగా ఏమి పొందాలి? - అన్నీ విస్పష్టంగా వినిపించాడు. ఇక విశ్లేషించుకొని వంట పట్టించుకోవడమే మన ముందు ఉంది.

**ఆశ - ఆశయం**

జరామరణాల నుండి విముక్తిని ఆశించి భక్తులు పరమేశ్వరుని ఆశ్రయిస్తారు. జర అంటే ముసలితనము, వృద్ధాప్యము. మరణము అంటే చావు. భయంకర మైన వృద్ధాప్య మరణాలను భరించలేక, వాటి నుండి విడిపడ టానికి ఏకైక శరణ్య మైన పరమేశ్వరుని ఆశ్రయిస్తారు. జరామరణాలు ఎవరి కైనా అనివార్యాలే.

వయస్సు ముందుకు సాగుతూ ఉంటే ముసలితనం సమీపిస్తూ ఉంటుంది. ముందుకు వెళ్ళొద్దంటే వయస్సు వింటుందా? వెనక్కి వెళ్ళు అంటే మృత్యువు ఒప్పు కుంటుందా? జరిగేవి జరిగి పోతూనే ఉంటాయి.

వయస్సు ముందు కెళ్ళే దెందుకు? ముసలితనంతో ముచ్చటించి, ఆ తరువాత మృత్యువుతో కరచాలనం చేసేందుకే కదా! ఇందులో అసంభవం ఏముంది? తింటూ ఉంటే, ముద్ద ముద్దకీ అన్నం తగ్గి చివరగా పళ్ళెం శూన్య మైనట్లు, అనుభవిస్తూ ఉంటే, రోజు రోజుకీ ఆయువు క్షీణించి బ్రతుకు అంతరించి పోతుంది.

జరామరణాలు అంటే జీవితంలో చరమ దశకు సంబంధించినవి అని చాలా మంది అపోహ పడుతుంటారు. అందుచేత, అదెప్పుడో సంక్రమించే దురవస్థ అని భావిస్తారు. జరామరణాలు అనే ద్వంద్వంలో నిర్ద్వంద్వ మైన రహస్యం ఒకటుంది. జరామరణాలు ఇరుగు పొరుగులే గాని బ్రతుకుకు ఆద్యంతాలు కావు. జనన మరణాలు ఆద్యంతాలు. కనుక మరణం అంటే జనన మరణాలు అని అర్థం. జరా అంటే జరావ్యాధులు అని అర్థం. ఇది వంట పట్టాల్సిన జంట కవిత్వం. జననమరణాలు ఆద్యంతాలుగా ఉంటాయి. జరావ్యాధులు వాటి మధ్యనే ఉంటాయి. ఇదంతా కలిసి సంసారం. సంసార దుఃఖం. మహా భయంకరం. దుర్భర మైన ఈ దుఃఖం నుండి విడిపడా లనేదే అందరి ఆశ, ఆకాంక్ష ***(జరామరణ మోక్షాయ)***. అది నెరవేరడానికి పరమేశ్వరుని ఆశ్రయించడం కన్నా మరో మార్గం లేదు. కనుక పరమేశ్వరుని ఆశ్రయిస్తారు.

**ఆశ్రయం - ఆశీర్వాదం**

జరామరణాల నుండి విముక్తిని పొందడానికి, పరమేశ్వరుని ఆశ్రయించడానికి సంబంధ మేమిటి? జరామరణాలు దేహానికే గాని జీవునికి కాదు. తానేమిటో తనకు తెలియక పోవడం చేత, జరామరణాలు తనకే అని భావించడం జరుగుతూ ఉంది. ఇదే అజ్ఞానము. అజ్ఞానము పోవాలి అంటే జ్ఞానము రావాలి.





జ్ఞానము రావాలి అంటే పరమేశ్వరుని ఆశ్రయించాలి. ఈశ్వరుడు, ఈశ్వర జ్ఞానం వేరు కానందున, ఈశ్వర జ్ఞానాన్ని పొందితే ఈశ్వరుని పొందినట్లే.

ఈశ్వరుడు సర్వాంతర్యామి కనుక, ఈశ్వరుని కన్నా నీవు, నేను వేరుగా లేము. ఈశ్వర జ్ఞానం కలిగితే, జీవుడు ఈశ్వరుడే అనే జ్ఞానం కలుగుతుంది. ఇదే బ్రహ్మాత్మ జ్ఞానము. బ్రహ్మాత్మ జ్ఞానము కలిగితే, తాను దేహానికి పరిమితుడు కాడు అనేది తెలిసి వస్తుంది. తాను దేహం కానపుడు, జనన మరణాలు, జరావ్యాధులు తన కెక్కడున్నాయి? ఈ విధంగా పరమేశ్వరుని ఆశ్రయించుకొని, జ్ఞానము పొందిన వాడు జన్మల నుండి విడిపడి ముక్తుడు అవుతున్నాడు.

***మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే*** - ఎవడు నన్ను పొందుతాడో వాడికి పునర్జన్మ లేదు అని ఎనిమిదవ అధ్యాయంలో భగవంతుడే చెబుతాడు.

**అధ్యయనం - ఆచరణం**

జనన మరణాల నుండి విడిపడ టానికి ఆశ్రయించ దగిన ఒకే ఒక స్థానం పరమేశ్వరుడు. కనుక, పరమేశ్వరుని ఆశ్రయించడం జరిగింది. కేవలం పరమాత్మను ఆశ్రయిస్తే సరిపోదు. ఆశ్రయించిన తరువాత మన ప్రయత్నం మనం చేయాలి ***(యతన్తి ప్రయతన్తే)***. ఇక్కడ ప్రయత్నం అంటే సాధన. పరమేశ్వరుడు జ్ఞానరూపుడు కనుక, ఆయనను తెలుసుకోవడానికి చేసే సాధన జ్ఞానసాధనే కావాలి. ఇదే జ్ఞానాభ్యాసము.

శ్రవణ, మనన, నిదిధ్యాసల చేత పరమేశ్వరుని తత్త్వమును తెలుసుకోవడమే జ్ఞానాభ్యాసము. జ్ఞానాభ్యాస ఫలంగా జ్ఞానరూపు డైన పరమేశ్వరుడు జగత్కారణంగా, సర్వజ్ఞుడుగా తెలుస్తాడు. ఇదే పరమేశ్వరుని ఆశ్రయించడ మంటే. మరి, పరమేశ్వరుని ఆశ్రయించుకొని, పరమేశ్వరునికి సంబంధించిన జ్ఞానమును పొందితే మనకు ఒరిగే దేమిటి? భగవంతుని తెలుసుకున్నంత మాత్రాన మనకు జరామరణాలు ఎలా దూర మవుతాయి? బ్రహ్మమును తెలుసుకొనే వాడు బ్రహ్మమే అవుతాడు కనుక ***(బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి, బ్రహ్మవిత్ ఆప్నోతి పరమ్)***.

**ఆశ్రయ ఫలం**

బ్రహ్మము అంటే ఏమిటి? ***ప్రత్యస్త మితభేదం యత్ సత్తామాత్ర మగోచరమ్। వచసా మాత్మ సంవేద్యం తత్ జ్ఞానం బ్రహ్మ సఙ్గితమ్ ॥*** - ఏది సత్తామాత్రమో, జ్ఞానస్వరూపమో, అభేదస్వరూపమో, వాచామగోచరమో, ఆత్మసంవేద్యమో అదే బ్రహ్మము.

బ్రహ్మమును అఖండంగా తెలుసుకోవడము అంటే, తాను బ్రహ్మము కన్నా అన్యము కాదని బ్రహ్మమును తెలుసుకోవడమే. అంటే తానూ బ్రహ్మమే అనే జ్ఞానాన్ని పొందడమే. నీవు బ్రహ్మము కాకుండా బ్రహ్మమును తెలుసుకో లేవు. ఎందుకని? నీవే బ్రహ్మము కనుక. బ్రహ్మజ్ఞానాభ్యాసము చేసే వాడు బ్రహ్మమే. జ్ఞానాభ్యాసంలో ఆ బ్రహ్మము తానే అనే జ్ఞానమే ఆశ్రయ ఫలం. కనుక, పరమేశ్వరుని ఆశ్రయించి, జ్ఞానాభ్యాసము చేత ఆత్మ బ్రహ్మమును తెలుసుకుంటాడు ***(తత్ బ్రహ్మ విదుః)***. బ్రహ్మమును అఖండ మని గ్రహించడం చేత ఆత్మ యైన తాను కూడా బ్రహ్మమే అని తెలుసుకుంటాడు ***(సమస్తమ్ అధ్యాత్మం ప్రత్యగాత్మ విషయం వస్తు తత్ విదుః)***. అంతే కాదు, బ్రహ్మమును తెలుసుకోవడానికి జ్ఞానాభ్యాసంలో సాధనము లైన శ్రవణ మనన నిదిధ్యాసలు జ్ఞానకర్మ లన్నీ కూడా జ్ఞానస్వరూపమే. కనుక, అవి కూడా అఖండ బ్రహ్మజ్ఞానం కన్నా వేరుగా లేనందున, జ్ఞానకర్మ లన్నీ కూడా బ్రహ్మస్వరూపం గానే తెలుసుకుంటాడు ***(కర్మ చాఖిలం విదుః)***. అఖండాత్మకు దేహమే లేనందున జరామరణాలు లేవని తెలుసుకొని సర్వోపద్రవాల నుండి విముక్తిని పొందుతాడు. ఇదే పరమేశ్వరాశ్రయ ఫలం. అదే మోక్షము.

*బ్రహ్మమును తెలుసుకొని, సమాహితచిత్తు లైన వారు మరణ కాలమున సైతము బ్రహ్మమునే తెలుసుకుంటారు అని చెబుతున్నాడు.*

**సాధిభూ తాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః ।**
**ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః ॥** 30

***సాధిభూతాధిదైవం-మాం-సాధియజ్ఞం-చ-యే-విదుః***
***ప్రయాణకాలే-అపి-చ-మాం-తే-విదుః-యుక్తచేతసః***

| | | | |
|---|---|---|---|
| యే | = ఎవ్వరు | తే | = వారు |
| మాం | = నన్ను | ప్రయాణకాలే అపి చ | = మరణకాలము నందు కూడా |
| సాధిభూతాధిదైవం | = అధిభూత అధి దైవతములతో గూడిన వానినిగ | యుక్తచేతసః | = యోగయుక్తులై |
| | | మాం | = నన్ను |
| సాధియజ్ఞం చ | = అధియజ్ఞముతో గూడిన వానినిగ | విదుః | = తెలుసుకుంటారు |
| విదుః | = తెలుసుకుంటున్నారో | | |

**అర్జునా! అధిభూతం, అధిదైవం, అధియజ్ఞం నేనే. ఇలా నన్ను అర్థం చేసుకున్న వాళ్ళు మరణ కాలంలో కూడా, నా యందే మనస్సు నుంచి నన్ను తెలుసుకుంటారు.**

**వ్యాఖ్య**

హృదయంలో జ్ఞానరూపు డైన ప్రత్యగాత్మయే బ్రహ్మమై ఉన్నాడు. అతడే పృథివ్యాది భూత ప్రపంచ మంతా విస్తరించి యున్నాడు. సూర్య చంద్ర తారకాదుల యందు అతడే ప్రకాశిస్తున్నాడు. సర్వాకారమై ఉన్న సర్వేశ్వరుని ఎవడు తెలుసుకుంటున్నాడో, అతని నియమిత చిత్తము మరణ కాలములో కూడా బ్రహ్మము నందే ఉంటుంది. కారణం, బ్రహ్మము తానే కనుక. జీవించి యున్న సమయంలో సర్వమూ బ్రహ్మమయంగా చూచిన వారు ప్రాణ ప్రయాణ సమయంలో అదే స్థితిలో ఉంటారు. అదే బ్రాహ్మీస్థితి ***(ఏషా బ్రాహ్మీ స్థితిః)***. ఏడవ అధ్యాయము ఈ విధమైన పూర్ణ జ్ఞానంతో సమాప్త మైంది.

బ్రహ్మము, ప్రత్యగాత్మ చైతన్యము, శ్రవణ మనన నిదిధ్యాస లనే జ్ఞాన సాధనలు అన్నీ బ్రహ్మ స్వరూపమే అని పూర్వ శ్లోకంలో అర్థం చేసుకున్నాం. ఇలా అధ్యాత్మ, అనగా ఆత్మ సంబంధమైన విషయాలే గాక, అధి భూతాలను, అంటే సర్వ భూతప్రపంచాన్ని కూడా పూర్ణబ్రహ్మ స్వరూపముగా తెలుసుకోవాలి. దానికి అనుకూలంగా కొన్ని క్రొత్త పదాలను అధ్యాయం చివర ప్రస్తుత శ్లోకంలో భగవంతుడు ప్రవేశ పెడుతూ పరిచయం చేశాడు. అవేమిటో, వాటి అర్థా లేమిటో తెలియజెప్ప మని అర్జునుడు ప్రశ్నించడముతో ఎనిమిదవ అధ్యాయము ప్రారంభ మవుతుంది. అధియజ్ఞము, అధిభూతము, అధిదైవము - ఇవన్నీ ఏమిటో, అవన్నీ ఎలా తన స్వరూపాలో అర్జునుని ప్రశ్నలకు సమాధానంగా భగవంతుడు బోధిస్తాడు. అధ్యాత్మమును ఈ అధ్యాయం లోనే అర్థం చేసుకున్నాం కదా! *(7 - 29)*.

కొన్ని అధ్యాయాల చివర, తరువాత అధ్యాయారంభంలో అర్జునుడు ప్రశ్నించే అవకాశాన్నే ఇవ్వకుండా పరమేశ్వరుడే ప్రేమతో ప్రవాహ రూపంలో చెప్పుకుంటూ పోవడం చూస్తాం. కొన్ని అధ్యాయాల ముగింపులో, తరువాత అధ్యాయారంభంలో అర్జునుడు ప్రశ్నించే అవకాశాన్ని తానే కల్పిస్తూ సమాప్తి చేయడం చూస్తాం. ఈ ఏడవ అధ్యాయం రెండవ కోవకు చెందింది. ప్రస్తుత అధ్యాయంలో ఏ నూతన మైన పదాలను పరమేశ్వరుడు





పరిచయం చేశాడో, తరువాత అధ్యాయారంభంలో అర్జునుడు వాటిని గూర్చి ప్రశ్నించడంతో, దానికి సమాధానంగా అక్షర పరబ్రహ్మము ప్రవచింప బడుతుంది. ఓం. ఓం. ఓం.

**ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం**
**యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విజ్ఞాన యోగో నామ సప్తమోఽధ్యాయః**

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు విజ్ఞాన యోగ మనే ఏడవ అధ్యాయము.**







# అకారాది శ్లోకానుక్రమణిక



## చతుర్థాధ్యాయము







# అకారాది శ్లోకానుక్రమణిక



## పంచమాధ్యాయము





చైతన్య భగవద్గీత

# అకారాది శ్లోకానుక్రమణిక

## షష్ఠాధ్యాయము







చైతన్య భగవద్గీత

# అకారాది శ్లోకానుక్రమణిక

## సప్తమాధ్యాయము